# అస్పర్శయోగం అనే భగవద్గీత



ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,

రాజమహేంద్రవరం - 533101.

# అస్పర్శయోగము
## అనే
# శ్రీ మద్భగవద్గీత

## రాజయోగీయము

ప్రథమ భాగము

( 6 అధ్యాయములు )



వ్యాఖ్యాత:
శ్రీ దయానంద పొన్నాల రాజయోగి,
సికింద్రాబాద్.







వెల రు. 4/-

# స్తోత్ర శ్లోకాః

శ్లో॥ కృష్ణం కమల పత్రాక్షం, పుణ్యశ్రవణ కీర్తనమ్,
వాసుదేవం జగద్యోనిం। నౌమినారాయణం హరిమ్॥

శ్లో॥ కృష్ణాయ యాదవేంద్రాయ జ్ఞానముద్రాయ యోగినే,
నాథాయరుక్మిణీశాయ । నమో వేదాంత వేదినే॥

శ్లో॥ ప్రపన్న పారిజాతాయ । తోత్రవేత్రైక పాణయే,
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృత దుహేనమః॥

శ్లో॥ సారథ్య మర్జునస్యాజౌ, కుర్వన్ గీతామృతందదౌ,
లోకత్రయోపకారాయ, తస్మైకృష్ణాత్మనేనమః॥

శ్లో॥ ఏకంశాస్త్రం దేవకీపుత్రగీత । మేకోదేవో దేవకీపుత్రఏవ।
ఏకోమంత్రో దేవకీపుత్రనామ।కర్మాప్యేకం దేవకీ పుత్రసేవా॥

---

# శ్రీ గీతా మహాత్మ్యము

ధరోవాచ :

శ్లో॥ భగవన్! పరమేశాన! భక్తిరవ్యభిచారిణీ.
ప్రారబ్ధం భుజ్యమానస్య; కథంభవతిహేప్రభో!॥ 1

భూదేవి పలికెను. భగవంతుడా, పరమేశ్వరా, ప్రభూ ప్రారబ్ధము ననుభవించు మనుష్యులకు జనన మరణ రహిత అచల స్థితి యెట్లు లభింపగలదు.?

శ్రీవిష్ణురువాచ :

శ్లో॥ ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరతః సదా,
సముక్తఃససుఖీలోకే కర్మణానోపలిప్యతే॥

శ్రీవిష్ణువు చెప్పెను. ప్రారబ్ధ భోగియగు మనుష్యుడు యెల్లప్పుడు గీతను అభ్యసించు చుండెనేని యిహలోకముననే ముక్తుడై సుఖించును కర్మమునందు లిప్తుడు కాకుండును.

శ్లో॥ మహాపాపాది పాపాని గీతాధ్యానం కరోతిచేత్।
క్వచిత్ స్పర్శం నకుర్వంతి నళినీదళ మంబువత్॥ 3

గీతాధ్యాన మొనర్చు చుండిన యెడల పద్మపత్రమును నీరుఅంటజాల నట్లు, మహాపాపములును అతిపాపములును కూడ అంటజాలవు అనగా నీటియందు పుట్టిన పద్మ పత్రమును నీరు యెట్లు అంటజాలదో అదే పద్ధతిగా ప్రారబ్ధ కర్మాను భవమునకు పుట్టిన మనుష్యుని. కర్మ అంట జాలదు.

శ్లో॥ గీతాయాఃపుస్తకం యత్ర యత్రపాఠః ప్రవర్తతే.
తత్రసర్వాణి తీర్థాని ప్రయాగాదీని తత్రవై॥ 4

శ్లో॥ సర్వే దేవాశ్చఋషయో యోగినఃపన్నగాశ్చయే,
గోపాలా గోపికాశ్చాపి నారదోద్ధవపార్షదైః॥ 5
సహాయోజాయతే శీఘ్రం యత్ర గీతా ప్రవర్తతే॥

యెచ్చట గీతా గ్రంథముండునో, (గీతాధనము వుండునో) మరియు నెచ్చట గీతా పాఠము రీతిగా ప్రవర్తన జరుగునో అచ్చట ప్రియాగాది సర్వతీర్థములు వెలయు చుండును. మరియు అచ్చట సమస్త దేవతలును ఋషులును యోగులును, పన్నగులును, నారదుడును వుద్ధవుడును, పార్షద సహితులగు గోపాలురను గోపికలను వుందురు. గీతాపఠనము జరిగెడుచోట వీరిసాహాయ్యము శీఘ్రముగనే లభించును

శ్లో॥ యత్రగీతావిచారశ్చ పఠనం పాఠనం శ్రుతమ్,
తత్రాహం నిశ్చితం పృథ్వి!నివసామి సదైవహి॥ 6

ఓ భూదేవి గీతలు విచారింపబడెడు తావునను గీతా పఠన పాఠన శ్రవణములు జరిగెడు చోటను నేను సర్వదా వాసమొనర్తునని నీవు నిశ్చితముగా గ్రహింపుము.

శ్లో॥ గీతాశ్రయోఽహంతిష్ఠామి గీతామేచోత్తమం గృహమ్।
గీతాజ్ఞానముపాశ్రిత్యత్రీన్లోకాన్పాలయామ్యహమ్॥ 7

గీతయే నాకాశ్రియము. గీతయే నాకు వుత్తమమగు గృహము. గీతాజ్ఞానము ననుసరించియే నేను త్రిలోకములను పాలించు చున్నాను.

శ్లో॥ గీతాయే పరమా విద్యాబ్రహ్మ రూపా నసంశయః।
అర్ధమాత్రాక్షరా నిత్యా స్వనిర్వాచ్య పదాత్మికా॥ 8

గీత నన్ను గురించి తెల్పెడి పరవిద్యయును బ్రహ్మరూపమును అయి యున్నది ఈ గీతా జ్ఞానము అవాంగ్మానస గోచరమును వినాశ రహితమును నిత్యమును అనిర్వాచ్యమును అను విషయమున సందేహము లేదు.

శ్లో॥ చిదానందేన కృష్ణేనప్రోక్తా స్వముఖతోఽర్జునమ్।
వేదత్రయీ పరానంద తత్త్వార్థ జ్ఞానసంయుతా॥ 9

వేదస్వరూపమును పరమానంద ప్రదమును తత్వజ్ఞాన బోధకమును అగు గీతను శ్రీ కృష్ణుడు స్వయముగా అర్జునునకు బోధించినాడు.

శ్లో॥ యోష్టాదశజపేన్నిత్యంనరో నిశ్చలమానసః,
జ్ఞానసిద్ధింసలభతే తతో యాతి పరంపదమ్। 10

గీతను దానియందలి నిర్ణయ పద్ధతిని తెలుసుకొని నిశ్చల చిత్తమున పఠించు వ్యక్తి, జ్ఞాన సిద్ధిని పొందును. పిదప నతడు జన్మరహితుడగును

శ్లో॥ పాఠేఽసమర్థః సంపూర్ణేతదర్ధం పాఠమాచరేత్,
తదా గోదానజంపుణ్యం, లభతేనాత్ర సంశయః॥ 11

గీతయందలి నిర్ణయ పద్ధతి తెలియక పఠించువారు సంపూర్ణ ఫలము పొందక భ్రాంతి జన్య ఫలము మాత్రము పొందగలరు. గోదాన పుణ్యం అనగా ఆవును దానము చేసినవాడు నేను పుణ్యాత్ముణ్ణని అనుకొని సంతోషించినట్లు గీతయందలి నిర్ణయ పద్ధతి తెలియక పఠించువాని పుణ్యము అంతగానే వుండును.

శ్లో॥ త్రిభాగం పఠమానస్తు గంగా స్నానఫలం లభేత్,
షడంశం జపమానస్తు సోమయాగ ఫలం లభేత్. 12

శ్లో॥ ఏకాధ్యాయంతు యో నిత్యం పఠతే భక్తి సంయుతః,
రుద్రలోక మవాప్నోతి గణో భూత్వా వసే చ్చిరమ్. 13

శ్లో॥ అధ్యాయంశ్లోకపాదంవా నిత్యం యః పఠ తే నరః,
సయాతి నరతాం యావ న్మనుకాలం వసుంధరే. 14

శ్లో॥ గీతాయా శ్లోకదశకం సప్త పంచ చతుష్టయమ్,
ద్వౌ త్రి ఏకం తదర్ధంవా శ్లోకానాం యః పఠే న్నరః 15

శ్లో॥ చంద్రలోక మవాప్నోతి వర్షాణా మయుతం ధ్రువమ్,
గీతాపాఠ సమాయుక్తో మృతో మానుషతాం వ్రజేత్. 16

శ్లో॥ గీతాభ్యాసం పునః కృత్వా లభతే ముక్తి ముత్తమామ్,
గీతేత్యుచ్చారసంయుక్తో మ్రియమాణో గతిం లభేత్. 17

శ్లో॥ గీతార్థశ్రవణాసక్తో మహాపాపయుతోఽపివా,
వైకుంఠం సమవాప్నోతి విష్ణునాసహ మోదతే. 18

మూడవ భాగము పఠించు వానికి గంగా స్నానఫలము లభించును. ఆఱవభాగమము పఠించు వానికి సోమ యాగఫలము లభించును. ఒక అధ్యాయము చదువు వానికి రుద్రలోకము దొరుకును. ప్రతి దినము ఒక అధ్యాయమును లేక నాల్గు శ్లోకములు పఠించువాడు మన్వంతరము వరకు మనుష్యుడై జన్మించును. పది, ఏడు, ఐదు నాలుగు, రెండు, మూడు. ఒకటిలేక అర్ధశ్లోకమును పఠించు మనుష్యుడు చంద్రలోకమున వెయ్యి సంవత్సరములు వుండును. యీ పద్ధతిగా గీత పఠించువాడు. మరణానంతరము మనుష్యుడై పుట్టును. యితర ములగు హీన జన్మల చేడు. అతడు మరల గీత పాఠమొనర్చి వుత్తమమగు ముక్తిని పొందును. మరియు మరణ సమయమున గీత శబ్దమునుచ్చరించిన సద్గతి లభించును.

గీతార్థమును శ్రవణము చేయనలయునని శ్రద్ధగలవాడు మహా పాపాత్ముడే యైనను వైకుంఠము పొంది విష్ణునితో గూడ ఆనందించును

# గీతోపదేశం



# అపూర్వయోగము అనే
# శ్రీమద్భగవద్గీత
## రాజయోగీయము
### ప్రథమాధ్యాయము
### అర్జున విషాదయోగము.

ధృతరాష్ట్ర ఉవాచ :

శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః,
మామకాః పాండవాశ్చైవకిమకుర్వత సంజయ ! 1

ఓ సంజయా! ఏ క్షేత్రమును ప్రజలు ధర్మక్షేత్రమని యందురో అట్టి కురుక్షేత్రమునకు పాండవులును, నా కుమారులును, యుద్ధము చేయుటకై వెళ్ళియున్నారు. వారు యేమిచేసిరో నాకు చెప్పుము. అని పుత్రమోహమున ధృతరాష్ట్రుడడిగెను.

సంజయ ఉవాచ :

శ్లో॥ దృష్ట్వాతు పాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా,
ఆచార్యముపసంగమ్య రాజా వచనమబ్రవీత్. 2

శ్లో॥ పశ్యైతాం పాండుపుత్రాణా మాచార్యమహతీంచమూమ్,
వ్యూఢాంద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా 3

పాండవులసేన వ్యూహాకారముగ చేరుటగాంచి, రాజగు దుర్యోధనుడు ద్రోణాచార్యుని కడకేగి, "మీవద్ద యుద్ధవిద్యాశిక్షణ పొంది నేర్చుకొనిన దృష్టద్యుమ్నుడు, ఈ వ్యూహము నేర్పరచినాడు. పాండవులసేన యేరీతిని విస్తరింపజేసెనో జూడుము:

శ్లో॥ అత్రశూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి,
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః ౪

శ్లో॥ ధృష్టకేతుశ్చేకితానః కాశిరాజశ్చ వీర్యవాన్,
పురుజిత్ కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః. ౫

శ్లో॥ యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్,
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః. ౬

అభిమానమునందు, బలమునందు, పరాక్రమమునందు భీమార్జునులతో సమానులగువారు ఈ సైన్యమునందున్నారు. చూడుము. సాత్యకి, విరాట్ రాజు, వీరశ్రేష్ఠుడగు ద్రుపదుడు, ధృష్టకేతువు, చేకితానుడు, కాశీరాజు, పురుజిత్తు, కుంతిభోజుడు, శైబ్యుడు, యుధామన్యుడు, ఉత్తమౌజుడు, అభిమన్యుడు, ఉపపాండవులు, మున్నగు మహారథులు గలరు.

శ్లో॥ అస్మాకం తు విశిష్టాయేతాన్నిబోధ ద్విజోత్తమ !
నాయకా మమసైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే. ౭

శ్లో॥ భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః,
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తిర్జయద్రథః. ౮

బ్రహ్మదేవుడుకూడ నిర్ణయించ జాలనంత సామర్థ్యముగల వీరులు, ప్రసిద్ధులగు శూరులు, మన సేనయందు గలరు. చూడుము. మీరు(అనగా)భీష్ముడు, కర్ణుడు, కృపాచార్యులు, వికర్ణుడు, అశ్వత్థామ సమితింజయుడు, సౌమదత్తుడు మొదలుగాగల వారలున్నారు.

శ్లో॥ అన్యేచ బహవశ్శూరా మదర్థే త్యక్తజీవితాః,
నానాశస్త్ర ప్రహరణాస్సర్వే యుద్ధ విశారదాః. ౯

శస్త్రవిద్యానేర్పరులు, అనగా, శస్త్రములు ముక్త, అముక్త, ముక్తాముక్త, యనిత్రివిధములు, ముక్తయనగా, చక్రాదులు; అముక్త యనగా, ఖడ్గాదులు; ముక్తాముక్తయనగా, నారాచాదులు (అచ్చము ఇనుముతో చేసినవి).

అస్త్ర, శస్త్ర ప్రయోగ మంత్రవిద్యలలో శత్రునాశనమునకు గాను, మారణ, ఆకర్షణ, స్థంభన, ఉచ్చాటన, మోహన క్రియల యందు నేర్పరులు.

తమ అవయవములు పరితాపముతో నిండియుండి. మల్ల విద్యయందు పరిపూర్ణమైన నేర్పు గలవారు, హృదయపూర్వకముగా త్రికరణశుద్ధితో, తమ ప్రాణములనైన లక్ష్యపెట్టక, నాకొఱకై (అనగా) ప్రభుభక్తిగలిగి నన్ను అనుసరించినవారు అసంఖ్యాకులున్నారు.

శ్లో॥ అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్,
పర్యాప్తం త్విదమే తేషాం బలం భీమాభిరక్షితమ్. ౧౦

శ్లో॥ అయనేషుచ సర్వేషు యథాభాగమవస్థితాః,
భీష్మమేవాభిరక్షంతు భవంతస్సర్వ ఏవహి. ౧౧

భీష్మ పితామహునిచే నిర్మింపబడిన ఈ సేన ఒక దుర్గమువలె శత్రువునకు దుర్భేద్యముగా, నేత్రములకు అపారముగా కన్పించుచున్నది. పాండవసేన చాలా కొద్దిది. పరిమితముగా తెలియుచున్నది. భీమసేనుడు సేనాధిపతిగా నుండి రక్షించుచున్నాడు. ఈ సేనకు మహావీరుడగు భీష్ముడు సేనాధిపతిగా నియమింపబడిరి. "మీరందఱు భీష్ముని ఆజ్ఞలను మన్నించి పాలించుడు. మహారథుల విభాగ పద్ధతిగా మీమీ సేనల నిర్ణయించుకొని భీష్ముని రక్షించుడు. ఎందుకనగా, ఈ సైన్య శక్తియంతయు వీరిపైన ఆధారపడి యున్నది." అని దుర్యోధనుడు చెప్పెను.

శ్లో॥ తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః,
సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్. ౧౨

శ్లో॥ తతః శంఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః.
సహసైవాభ్యహన్యంత స శబ్దస్తుములోఽభవత్. ౧౩

సేనాధిపతియగు భీష్ముడు, రాజగు దుర్యోధనుని మాటలువిని, సంతోషచిత్తుడై, దుర్యోధనునకు, ఆనందము కలుగునట్లు శత్రుసేనకు భీతికలుగునట్లు, సింహనాదము చేసి శంఖమును ఊదెను. పిమ్మట, అసంఖ్యాకములగు శంఖములు, భేరులు, ఢక్కలు, రణశృంగములు ఒకేసారిగా వాయింపబడెను. అందువలన, ఎంతటి వీరులకైనా అచ్చట నిల్చుటకు భయంకరముగా నుండెను.

శ్లో॥ తతః శ్వేతైర్హయైర్యుక్తే మహతిస్యందనేస్థితౌ,
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః. ౧౪

శ్లో॥ పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః,
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః. ౧౫

శ్లో॥ అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః
నకులస్సహదేవశ్చ సుఘోష మణిపుష్పకౌ. ౧౬

భయంకరమగు రణభేరులు వినినపిదప, తెల్లగుఱ్ఱములతో కట్టబడిన గొప్ప రథమున శ్రీకృష్ణుడు, అర్జునుడు దివ్యములగు శంఖద్వయమును (అనగా) పాంచజన్యమను శంఖమును, హృషీకేశుడగు శ్రీకృష్ణుడును, దేవదత్తమను శంఖమును ధనంజయుడను అర్జునుడును ఊదిరి. ధర్మరాజు అనంతవిజయమను శంఖమును, నకులుడు సుఘోషమను శంఖమును, సహదేవుడు మణిపుష్పకమనెడి శంఖమును ఊదిరి. ఈ శంఖారావముల వలన, కౌరవసేన రణవాద్యములు ఆగిపోయెను. వారలకు ఈ శంఖధ్వనులు భయంకరముగా తోచసాగెను.

శ్లో॥ కాశ్యశ్చ పరమేష్వాస శ్శిఖండీ చ మహారథః,
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః. ౧౭

శ్లో॥ ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే!
సౌభద్రశ్చమహాబాహు, శ్శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్ ౧౮

శ్లో॥ సఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్,
నభశ్చ పృథివీంచైవ తుములో వ్యనునాదయన్. ౧౯

ఓ ధృతరాష్ట్ర భూపతీ! ఆ సమయమును కాశీరాజు, శిఖండి, ధృష్టద్యుమ్నుడు, విరాటుడు, సాత్యకి, ద్రుపదుడు, ద్రౌపదీ పుత్రులు, అభిమన్యుడు మొదలగువారు నలుసైపుల నుండి వేరువేరుగా తమ తమ శంఖములను ఊదిరి. అట్టి ధ్వని భూమ్యాకాశములు ఆవరించి దుర్యోధనాదుల హృదయములు భేదించి కంపన మొనర్చెను.

శ్లో॥ అథవ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః,
ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాండవః ౨౦

శ్లో॥ హృషీకేశం తదా వాక్యమిదమాహ మహీపతే,

ఓ మహీపతీ! ఉభయ సైన్యములు యుద్ధసన్నద్ధులుకాగా కపిధ్వజుడగు అర్జునుడు గాంచి తన విల్లునెత్తి శ్రీకృష్ణునితో నిట్లు పలికెను.

అర్జున ఉవాచ:

సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత. ౨౧

శ్లో॥ యావదేతాన్నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితాన్,
కైర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే. ౨౨

శ్లో॥ యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః,
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేర్యుద్ధే ప్రియ చికీర్షవః. ౨3

ఓ దేవా! ఉభయ సేనల మధ్యను సారథము నిలుపుము. ఎందు కనగా, దుర్బుద్ధి యగు దుర్యోధనుని హితులగు శూరులు యుద్ధము చేయుటకు యిటకు వచ్చియున్నారు. ముఖ్యముగా నేను యెవ్వరితోడ యుద్ధము చేయవలయునో, వారందరిని చూచుటకొరకు రథము నిల్పు మనియున్న అర్జునుని మాటలు ధృతరాష్ట్రునకు చెప్పి, సంజయు డిటు లనెను.

సంజయ ఉవాచ:

శ్లో॥ ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత!
సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్. ౨౪

శ్లో॥ భీష్మద్రోణ ప్రముఖత స్సర్వేషాం చ మహీక్షితామ్,
ఉవాచ పార్థ! పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి. ౨౫

ఓ ధృతరాష్ట్రా! అర్జునుడు శ్రీకృష్ణపరమాత్మతో నిట్లు చెప్పగా శ్రీకృష్ణుడు భీష్మద్రోణుల యెదుట, ఇతర రాజుల యెదుట, రెండు సేనల మధ్యగా రథశ్రేష్టమును నిల్పి, అర్జునా! ఇచట చేరియున్న ఈ కౌరవ సేనను చూడుమని చెప్పెను.

శ్లో॥ తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్,
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్
సఖీం స్తథా ౨౬

శ్లో॥ శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయోరుభయోరపి
తాన్ సమీక్ష్య స కౌంతేయ స్సర్వాన్ బంధూనవస్థితాన్ ౨౭

శ్లో॥ కృపయా పరయాఽఽవిష్టో విషీదన్నిదమబ్రవీత్

[illegible] రెండుసేనలయందున్న గురువులను, తాతలను, మేనమామలను, పుత్రులను, పౌత్రులను, స్నేహితులను చూచి అత్యంత మోహచిత్తుడై శ్రీకృష్ణభగవానునితో నిట్లు పలికెను.

అర్జున ఉవాచ:

దృష్ట్వేమం స్వజనం కృష్ణ! యుయుత్సుం సముపస్థితం. ౨౮
శ్లో॥ సీదంతి మమగాత్రాణి ముఖంచపరి శుష్యతి,
వేపథుశ్చ శరీరేమే రోమహర్షశ్చ జాయతే. ౨౯

శ్లో॥ గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే
నచ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః 30

ఓ శ్రీకృష్ణా! యుద్ధార్థమరుదెంచిన బంధువులనుజూడ నా అవయవములు పట్టు తప్పుచున్నవి. నా శరీరము వణకుచున్నది. రోమములు నిక్కుచున్నవి. గాండీవము చేతినుండి జారుచున్నది. చర్మము దగ్ధమగుచున్నట్లున్నది. మనస్సు చంచలత్వమునొందినది. స్థిరముగా నేను నిల్వజాలకున్నాను. మరియు అమంగళ సూచకములగు అపశకునములను జూచుచున్నాను.

# మోహ నిర్ణయము

## ఆకాశపంచకము

శ్లో॥ కామ[illegible] స్తథాలోభో భయం మోహనమేవచ
ఆకాశస్య గుణాః ప్రోక్తా స్సమాంశాః పరికీర్తితాః

కోరిక, క్రోధము, [illegible]భము, మోహము, భయము, ఈ అయిదు[illegible]

ఆ కా శ పం చ క ము.

కోరికయనగా:- ధన ధాన్యాది వస్తువాహన రూప[illegible] కాంక్షలు గల చిత్తవృత్తి, ఇది ఆకాశాంశమునందలి వాయువా[illegible] వలన కల్గును. దీనికి స్థానము కంఠము.

2. క్రోధమనగా:- తాను చేయునట్టి పనులకు విఘ్నముచేయు వానిని శిక్షించవలయుననే ఉగ్రతగల చిత్తవృత్తి. ఇది ఆకాశము నం దలి అగ్ని అంశము వలన కల్గును. దీని స్థానము ముఖము.

3. లోభమనగా:- తనకు లభించిన పదార్థ మితరుల కియ్య గూడదను, చిత్త వృత్తి. ఇది ఆకాశాంశమునందలి అవకాశాంశము వలన కలుగును. దీని స్థానము భ్రూమధ్యము.

4. మోహమనగా:- పుత్ర, పౌత్ర, కళత్రాదుల యందు మిక్కుటమగు ప్రేమ కలిగి యుక్తా యుక్తముల నెరుగని చిత్త వృత్తి. ఇది ఆకాశాంశమునందలి జలాంశము వలన కలుగును. దీని స్థానము నాభి.

5. భయమనగా:- తనయొక్క ధన, మాన, ప్రాణంబులకు భం గము కలుగగలదనే చిత్తవృత్తి. ఇది ఆకాశము నందలి పృథ్వ్యాంశము వలన కల్గును. దీని స్థానము హృదయము.

సీ॥ "కోరుట కామంబు, కోరినయర్థంబు కొనసాగకుండిన క్రోధ మగును," అనే న్యాయమున, రాయభాగాదులవలన రాజ్యకాంక్షసిద్ధిం చనందున పాండవులు క్రోధావేశులై యుద్ధభూమి కరుదెంచి యుద్ధ సన్నద్ధులై యుండగా అర్జునుడు, పుత్ర పౌత్ర, గురు, బంధు జనాళిని చూచి క్రోధమును విడనాడి మోహపరవశుడై చుక్కాని లేక సుడి గాలిలో చిక్కుకొని దరిదాపులు లేక అల్లాడుచుండు నావ రీతి అర్జు నుడు యుక్తాయుక్తము లెరుగని వాక్యములు పలుకుచున్నాడు. కామ, క్రోధ లోభ మోహ భయాదులు ఒక్క అర్జుననే భ్రమింపచేసినవనే నిర్ణయముకాదు. జంగమ జీవోపాధులలో ముఖ్యముగా మానవోపా ధిని అధికముగా భ్రమింపజేయును గనుక, ఆకాశ పంచకమగు కామ, క్రోధ, లోభ, మోహ, భయాదులు మానవాళికి ప్రథమ శత్రువులని తెలియవలెను.

శ్లో॥ నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ!
నచ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే. 3౧

ఓ కృష్ణా! పెక్కు విధముల యోచించి చూడగా యుద్ధమున స్వజనులను చంపగా గలిగెడి మేలును గ్రహింపజాలకున్నాను. గనుక, యుద్ధము చేయకుండుటే శ్రేష్ఠమని నాకు తోచుచున్నది. ఈయుద్ధము చేయకుండ కలిగెడి మేలు ఏదైనయున్నచో కలుగనిమ్ము.

శ్లో॥ నకాంక్షే విజయం కృష్ణ! నచ రాజ్యం సుఖాని చ,
కిం నో రాజ్యేన గోవింద! కిం భోగైర్జీవితేనవా. 3౨

శ్లో॥ యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగాస్సుఖాని చ,
తఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ. 33

శ్లో॥ అచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితా మహాః,
మాతులాః శ్వశురాఃపౌత్రాఃస్స్యాలాః స్సంబంధిన స్తథా 3౪

ఓ కృష్ణా! నేను యుద్ధమున జయముగోరను, రాజ్యభోగంబులు కూడ నాకక్కరలేదు. ఎందుకనగా, ఎవరికొరకు రాజ్యమును, సుఖమును, భోగమును, కోరుచుంటిమో, ఆ పుత్రపౌత్ర గురుబంధు జనంబులు తమ తమ ధన మాన ప్రాణంబుల పైన ఆశను వదలి యుద్ధసన్నద్ధులై నిలచియున్నారు. గనుక, నే నెవరిపై నా అస్త్రములను ప్రయోగించను?

శ్లో॥ ఏతాన్నహంతుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన,
అపిత్రైలోక్య రాజ్యస్య హేతోః కి న్నుమహీ కృతే. 3౫

శ్లో॥ నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతి స్స్యాజ్జనార్దన!
పాపమేవాశ్రయేదస్మాన్ హత్వైతానాతతాయినః 3౬

ఓ మధుసూదన ! ఒకవేళ వీరునన్ను చంపదలచినప్పటికీ వీరిని

తెలియక అంధులై యుద్ధమొనర్చుటకు సంసిద్ధులైనారు. కులక్షయము వలన కలుగు ఈ పాపమునుండి నేను ఏల తప్పించుకొనకూడదు? శ్లో॥ దుష్టోదూరవర్జితః, అను న్యాయమున, ఈ దుష్టులకు మనము దూరముగా నేల యుండకూడదు? ఈవిషయము నీవు యోచింపుము.

శ్లో॥ కులక్షయే ప్రణశ్యంతి కులధర్మా స్సనాతనాః,
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మో౽భిభవత్యుత. ౪౦

శ్లో॥ అధర్మాభిభవాత్ కృష్ణ! ప్రదుష్యంతి కులస్త్రియః,
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణ సంకరః. ౪౧

పరమేశ్వరోపాధియందుగల స్థావరజంగమ జీవోపాధులయందు ఒక తెలివిగలస్థావరంబులు, రెండు తెలువులుగలజలచరంబులు, మూడు తెలువులుగల పక్షులు, నాల్గు తెలువులు గలవి పశువులు. ఐదు తెలువులుగలవారు మానవులుగానున్నారు. తమ దుష్టత్వమువలన ఒకరినొకరు చంపుకొనినయెడల మానవజాతియంతయు నాశనమగును అందువలన పరంపరగా వచ్చే త్రికరణశుద్ధి రూపమగు మానవవంశాచారము పురుష శిక్షకులు లేనందున ప్రణశించి ఆత్మఘాతుకమగు నధర్మము పాలగుదురు. (అనగా) మానవత్వము విడనాడి పశుప్రాయులగుదురు), కులస్త్రీలు దుష్టులగుదురు.

ఎప్పుడిట్టి దుస్థితి కలుగునో అప్పుడు వర్ణ సంకర మేర్పడును. ఏలననగా.

శ్లో॥ అన్నాత్తేజో మనఃప్రాణ శ్చక్షుఃశ్రోత్రం యశోబలం
ధృతిశస్త్రి స్త్రధాశుక్లం పరాన్నం వర్జయేద్బుధః
( శంఖలిఖితస్మృతి )

అన్నమువల్ల తేజస్సు, ప్రాణము, కన్ను, చెవి, కీర్తి, బలము,

[illegible]స్థము, సంతతి సంక్షయ జ్ఞానము: యుత్పత్తికి కారణమగు శుక్లము, [illegible] కలుగుచున్నవి గనుక పరాన్నమును పెద్దలు వర్జించెదరు, ఎందుకనగా,

శ్లో|| పరాన్నేనతు భుంక్తేనా మైథునం యోగగచ్ఛతిః.
యస్యాన్నం తస్యతేపుత్రాః అన్నాచ్ఛుక్లం ప్రవర్తతే.

ఎవరికి పరుల అన్నము భుజించి వృద్ధి పొందిన మైథునమునల్ల పుత్రులు కలుగుచున్నారో, ఎవరి అన్నము వల్ల శుక్లము కలుగుచున్నదో వారి సంతానమగుచున్నది. పరమేశ్వరోపాధియందుగల జీవులు అన్నమువలనపుట్టి, అన్నమువలనపెరిగి, అన్నరూపమైన పృథివి యందు లయమును పొందుచున్నారు గనుక, భుజించు అన్నపానాదులు పాపరహితముగా యుండవలయును. అందువలన, దానినుండి తేజస్సు (ఓజస్సు) మనస్సు, ప్రాణము, శరీర అవయవంబులు, కీర్తి, బలము, ధైర్యము, ధర్మాధర్మ నిర్ణీత శాస్త్రజ్ఞానము ఉపాధికి కారణమగు శుక్లము, పరమేశ్వర సృష్టి నిర్ణయానుసారముండును. పాపభూయిష్ఠమైన అన్నము, (అనగా, లంచము, కూటసాక్ష్యము, జారత్వము, చోరత్వము, మొదలుగాగలవానివల్ల కలిగినదగు నెడల దాని నుండి ఉత్పన్నమగు శరీర అవయవంబులు మనస్సు, ప్రాణము, బలము, ధైర్యము, పరమేశ్వర సృష్టికి వ్యతిరిక్తముగా పాపరూపపద్ధతితో నుండును. గనుక, మనము వీరిని చంపినయెడల వీరిభార్యాపుత్రాదులను రక్షించువారులేక అధర్మ ప్రవర్తకులుగా త్రికరణశుద్ధి లేనివారలై పరాన్నముకైనాధారపడి బ్రతుకనేర్చిపాపాత్ములగుచున్నారు. అందువలన పరమాత్మ సృష్టియందు పరంపరగా ఉపాధియగుచున్న మానవోపాధి చెడి, పశుపక్షి క్రిమికీటకాది ఉపాధులు గలుగుచున్నందున మానవోపాధియొక్క వర్ణసంకరమగుచున్నది.

శ్లో॥ సంకరోనరకాయైవ కులఘ్నానాం కులస్య చ,
పతంతిపితరోహ్యేషాం లుప్తపిండోదక క్రియాః. ౪౨

మానవోపాధియొక్క వర్ణసంకరము నరకకారణమగుచున్నది. అనగా తిరిగిమానవోపాధి కలుగునంత వరకు నీచోపాధులగు క్రిమికీటక జంతుజాలములయందే ఉపాధి కలుగును గనుక నరకమని చెప్పబడును. మానవోపాధులు, ఇకముందు పుట్టబోవు ఉపాధులు ఇప్పుడు పుట్టి యున్న జీవులు, మానవధర్మ ప్రవర్తకులు (అనగా, ధర్మానుకూల (పిండ) అన్నపానా దులొసంగువారు) లేనందున నరకప్రాప్తి చెందెదరు.

శ్లో॥ దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః,
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చశాశ్వతాః. ౪౩

మరియు, వర్ణసంకరకారణములగు దోషములవలన మానవ కులనాశనమును సృష్ట్యాదినుండి వచ్చుచున్న మానవస్వధర్మమును సమూలముగా నశించుచున్నవి.

శ్లో॥ ఉత్పన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన!
నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ. ౪౪

శ్లో॥ అహో బత! మహత్ పాపం కర్తుం వ్యవసితావయమ్,
యద్రాజ్య సుఖలోభేన హంతుం స్వజనముద్యతాః. ౪౫

ఓ! జనార్ధన, స్వధర్మ భ్రష్టులగు మానవులు దీర్ఘకాలము నరకమున యుండగలరని ముందుగా వినియుండియూ, ఇట్టి ఘోరపాప మును జేయుటకు సంసిద్ధులమైతిమి. శరీరసుఖమునకు రాజ్య భోగం బులు గోరుచుంటిమి. శరీరసంబంధులగు బంధునాశనమునకు ప్రయ త్నించుచుంటిమి, గనుక, ఇట్టి మహాపాపము తగని పని గనుక

శ్లో॥ యది మామప్రతీకారమశస్త్రం శస్త్రపాణయః,
ధార్తరాష్ట్రా రణే హన్యుస్తన్మే క్షేమతరం భవేత్. ౪౬

అస్త్ర శస్త్రములులేని నిరాయుధుడనగు నన్ను బాణములచేత దుర్యోధనాదులు జంపిన, జంపనిమ్ము. అదియే మంచిది. గాని, మహా పాపరూపమైన ఈ యుద్ధము నేను చేయను. అని అర్జునుడు ఖిన్నుడుండెను.

సంజయ ఉవాచ:

శ్లో॥ ఎవ ముక్త్వార్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్,
విసృజ్య సశరం చాపం శోక సంవిగ్నమానసః. ౪౭

అర్జునుడిట్లు పలికి, ఎక్కు పెట్టిన విల్లును విడిచి శోక మోహ స్వరూపచిత్తుడై రథమున గూర్చుండెనని ధృతరాష్ట్రునితో సంజయుడు చెప్పెను.

క్రమముగా కామ క్రోధమోహ భయకంపితమగు చిత్త వృత్తి గల అర్జునునకు పరమాత్మయగు శ్రీకృష్ణుడు ఏ పద్ధతిగా అచల పరిపూర్ణస్థితి కలుగజేసెనో, ఆ పద్ధతి రెండవ అధ్యాయమున వివరించ దగును. పాఠకులు గ్రహించెదరుగాక,

శ్రీకృష్ణార్జున సంవాద మగు అపూర్వయోగమను భగవద్గీత యందు అర్జున విషాదయోగముఅనే ప్రథమాధ్యాయముసంపూర్ణము.

# అస్పర్శయోగము అను భగవద్గీత

## ద్వితీయాధ్యాయము

### సాంఖ్యయోగము

సంజయ ఉవాచ:-

శ్లో॥ తం తథాకృప యాఽవిష్టమశ్రుపూర్ణా కులేక్షణమ్,
విషీదంతమిదం వాక్యమువాచ మధుసూదనః ౧

ఓ ధృతరాష్ట్ర మహారాజా! వినుము, అడుసులోబడిన మూన వృషు ఆధారమగు చోటుగానక శోకించునట్లు, భయకంపితచిత్త వృత్తిగల అర్జునుడు కర్తవ్యజ్ఞాన మూఢుడై రథముపై చతికిలబడుట శ్రీకృష్ణభగవానుడుచూచి అతనితో నిట్లనెను.

శ్రీభగవానువాచ:-

శ్లో॥ కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్,
అనార్యజుష్ట మస్వర్గ్యమ కీర్తికర మర్జున. ౨

శ్రీకృష్ణుడు పల్కెను,

అర్జునా, యుద్ధము చేయుటకు సంసిద్ధముగానున్న ఈ సమయమందు, శృ॥ దుర్లభం మానుషం దేహా, మనే న్యాయమున దుర్లభమైన మానవోపాధికి తగనిది నరక ప్రాప్తి కలిగించునది అపకీర్తిదాయకమైనది ఈ హృదయ దౌర్బల్యము నీకెట్లు కలిగినది?

శ్లో॥ క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే,
క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప! 3

ఓ అర్జునా! నీ హృదయ దౌర్బల్యమునకు కారణమేమొ గ్రహించక పొరబడినావను విషయమునకు ఏలాటి సందేహములేదు. ఎందుకనగా, వీరిని నీవు ఇంతకుపూర్వముచూచియుండలేదా? నీబంధువులుగా

నీకీ సమయముననే కల్పించినారా! భయకంపిత మొనర్చు నీహృదయ దౌర్బల్యమును విడచి, ధైర్యము వహించి యుద్ధమొనర్చుము. అన్నను,

అర్జున ఉవాచ:-

శ్లో॥ కథం భీష్మమహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన!
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరి సూదన! ౪

శ్లో॥ గురూనహత్వా హి మహానుభావాన్
శ్రేయోభోక్తుం భైక్ష్య మపీహలోకే,
హత్వార్థ కామాంస్తు గురూని హైవ
భుంజీయ భోగాన్ రుధిర ప్రదిగ్ధాన్. ౫

శ్లో॥ నచైత ద్విద్మః కతరన్నోగరీయో
యద్వాజయేమయ దివానోజయేయుః
యానేవ హత్వా న జిజీ విషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ౬

అర్జునుడు పలికెను:-

శత్రుమర్దనుడవగు ఓ మధుసూదనా! పూజనీయులగు భీష్మ ద్రోణులతో యుద్ధము నేనెట్లు చేయగలను? ఎందుకనగా, ఈ భీష్మ ద్రోణులు నాకు ధనుర్విద్యనేర్పి నాకెంతయో మేలుజేసిరి. అట్టి వారిని యుద్ధములో చంపుటకంటె ఆ పిమ్మట రాజ్యసుఖ మనుభవించ వలయును, అట్టి సుఖభోగములకంటె బిచ్చమెత్తుకొని జీవించుటయో లేక అరణ్యవాసములో నివసించి కందమూలాది ఫలములు భక్షించి జీవించుటయో మేలు. మరియు ఈ యుద్ధమందు మనలను వారు జయింతురో లేక మనము జయింతుమో నిర్ణయించ లేకున్నాను. ఎవరిని చంపి జీవించవలెనో వారు మనయెదుట నున్నారు. అందువల్ల యుద్ధము

చేయుట మంచిదా? ఈ యుద్ధమునుండి తప్పించుకొనుట మంచిదా? నాకు తెలియకున్నది.

శ్లో॥ కార్పణ్య దోషోప హతస్వ భావః
పృచ్ఛామిత్వాం ధర్మసంమూఢ చేతాః,
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితంబ్రూహితన్మే
శిష్యస్తేఽహం శాధి మాంత్వాం ప్రపన్నమ్ ౭

కామ క్రోధ లోభాన్వితమగు భీతి నా అంతఃకరణ నావరించి నన్ను పశుప్రాయుని చేసినది. పశువుల దృష్టి తమవరకే ప్రకాశించి సామాన్యజెంది యుండును. ఆస్థితియే నాకిప్పుడు తటస్థించినది. అందువల్ల ఏది హితమో, యేది అహితమో నాకు తెలియకున్నది. గనుక నాకు తల్లివి, తండ్రివి, దాతవు, వల్లభుడవు, బాంధవుడవు, వసుధీశుడవు తెల్లమిగ దేవుడవు గనుక నాకు ఏయ్యది శుభకరమో అది నిశ్చయించి చెప్పుము. నేను నీకు శరణాగతుడను, శిష్యుడను

శ్లో॥ నహి ప్రపశ్యామి మమాప నుద్యా
ద్యచ్ఛోకముచ్ఛోషణ మింద్రియాణామ్
అవాప్య భూమావసపత్న మృద్ధమ్ రాజ్యం సురణా
మపిచాధిపత్యమ్ ౮

ఈ గురుబంధు జనాళిని చూచినప్పటినుండి వంటగడని పొగ గ్రమ్ముకొని మలిన మొనర్చినట్లు మోహాంధకారము నా అంతఃకరణమును ఆవరించి మలిన మొనర్చినది. అందువలన, ఎండు సొరకాయ సముద్ర మధ్యమున నున్నయెడల స్థిమితములేక ఎట్లు చలించునో అట్లు నాజ్ఞానకర్మేంద్రియములు స్థిమితము లేక చలించు చున్నవి. శతృవిహీనమైన భూలోక రాజ్యమేకాదు, స్వర్గాధిపత్యము కలిగినను కూడ శోక రహితమగు ఇంద్రియ స్థిరత్వము కలుగునట్లు లేదు.

...

శ్లో॥ ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః,
న యోత్స్య ఇతిగోవింద ముక్త్వా తూష్ణీం బభూవహ. ౯

సంజయ ఉవాచ:-

శ్లో॥ తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత!
సేనయోరు భయోర్మధ్యే విషీదంతమిదం వచః ౧౦

ఓ కృష్ణా! యేమైన కానిమ్ము. నేనీ యుద్ధము చేయనని నిస్సం దేహముగా చెప్పుచున్నాను, అని మౌనము దాల్చెను. ధృతరాష్ట్రా! రెండుసేనలమధ్య విషాదగ్రస్తుడైయున్న అర్జునుని శ్రీకృష్ణుడు చూచి పరిహాసించువానివలె చిరునగవుతో నిట్లనెను,

శ్రీ భగవానువాచ:-

శ్లో॥ అశోచ్యానన్వ శోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే,
గతాసూన గతా సూంశ్చనాను శోచంతి పండితాః ౧౧

శ్రీకృష్ణ భగవానుడు పలికిన దేమనగా,

దుఃఖింప దగనివారిని గుఱించి దుఃఖించు చున్నావు. జ్ఞానివలె భాషించు చున్నావు. నిజము తెలిసినవారు చచ్చినవారిని గుఱించియు బ్రతికియున్నవారిని గుఱించియు దుఃఖింపరు.

దుఃఖింప దగని వారెవరనగా:-

జంగమ జీవులలో అధిష్టానచేతన సత్తాధిక్యతకలిగి ఉపాధియగు చున్న మానవోపాధియొక్క ఆధిక్యత విస్మరించి మారణ, మోహన, స్థంభన, ఉచ్చాటన, ఆకర్షణ, ఇంద్రజాల, మహేంద్రజాల విద్యలచే ప్రపంచమును బాధించు రాక్షస ప్రకృతి గలవారెంత తొందరగ నశిం చిన మానవ సమాజమునకు అంత తొందరగా మేలు చేకూరగలదు. గనుక, ఇట్టి పద్ధతిగలవారు చంపబడుదురు గదాయని దుఃఖించ నవ సరము లేదు.

# జ్ఞా ని ల క్ష ణ ము

అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనంద మయములను పంచకోశములుప్రకృతిజన్యములు. హిరణ్మయకోశమగు చేతనము పరబ్రహ్మ స్వరూపము. ప్రకృతి అశాశ్వతము. అధిష్టానచేతనబ్రహ్మము శాశ్వతముగా నున్నను ప్రకృతిబద్ధమువల్ల పరబ్రహ్మ మగు అధిష్టానము నేను నాదియని వ్యవహరించుచున్నది. అట్టి వ్యవహారము ప్రకృతియొక్క భ్రాంతిజన్యమేకాని పరబ్రహ్మ వ్యవహారము కాదు అను పద్ధతిగల పెద్దలు జ్ఞానులు, ఇతరుల ధన, మాన, ప్రాణములు అపహరింపచూచువారిని హింసించినప్పటికీ ఆత్మద్రోహమగు మహాపాపమే. గాక "మమాత్మా సర్వభూతాంతరాత్మా"యనే శ్రుతికి అనర్థకము వచ్చునని నిశ్చయించి కొందరు ఉన్న ఊరిలో ఉండకుండ, భిక్షాటనమువల్ల బ్రతుకుచుందురు. లేక అరణ్యములకేగి కందమూలాదులు భక్షించెదరు. వీరే జ్ఞానులనబడుదురు. ఇట్టి జ్ఞానులవలన మానవ సమాజమునకెట్టి ప్రయోజనమునూ లేదు.

"నిజము తెలిసినవారే, పండితులు"

పురుషుని విడిచి పురుషశక్తి యుండనట్లు, బీజమును విడిచి వృక్షము, వృక్షమునువిడిచి బీజము ఉండనట్లు, ఆత్మప్రకృతియనునవివేరు కావు. ప్రకృతి పరిణామము ఆత్మ. ఆత్మ పరిణామము ప్రకృతియుగా నున్నందున పుట్టింది, చచ్చింది,యన్న గురుతేకాని, నిజమువిచారించిన యెడల అది పుట్టాలేదు, చావనూలేదని తెలియును; గనుక, పండితులు (ఉన్నదున్నట్లు నిజము తెలిశినవారు) చచ్చిన వారిని గురించి. బ్రతికియున్నవారిని గురించి దుఃఖింపరు.



శ్లో॥ న త్వేవాహం జాతునాసం, నత్వం నేమే జనాధిపాః
న చైవ నభవిష్యామ సర్వే వయమతః పరమ్. ౧౨

ఓ అర్జునా! నేనును, నీవును, ఈ రాజులును ఒకప్పుడుంటిమి. ఇకమీదటనూ ఉందుము. ఎట్లనగా, నేను చెప్పబోవు విషయమును శ్రద్ధవహించి చక్కగా వినుము. బంగారము మూసయందుంచి అగ్ని స్పర్శవలన ద్రవరూపమొనర్చి ఎట్టి యాకారముగల దాని యందు బోసిన అట్టి యాకారమది వహించును. ఆకారము మారినంతమాత్రమున బంగారము లేక పోయినదా? మరియు, అగ్నిస్పర్శవలన బంగారము ద్రవరూపకము పొందక పోవునా? తప్పక ద్రవరూపకము పొందును. అట్లే స్థూలసూక్ష్మభాగములుగానుండు ఆత్మస్థూలసూక్ష్మాకారములుగా యెన్ని మార్పులు చెందినను ఆత్మ యుండునట్టిదే గనుక, ఆకారములు మారినంతమాత్రమున, మనము లేక పోవుచున్నామని యనుకోనరాదు.

శ్లో॥ దేహినోఽస్మిన్ యథాదేహే కౌమారం యౌవనం జరా,
తథా దేహాంతరప్రాప్తి ర్ధీరస్తత్ర న ముహ్యతి. ౧౩

ఆత్మయొక్క స్థూలభాగమగు శరీరము జనించినపిదప బాల్యము, యౌవనము దానియందే కలుగుచున్నవి. బాల్యావస్థలు నశించినట్లు కొందరు యెంచుచున్నారు. కాని అది పొరపాటు ఎట్లనగా, శరీరమందలి సర్వరూపములు యౌవ్వన కౌమారములందు పెంపొందినవేకాని నశించలేదు. అదే విధముగా ప్రతి ఉపాధియందు కర్మ నిర్మితముగా శరీరాత్మలకు మార్పుగలుగుచుండును గనుక, ఈ విధముగా వస్తు నిశ్చయము తెలిసినవారు దుఃఖమును పొందబోరు.

శ్లో॥ మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణ సుఖదుఃఖదాః,
అగమాపాయినోఽనిత్యాస్తాం స్తితిక్షస్వ భారత. ౧౪

ఓ! అర్జునా! అంతఃకరణ పరిణామమును జ్ఞానేంద్రియములచే తెలియబడు విషయేంద్రియ పంచకము, అనగా శబ్దస్పర్శరూపరసగంధ ముల యందు తనకు అనుకూలముగా యుండునది క్షేమకరమని తనకు ప్రతికూలముగా నుండునది దుఃఖకరమని అంతఃకరణమునందు నిర్ణ యించుకొని సుఖదుఃఖరూపములు పొందుచుండును. ఎట్లులనగా, శ్రో త్రముచే తెలియునది శబ్దము. అది నిందాస్పదముగా నున్నచో తనకు దుఃఖము కలిగించును. స్తుతిరూపకముగా నున్నచో సంతోషము కలి గించును. త్వగేంద్రియముచే తెలియునది స్పర్శ. ఇది భార్యా పుత్రా దులయొక్కయు పట్టుపీతాంబరములు నవరత్నఖచితనగలు హంస తూలికాతల్పములయొక్కయు స్పర్శసంతోషము కలిగించును. భార్యా పుత్రాది బంధువియోగంబును. పట్టుపీతాంబరాది నవరత్న ఖచిత భూషణాదులయొక్క వియోగమును కటికనేల పడకయు దుఃఖము కలిగించును. నేత్రేంద్రియముచేత తెలియునది రూపము. ధనధాన్య వస్తువాహనాదులున్నా ఆరోగ్యవంతమగు జీవన పద్ధతులున్నా సౌఖ్య ము గలిగించును. వీనికి వ్యతిరిక్తముగు ధనధాన్యాభావమురోగబాధలు దు:ఖము కలుగజేయును. జిహ్వేంద్రియముచే తెలియునది రసము. ఇది తీపి, చేదు, కారము, ఉప్పు, పులుపు, వగరు అని ఆరువిధములు. రోగరహితముగానున్నప్పుడు ఈ రుచులు ఆనందదాయకముగా నుండు ను. వ్యాధిగ్రస్తులకు దుఃఖము కలిగించును. నాశికేంద్రియముచే తెలి యునది గంధము. ఇది సుగంధముగానున్న ఆత్మకు సౌఖ్యము. దుర్గం ధముగానున్న రోగాలను కల్గించును. కనుక యీ తన్మాత్రలు వ్యష్టి పద్ధతిగా గాక సమష్టి పద్ధతిగా అనుభవించువారలకు ఆత్మా నందము కలుగుజేయును.

అచల పరిపూర్ణ పరబ్రహ్మమును తెలిసినవారు కారు. యెందుకనగా యొకరిచేత చంపబడదు. అది యొకరిని చంపదు.

శ్లో॥ నజాయతే మ్రియతేవాకదా చిన్నాయం భూత్వా
భవితావానభూయః
అజోనిత్యశ్శాశ్వతోయం పురాణో నహన్యతే
హన్యమానే శరీరే॥ ౨౦

శ్లో॥ వేదాఽవినాశినం నిత్యం ఏనమజ మవ్యయమ్
కథంసపురుషః పార్థ! కం ఘాతయతి హన్తికమ్? ౨౧

ఈ పరిపూర్ణ మొకప్పుడు పుట్టుటలేదు. చచ్చుటలేదు. ఒకప్పు డుండి యొకప్పుడు లేనిదికాదు. దీనియందు పుట్టి చచ్చే స్థావరజంగమాత్మకమగు జీవేశ్వరోపాధులు నశించుచున్నను పరిపూర్ణ పరబ్రహ్మమును తెలిసికొన్న వ్యక్తి యేదిచచ్చునని యెంచును? దేనినిచంపును?

శ్లో॥ వాసాంసిజీర్ణాని యథావిహాయనవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయజీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ॥ ౨౨

మానవులు పాతవస్త్రమును తీసివైచి క్రొత్తవస్త్రమును ధరించునట్లు చైతన్యమగు జీవాత్మ యొక శరీరమును విడిచి మరొక శరీరమును ధరించును గనుక పరిపూర్ణపరబ్రహ్మము జడచేతన పద్ధతిగల జీవాత్మ కాదని తెలియుము.

శ్లో॥ నైనం ఛిందంతి శస్త్రాణి నైనందహతి పావకః
నచైనం క్లేదయంత్యాపోనశోషయతి మారుతః ౨౩

శ్లో॥ అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్యఏవచ
నిత్య స్సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః ౨౪

ఈ పరిపూర్ణ పరబ్రహ్మమనాది. అచలము,వుపాధిరహితముగా నున్నందున, అధిష్టానపరిణామమగుజడచేతనముగానున్న అస్త్రశస్త్రం

బులు పరబాహ్యమును ఛేదింపజాలవు. సూక్ష్మచేతనమగు బడబాగ్ని దహింపజాలదు. చైతన్య పరిణామమగు జలప్రళయము అచలపరిపూర్ణ పరబాహ్యమును తడుపనేరదు. మహావాయువు పరబాహ్యమును ఎండింపజాలదు. ఎందుకనగా అది జడాజడరూప పద్ధతిగలపరమాత్మనంటి పదార్థముగాదు. గనుక చీల్చబడదు. కాల్చబడదు. తడపబడదు. ఎండింప బడదు, ద్రవ్య గుణకర్మ సామాన్య విశేష సమవాయ అభావము అను పద్ధతులుగలది పదార్థమని చెప్పబడును.

శ్లో॥ అవ్యక్తోఽయమచింత్యోఽయమవికార్యోఽయముచ్యతే
తస్మాదేవం విదిత్వైనంనాను శోచితుమర్హసి॥ ౨౫

ఈ అచల పరిపూర్ణ పరబాహ్యము మానసేంద్రియములకు అగోచరము, అతీతము వికార రహితము (అనగా) జన్మాదులు బొందనిది, గనుక ఇది సత్యమని చెప్పబడుచున్నది. అచల పరిపూర్ణ పరబాహ్యమును తెలిసికొన్నచో నీకు దుఃఖముండదు.

శ్లో॥ అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసేమృతమ్.
తథాపిత్వం మహాబాహో! నైవం శోచితు మర్హసి ౨౬

శ్లో॥ జాతస్య హిధ్రువో మృత్యుర్ధ్రువం జన్మమృతస్యచ.
తస్మాద పరిహార్యే ఽర్థే నత్వం శోచితుమర్హసి ౨౭

దేహ స్వరూపమగు దేహి శరీరముతో పుట్టి శరీరముతో నశించినదిగా నీకు తెలియుచున్నను నీవు దుఃఖపడ నవసరము లేదు. ఏలయనగా, పుట్టినది చచ్చుట, చచ్చినది పుట్టుట వాని స్వధర్మమని ముందే చెప్పియున్నాను.

శ్లో॥ అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత!
అవ్యక్తనిధనాన్యేవ తత్రకా పరివేదనా ౨౮

ఓ! అర్జునా! ఈ భూతములన్నియు జన్మించుటకు పూర్వము

బీజవృక్ష న్యాయమున ఆకారములేనివిగా నుండును. జన్మించినపిమ్మట ఆకారముగలవిగా నున్నవి. లయమును పొందినప్పుడు ఆకారములేనివిగానే యగుచున్నవి. వీనికి మూలమగు చేతనము బంగారము వంటిది. బంగారము అనేక నగల రూపకముగా మారినను అగ్నియొక్క స్పర్శవలన ఆకార రహితమై ఏకత్వము ఎట్లుపొందునో, అట్లు చేతన పరిణామము జీవేశ్వర జగత్తు రూపమున అనేక ఆకారములు పొందినను ప్రళయమునందు ఏకత్వమగు చేతనముగానే అగుచున్నది గనుక

శ్లో॥ ఆశ్చర్య వత్పశ్యతి కశ్చిదేన మాశ్చర్య వద్వదతితథైవచాన్యః
ఆశ్చర్య వచ్చైనమన్య శ్శృణోతిశ్రుత్వాఽప్యేనం వేదనచైవ
కశ్చిత్ ౹౹ ౨౯

చేతన రూపకమగు ఆత్మ అంతఃకరణ అధిష్టానముగా నుండు నని నిశ్చయించుకొని బాహ్యాంతర ప్రపంచవృత్తులు మఱచి రూప తన్మాత్రతో అంతఃకరణ రూపంబున దృష్టినిలిపి అధికాభ్యాసమువలన కొందరు జడులై పోయినారు.

మఱికొందఱు చేతనాత్మయొక్క నామరూపనటనలను వర్ణించి వర్ణించి పూర్తిచేయలేక విరక్తులయి అనిర్వచనీయమని నిర్ణయించినారు.

మరికొందఱు చేతనాత్మయొక్క స్వరూపమునందు ఐక్యము పొందగలమని ఆసనముద్రి లక్ష్య అభ్యాసంబులు చేయుచు భ్రూమధ్య స్థానంబున లేదా సహస్రారమున లేదా నాసికాస్థానమున, చేతనాత్మయందు ఐక్యం పొందినామనియు విరాగులమనియు నానాపద్ధతులుగా ఉన్మత్తులవలె తిరుగుచున్నారు. ఈ చేతనాత్మను ఉన్నదున్నట్లు స్పష్టముగా తెలియక పోవుటకు కారణమేమనగా, దీని ఉపాధికి ఎచ్చట కూడా మూలములేదు. జీవేశ్వర జగదోపాధికి తాను మూలముగా

ఉండియున్నట్లు తెలియుచున్నందున అధిష్ఠానచేతన బ్రహ్మము ఎండ మావుల జలమువలె భ్రాంతిరూపకముగా తెలియుచుండును. అందు వలన దీనిని ఆశ్చర్యముగా చూచుచుందురు.

శ్లో॥ దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత!
తస్మాత్సర్వాణి భూతాని నత్వం శోచితు మర్హసి 30

ఓ! భారత! సకల దేశములయందు సకలవస్తువులయందు సకల శరీరములయందు బాహ్యాంతరములనే నిర్ణయములేక నిండి నిబిడీకృత ముగానున్నది, అచల పరిపూర్ణ పరబ్రహ్మము. దీనిని నాశన మొనర్ప వలయునని మనస్సు సంకల్పించినను వాక్కు మంత్రోచ్చారణ మొన ర్చినను హస్తపాద నేత్రంబులు సమ్మోహనాది అస్త్ర శస్త్రంబులు ప్రయోగించినను దానిని నాశనమొనర్పలేవు. సకల జీవోపాధులు తమ స్వధర్మమువలననే ఉత్పత్తిస్థితి లయములు పొందుచున్నవి. గనుక, ఈ నిర్ణయమునందు నీవు దేనికొఱకూ దుఃఖింపతగదు.

శ్లో॥ స్వధర్మమపి చావేక్ష్య న వికంపితు మర్హసి,
ధర్మాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య నవిద్యతే 31

ఓ అర్జునా! నిన్ను తరింపజేయునట్టి నీ స్వధర్మమగు క్షేత్ర ధర్మము మఱచిపోతివి. నీ స్వధర్మమగు క్షేత్రధర్మము నీకు తెలియ జేయుచున్నాను. దానిని తెలిసికొనినయెడల నీవిక్షేపలక్షణము నశిం చును. సృష్టియందుగల స్థావరజంగమాత్మకమగు జీవక్షేత్రంబులతో నీవు మానవక్షేత్రమందున్నావు. పంచతన్మాత్ర విషయజ్ఞానమేగాక సత్యాసత్య స్వరూపమగు వస్తునిశ్చయ జ్ఞానముకూడ దీనికి కలదు. అందువలన అసత్యపరులకు దుష్టశిక్షణ, సత్యస్వరూపులకు శిష్టపరిపాలన మానవక్షేత్ర స్వధర్మమై యున్నది. నీకు హాని కలిగినప్పటికి యీజగ త్తునకు ప్రళయము కలిగినప్పటికి నీ మానవ స్వధర్మము తప్పరాదు.

భార్యాపుత్రాది బంధువర్గ మోహామునను ధనధాన్యాది వస్తువాహన భ్రాంతివలనను శరీర ప్రాణనష్టదాయక భీతివలనను, నీ క్షేత్రధర్మము విడిచినయెడల మానవసమాజము వినాశనమగును. నీకు నీచయోని ప్రాప్తమగును. రాజమార్గమందు సంచరించువారికి ఎప్పుడూ ఏలాటి భీతియుండబోదో, స్వధర్మాచరణ పరాయణులకు ఏకాలమందు ఏదేశమందు ఏలాటిభీతి యుండబోదు. గనుక, ఓ అర్జునా! స్వధర్మము తెలిసికొని సంశయము రహితుడవై యుద్ధము చేయుము. ఇంతకన్న సులభపద్ధతి ఈ ఉపాధికి లేదు.

శ్లో॥ యదృచ్ఛయాచోప పన్నం స్వర్గద్వార మపావృతమ్,
సుఖినః క్షత్రియాః పార్థ! లభంతే యుద్ధమీదృశమ్. 32

ఓ! అర్జునా! పూర్వజన్మ పుణ్యావిశేషము గలవారికే స్వధర్మాచరణము కావించునవకాశము గలుగును. స్వయంవరాను కూలమైన కన్యను వరించి సంతోషపూర్వకముగా ఆహ్వానించినట్లు ఈ యుద్ధావకాశమును సంతోషపూర్వకముగా నాహ్వానించుకొనుము. నీవు దుఃఖపడవలసిన సమయముకాదు. ఎందుకనగా, దండి, మహాదండి, హంస, పరమహంస, పురుష, మహాపురుష అనువారలు సర్వసంగ పరిత్యాగులై యే గమ్యస్థానమును బొందుదురో నీవు ఈ యుద్ధమువలన అట్టి స్థానమును బడయగలవు.

శ్లో॥ అథచేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి,
తతః స్వధర్మం కీర్తించ హిత్వా పాపమవాప్స్యసి. 33

ఈయుద్ధము నొనర్పకుండిన నీ స్వధర్మమాచరించ నందువలన గలిగెడి పాపము నిన్ను ఆవరించును. మానవ సమాజము నిన్ను అనేకవిధములుగా నిందించును. అందువలన నీటినుండి వేరుపడిన మత్స్యమెట్లు తల్లడిల్లి నశించునో అట్లు నీవు నశించెదవు.

శ్లో॥ అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్,
సంభావితస్య చాకీర్తిర్మరణా దతిరిచ్యతే. ౩౪

లోకమాన్యుడగు వానికి అపకీర్తి మృత్యువుకన్న ఘోరమగు నదిగా యుండును. నీ అపకీర్తి చిరకాలమువరకు జనులు చెప్పుకొను చుందురు.

శ్లో॥ భయాద్రణా దుపరతం మంస్యంతే త్వాం మహారథాః,
యేషాం చత్వం బహుమతో భూత్వాయాస్యసి లాఘవమ్ ౩౫

శ్లో॥ అవాచ్య వాదాంశ్చ బహూన్ వదిష్యంతి తవాహితాః,
నిందతస్తవ సామర్థ్యం తతో దుఃఖతరన్నుకిమ్ ౩౬

ఓ! అర్జునా. నీవుభయపడి యుద్ధమునుండి పారిపోయినావని ఈ మహారథులు తలంతురు. ఇందువలన నీవు యుద్ధవీరుడవని ఎవ్వరిచేత మన్నింపబడుచుంటివో, ఇప్పటినుండి వారిచేతనే చులకనగాచూడబడె దవు. నీ శత్రువులగు దుర్యోధనాదులు నీముందునిలిచి నిన్ను అనరాని మాటలు అందురు. అందువలన నీకు అపారమగు దుఃఖము కలుగును.

శ్లో॥ హతోవా ప్రాప్స్యసి స్వర్గం జిత్వావాభోక్ష్యసే మహీమ్
తస్మాదుత్తిష్ఠ కౌంతేయ! యుద్ధాయకృత నిశ్చయః ౩౭

ఓ! కుంతీపుత్రా! యుద్ధమున నీ వసువులు బాసినచో స్వధర్మాచరణ పుణ్యమువలన స్వర్గసుఖము కలుగును. జయము కలిగినచో కీర్తివంతమయిన ఇహ భోగంబులు అనుభవింతువు. గనుక, నీ సంశయంబులు విడిచి నే జెప్పినది స్థిరమనినమ్మి ధనుర్బాణంబులను చేత నిడుకొని వెంటనే యుద్ధమును జేయుము.

శ్లో॥ సుఖదుఃఖే సమేకృత్వా లాభాలాభౌ జయాజయౌ
తతో యుద్ధాయ యుజ్యస్వనైవం పాపమవాప్స్యసి ౩౮

సుఖమునలనసంతోషము దుఃఖము వలనవ్యాకులత మనుష్యుడు పొందరాదు. ఎందుకనగా, సుఖమునకు మూలము దుఃఖము, దుఃఖమునకు మూలము సుఖమునైయున్నవి. ఎట్టులనగా భార్యాపుత్రాది ధనధాన్య వస్తువాహన చీని చీనాంబర హంస తూలికాతల్పంబులచే కలుగునట్టి స్థాయి సుఖమని నిర్ణయించుకొనినను వానివలన కలిగే దుఃఖము సకల మానవాళికి సామాన్య విదితము. మరియు

శ్రు॥ ఘనసుఖదుఃఖములు రెండు గనుపడె నీవై,

అను న్యాయమున పుట్టడము సుఖము: గిట్టడము దుఃఖము అనే నిర్ణయ మున్నది. ఎట్టులనగా, అతి దరిద్రతవలన అన్న పానాదులు లేక భిక్షాటన మొనర్చి, బ్రతుకు భార్యాభర్తలకు సంతానము కలిగిన యెడల వారుగూడ అమితమైన ఆనందము బొందుదురేగాని, తమకే బ్రతుకుతెరువు లేదు; తమకు కలిగిన సంతానమునెట్లు బ్రతికించగలమనే దుఃఖము వారికుండదు. ధనధాన్యాది పుత్రి పౌత్రి బంధు జనంబులతోనుండి నూట ఇరువది సంవత్సరంబులు బ్రతికి పూర్ణవృద్ధుడై చచ్చినవానిని గురించిగూడ దుఃఖించుచునే యుందురు. గనుక సుఖమనునది పుట్టడము, దుఃఖమనునది చావడమని, పెద్దలచే నిర్ణయించబడినది.

శ్రు॥ పునరపి జననం పునరపి మరణం,

అనే న్యాయమున, చచ్చినవాడుపుట్టును; పుట్టినవాడుచచ్చును; గనుక, దుఃఖమునకు మూలము సుఖము, సుఖమునకు మూలము దుఃఖమని నిర్ణయము. దేహధారియగు దేహికి జనన మరణములనే సుఖదుఃఖములు సహజములైనందున స్వధర్మాచరణ మొనర్చు మానవులు లాభనష్టములను సుఖదుఃఖములను పరిగణించరాదు. వానిని అంతః

కఠినములోనికి తేరాదు స్వధర్మాచరణమే మన ఆచరణ విధానము గనుక, ఈ యుద్ధము వలన రాజ్యము రానీ, రాకపోనీ దానిచింత మన కవసరములేదు గనుక, పాపభీతినివదలి యుద్ధము చేయుము.

శ్లో॥ ఏషాతేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగేత్విమాం శృణు
బుద్ధ్యా యుక్తోయయాపార్థ! కర్మబంధం ప్రహాస్యసి ౩౯

ఓ అర్జునా! జ్ఞానపరిణామమగు జ్ఞానేంద్రియ రూపమున శబ్ద స్పర్శ, రూప, రసగంధములను విషయపంచకము తెలిసి బుద్ధి రూపమున నిశ్చయించుట జ్ఞానస్వరూపమగు సాంఖ్యయోగమనియు, బుద్ధియొక్క నిశ్చయానుసారముగా కర్మేంద్రియములగు వాక్కు, పాణి, పాదము, గుహ్యము, గుదములచే యొనర్చుక్రియ, కర్మయోగమనియు నిర్ణయము. ఇందు జ్ఞానయోగమగు సాంఖ్యయోగమును ప్రబోధించి యున్నాను. బుద్ధియోగమగు కర్మయోగమును జెప్పుచున్నాను. వీని సమన్వయరూపమగు నిష్కామ్య కర్మ, జ్ఞానమునకు లభింపగ నేకర్మబంధము నిన్ను విడిచిపోవును.

శ్లో॥ నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో నవిద్యతే,
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ౪౦

కం॥ "జ్ఞానము నేనన నొక్కటె, జ్ఞానము నేవేరటంచు కనబోకుము"

అనే సిద్ధాంతరీత్యా బుద్ధియోగమగు కర్మయోగము జ్ఞానయోగమగు సాంఖ్యయోగము ఏకమేనని తెలియలేక,

కం॥ "తెలియుట జ్ఞానము దానిచె జరిగేపని కర్మమనుచు జనులు"

రెండువిధములుగా నిర్ణయించి పాపపుణ్యస్వరూపమగు సంసారబంధమున తగులుకొనుచున్నారు. జ్ఞానకర్మ సమన్వయ స్వరూపము

తెలిసి ఆచరించు కర్మయే మోక్షదాయకము గనుక సంసారబంధము నుండి తప్పించును. ఈ యోగము కర్మను విడువకుండగనే కర్తృత్వ రహిత స్థితి గలదిగా నుండును.

శ్లో॥ వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన!
బహుశాఖాహ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్ ౪౧

ఓ! అర్జునా! కర్మజ్ఞాన సమన్వయము చేసుకొన్నవారల నిశ్చయాత్మ - ఏకత్వముగా నుండును. కర్మ జ్ఞానములు వేఱనేవారల చిత్తము అనేక విధములుగా చంచలత్వము జెంది బహు ముఖములుగా నుండును.

శ్లో॥ యామిమాం పుష్పితాం వాచం ప్రవదంత్య విపశ్చితః,
వేదవాదరతాః పార్థ! నాన్య దస్తీతి వాదినః ౪౨
శ్లో॥ కామాత్మాన స్స్వర్గపరా జన్మకర్మ ఫలప్రదామ్,
క్రియావిశేష బహుళాం భోగైశ్వర్య గతిం ప్రతి ౪౩
శ్లో॥ భోగైశ్వర్య ప్రసక్తానాం తయాఽపహృత చేతసామ్,
వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే ౪౪

అర్జునా? కర్మేంద్రియములగు వాక్కు, పాణి, పాదము, గుహ్యము, గుదములు, తమోగుణ ప్రధానములని. విషయేంద్రియ పంచకమగు శబ్ద స్పర్శరూప రసగంధములు, రజోగుణ ప్రధానములని, శ్రోత్రముత్వక్కు, చక్షు జిహ్వ ఘ్రాణములను జ్ఞానేంద్రియములు సత్వగుణ ప్రధానములని, వీనిచే నొనర్చు కర్మఫలంబులవలన (జిహ్వోపస్థ విషయంబులగు) స్వర్గాది భోగంబులుకలుగునని వేదములయందు నిర్ణయించియున్నారు. అంతకు మించిన ప్రత్యక్ష ఫలంబులు వేరుగాలేవని అవివేకులగువారు తామునమ్మి ఇతరులను నమ్మించి ఉత్తమమైన మానవోపాధిని అనర్థదాయక మొనర్చుచున్నారు. ఎట్లులనగా. వివిధ

అధ్యాత్మ, ఆధిదైవిక, ఆధిభౌతిక విధానాచరణీయ కర్మ పరమాత్మ నిర్ణయ పద్ధతిగా ఆచరించుట ఉత్తమ విధానము. ఇదియే సమష్టి అంతఃకరణ విధానమని చెప్పబడును. అధ్యాత్మిక, ఆధిదైవిక అధిభౌతిక విధాన కర్మవ్యష్టి. అంతఃకరణవృత్తితో ఆచరించుట అధమ విధానమని చెప్పబడును. గనుక నీవు సమష్టి కర్మాచరణాపద్ధతిని ఆశ్రయించుము.

శ్లో॥ బుద్ధియుక్తో జహాతీహ ఉభేసుకృత దుష్కృతే,
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మ సుకౌశలమ్ ౫౦

శ్లో॥ కర్మజం బుద్ధియుక్తాహి ఫలం త్యక్త్వా మనీషిణః,
జన్మబంధ వినిర్ముక్తాః పదం గచ్ఛంత్య నామయమ్ ౫౧

శ్లో॥ యదాతే మోహ కలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి,
తదాగంతాஉసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్యచ॥ ౫౨

సమష్ట్యంతకరణ రూప కర్మాచరణగల యోగి సుకృత దుష్కృత రూప స్వర్గనరకంబుల భ్రాంతివిడుచును. గనుక, జ్ఞానము నేసన నొక్కటె. జ్ఞానము నేవేరటంచు గనబోకుసుమీ" అనే న్యాయమున కర్మ ఆచరించుము. ఇట్టి ఆచరణీయపద్ధతి యోగమని చెప్పబడును. ఇట్టి యోగయుక్త కర్మాచరణపరులు కర్మఫలంబులయందు చిక్కక జనన మరణ భ్రాంతిరహిత నిశ్చయము పొందుచున్నారు. గనుక నీబుద్ధియందలి విషయ పరంపరలు ఎప్పుడు విడిచిపోవునో అప్పుడు నీవు కూడ అట్టివాడవే యగుచున్నావు.

శ్లో॥ శ్రుతి విప్రతి పన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా,
సమాధావచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి ౫౩

అర్జునా! సమష్ట్యంతఃకరణవృత్తిగల కర్మాచరణవలన అనగా అధ్యాత్మిక, అధిభౌతిక, అధిదైవికపద్ధతులు నానావిధ కర్మనిర్మిత ఫల

శ్రుతులు వినినందున నీకు చిత్త చాంచల్యము గలిగినది. సమష్టి అంతః కరణ వృత్తిరూప విధానమును యోగమువలన నిశ్చలత్వమును స్థిరత్వ మును కలుగును. అట్టి స్థిరత్వము నీకు కలిగినపుడు అనగా, పరమాత్మ సమాధియందు, బుద్ధి నిశ్చయరూప ఆనందము నీవు పొందెదవు.

అర్జున ఉవాచ .

శ్లో॥ స్థిత ప్రజ్ఞస్య కా భాషా? సమాధిస్థస్య కేశవ;
స్థిత ధీః కిం ప్రభాషేత? కిమాసీత వ్రజేత కిమ్? ౫౪

కృష్ణా!

౧. సమాధియందుండు స్థిత ప్రజ్ఞుని లక్షణమేమి?

౨. అతడెట్లు పలుకును?

౩. అతడెట్లుండును?

౪. అతడు ఏ రీతిగ వ్యవహరించును?

శ్రీ కృష్ణ ఉవాచ :

శ్లో॥ ప్రజహాతి యదా కామాన్సర్వాన్పార్థ! మనోగతాన్
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థిత ప్రజ్ఞస్తదోచ్యతే ౫౫

శ్లో॥ దుఃఖేష్వను ద్విగ్న మనా స్సుఖేషు విగతస్పృహః,
వీతరాగ భయ క్రోధః స్థిత ధీర్ముని రుచ్యతే. ౫౬

జ్ఞాన పరిణామమగు జ్ఞానేంద్రియములచే విషయ పంచకము తెలిసి కర్మేంద్రియములచే కర్మ నొనర్చి వాసనత్రియ, ఈషణత్రియ ముల ఫలస్థితికి విషయవాసన అంతఃకరణమునందు నివసించియుండును. అందువలన, ఆత్మసుఖమునకు ఆటంకము కలుగు చుండును. ఆత్మ యొక్క వస్తు నిశ్చయము వలన, సమష్ట్యంతః కరణ వృత్తి గలిగి కోరికలు నిర్జీవమగును. అట్టి వాడే స్థిత ప్రజ్ఞుడని చెప్పబడును, తనకు అనుకూలముగా నుండని విషయములందు దుఃఖముగాని, అనుకూల

ముగానున్న విషయములందు సంతోషమునుగాని లేనివాడు భయ క్రోధములు లేనివాడు స్థిత ప్రజ్ఞుడని చెప్పబడును.

శ్లో॥ యః సర్వత్రానభిస్నేహ స్తత్తత్ ప్రాప్య శుభాశుభమ్,
నాభినందతి నద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥౫౭

వ్యక్తుల యెడలగల సకల విషయములయందు, సమస్త వస్తు సముదాయమునందు, ప్రియా ప్రియములు లేక సమాన ప్రతిపత్తి గలిగి సకల జీవోపాధులయందు సమముగా వర్తించును. అట్టివానిని స్థిత ప్రజ్ఞునిగా తెలిసి కొనుము.

శ్లో॥ యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ సర్వశః,
ఇంద్రియాణీంద్రియార్థే భ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥౫౮

ఓ! అర్జునా, తాబేలు తన అవయవములు నవసరాను సారముగా బయటకు తీయును. మరల తాను సమయములో లోనికి ముడుచుకొనునట్లు, ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక విధానములందు ప్రవర్తించు తన అంతఃకరణ వృత్తిని తనను సారముగా ప్రవర్తించనీయక పరమాత్మ పద్ధతిగా బాహ్యవృత్తులయందు ప్రవర్తింపచేసి. మరల తాను కాలములో నిర్వికల్పయమునను పరమాత్మ పద్ధతియగు తనయందు చేర్చుకొని యుండగలవాడు స్థిత ప్రజ్ఞుడని చెప్పబడును.

శ్లో॥ విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః,
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే. ॥౫౯

ఓ! అర్జునా! శబ్దస్పర్శరూప రసగంధములనునవి విషయేంద్రియములు. వాక్కు పాణి పాదపాయువు గుదములు కర్మేంద్రియములు ఇందు శబ్దము శ్రోత్రేంద్రియము చేతను, స్పర్శ త్వగింద్రియము చేతను, రూపము నేత్రేంద్రియము చేతను, రసము జిహ్వేంద్రియము చేతను, గంధము ఘ్రాణేంద్రియము చేతను, తెలియబడు చున్నవి.

వాగింద్రియము వచించును. పాణేంద్రియము ఇచ్చి పుచ్చుకొనును. పాదేంద్రియము గమనించును, గుహ్యేంద్రియము ఆనందించును. గుదేంద్రియము విసర్జించును. ఇందు మౌనముద్రచేత వాగింద్రియమును, బ్రహ్మాంజలిచేత పాణేంద్రియమును, స్వస్తికాసనముచేత పాదేంద్రియమును, కామదహన ఆసనముచేత గుహ్యేంద్రియమును, మూలబంధముచేత గుదేంద్రియమును, నిరోధించవచ్చును. ఇది కర్మేంద్రియ నిరోధము, పరావాక్కు నిర్మితమగు ప్రణవ పద్ధతి వలన శ్రోత్రేంద్రియమును, గగన విద్య వలన త్వగింద్రియమును అహంగ్రహోపాసన వలన చక్షురింద్రియమును, ప్రాణవిద్యవలన ప్రాణేంద్రియమును, నిరోధించనగును. గాని జిహ్వేంద్రియ నిరోధము ఎంతటి యోగపురుషునికైనసాధ్యముగాక యున్నది. ఎందుకనగా, ప్రపంచము గుహ్యానందము, సాత్వికమున బ్రహ్మానందము, ప్రాణసత్తా బాగా గాయున్నపుడే చక్కగా పొందగలరు. అన్నపానాదులున్న వారికే ప్రాణ సత్తాధిక్యత యుండగలదు. గనుక ఆసన ముద్ర లక్ష్యాది అభ్యాసములచేత ఎంతటి మహా మహులైనను రసనేంద్రియమును నిరోధించలేరు. రసనేంద్రియము ఉపాధికి బీజము వంటిది. ఎట్లనగా, జీవేశ్వర జగదోపాధులు పరిణామానంతరము అణురూపమైన గుప్తగా (ఏకముగ) యుండి, స్థావరజంగమాత్మకమగు ప్రపంచసృష్టిచేయునట్లు, యోగయోగాంగ సాధనలవలన సకలేంద్రియ వ్యాపారములుడయించి, అణురూపముగా రసగ్రాహ్యమగు జిహ్వేంద్రియము సంయుంచి, ప్రాణోపాధినిగావించి, ప్రాణపంచకమువలన కర్మపంచకము నిర్మించి, ఈ రెంటిసముదాయమువలన జ్ఞానేంద్రియపంచకమును స్థూల సూక్ష్మ ప్రపంచంబును నిర్మించివిషయవాసనలయందు బంధించును. గనుక రసేనేంద్రియనిరోధక పద్ధతియు పరమాత్మానుభవమును పొందద

మానవుడు స్థితప్రజ్ఞుడని చెప్పబడును.

శ్లో॥ యతతో హ్యపి కౌంతేయ! పురుషస్య విపశ్చితః;
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభంమనః ౬౦

ఓ అర్జునా! యమనియమాదుల వలన అష్టసిద్ధుల బడసి నను మంత్రలయ హఠరాజయోగంబులవలన అంతఃకరణ స్థిరత్వము జెందినను విరాట్టు హిరణ్యగర్భ అవ్యాకృత పరమాత్మోపాసన లొనర్చినను అహం బ్రహ్మాస్మియను బ్రహ్మవేత్తలకు గూడ అధో ఊర్ధ్వ పరిణామంబులుండును. అందువలన, ఈఇంద్రియంబులువిక్షేపమొనర్చిచీకాకు పర్చును గనుక ఇంద్రియముల బలము ఇంతయని నిర్ణయించుటకు వీలు లేక విచిత్రముగా యున్నది గనుక

శ్లో॥ తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః
వశేహి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ౬౧

ఓ అర్జునా! ఇంద్రియములయొక్క ఉపాధికి మూలమగు ఆత్మనిర్ణయము తెలిసి విషయలోభముత్యజించి ఇంద్రియములను ఏకత్వమొనర్చినవాడు నిశ్చలత్వమునందు సమర్థుడగును. ఇట్టి లక్షణయుతుడు స్థిత ప్రజ్ఞుడని చెప్పబడును.

శ్లో॥ ధ్యాయతో విషయాన్పుంస స్సంగస్తేషూపజాయతే,
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే ౬౨

శ్లో॥ క్రోధాద్భవతి సమ్మోహ స్సంమోహాత్స్మృతి విభ్రమః,
స్మృతి భ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి॥ ౬౩

ఓ అర్జునా! ఆత్మనిర్ణయ విధానమునందు ఇంద్రియములను ప్రవర్తింపజేసేపద్ధతి తెలియక ఇంద్రియములయొక్క విషయములందు వాంఛ గలుగుచున్నది. అట్టి వాంఛసిద్ధించనిచో క్రోధముగా మారుచున్నది క్రోధమువలన అవివేకముకలిగి స్వధర్మమునందు మఱుపుజనించి

మనుజుడు పశుప్రాయుడై పురుషార్థమునుండి సంపూర్ణముగా చెడిపోవు చున్నాడు.

శ్లో॥ రాగద్వేష వియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్,
ఆత్మ వశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి. ౬౪

సమష్ట్యంతఃకరణగల పురుషుడు సర్వ కర్మముల నాచరించుచు విషయేంద్రియములకు లోనుగాక ప్రియాప్రియపద్ధతులు లేక వివేక వంతమునుండును. ఎట్లనగా, అగ్నిని అగ్నితో కాల్చుటకు వీలులేనట్లు నీరును నీటితో వేరుచేయుటకు సాధ్యముకానట్లు సమష్ట్యంతఃకరణ వృత్తి గలవారిని ఏ ఇంద్రియములు బాధించలేవు.

శ్లో॥ ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోప జాయతే,
ప్రసన్న చేతసోహ్యాశుబుద్ధిః పర్యవతిష్ఠతి. ౬౫

వ్యష్ట్యంతఃకరణ వృత్తివలన అధ్యాత్మిక ఆధిభౌతిక తాపములు, విషయస్వరూప దుఃఖములు కలుగును. సమష్ట్యంతకరణ వృత్తిగల వారలకు అట్టి దుఃఖములు కలుగవు. ఎందుకనగా, అమృతపాన మొనర్చిన వానికి ఆకలిబాధ యుండనట్లు పరమాత్మస్వరూప అఖండా కృతియందుండువారు గనుక యే బాధలు ఉండవు. సంపూర్ణవృత్తి గలిగియుందురు.

శ్లో॥ నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా,
నచాభావయతః శాంతి రశాంతస్య కుతః సుఖమ్ ౬౬

శ్లో॥ ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే,
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమి వాంభసి. ౬౭

శ్లో॥ తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః,
ఇంద్రియాణీంద్రియార్థే భ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ౬౮

ఇంద్రియ సమన్వయము తెలియని వానికి వివేక బుద్ధి కలుగుట లేదు. విషయవాసనలు త్రిగుణముల రూపమున అంతఃకరణమునందు ప్రవేశించి బుద్ధియొక్క స్థిరత్వమును చలింపజేయు చున్నవి. అందు వలన, పరమార్థ పద్ధతియగు ఏకాగ్రత కావలయుననే కోరిక వానికి జనించుటలేదు. ఇట్టివానికి స్థిరత్వ పద్ధతిగల శాంతి ఎట్లు కలుగును? మఱియు విషయ పంచకమునందు ఏ విషయమును మనస్సు అనుస రించునో దాని పద్ధతిగానే ప్రవర్తించును. గనుక సకల భ్రాంతుల నుండి కడతేరినాననే అపోహతో లోకహితార్థము మఱియు తమ వినో దార్థము విషయేంద్రియములకు స్వాధీన మగునెడల వానిని పాతాళ మునకు అణచి అధఃపతన మొనర్చి పశుప్రాయుని జేయును; గనుక ఓ అర్జునా! ఎవ్వని ఇంద్రియములు శబ్దాది విషయ పంచకము వలన భ్రమించక స్థిరత్వము గలిగి యుండునో అట్టివాడు స్థిత ప్రజ్ఞుడని చెప్పబడును.

శ్లో॥ యా నిశా సర్వ భూతానాం తస్యాం జాగర్తి సంయమీ,
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ౬౯

స్థావర జంగమాత్మకమగు జీవోపాధుల మరణము అంధకార మగు రాత్రియని చెప్పబడును. ఇవి సంసారమును గాంచి పుట్టుట జాగ్రత్త యని చెప్పబడును. సకల జీవోపాధుల మరణరూప అంధ కారమునందు స్థితప్రజ్ఞుడు మరణ రహితమగు మెలకువగా నుండును. సకల జీవోపాధుల పుట్టుకయగు జాగ్రతావస్థయందు స్థిత ప్రజ్ఞుడు ఎఱుక మరుపులు మొఱుగని స్థితియందు ఉండును.

శ్లో॥ ఆపూర్యమాణమచల ప్రతిష్ఠం సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్
తద్వత్కామా యం ప్రవిశంతి సర్వే సశాంతిమాప్నోతి
నకామకామీ. ౭౦

నదులనుండి ఒడ్డుల నొరయుచు వాని నతిక్రమించి ప్రవహించు నీటి ప్రవాహము అతివేగముగా సముద్రమును ప్రవేశించినను సముద్రము తన హద్దును మీరక వానిని తనయందు లయపర్చుకొని స్థిరత్వమొనర్చునట్లు, విషయ స్వరూప కర్మేంద్రియములు గుణత్రయ సహాయముచే అంతఃకరణమును కలవర పెట్టిన వేమైనను సమష్టి పద్ధతి యగు అచలస్థితిచే వాని ఉద్రిక్తత తగ్గించి తనయందు లయము చేసి కొని తన స్థితిని చెడనీయక యుండునట్టివాడు స్థిత ప్రజ్ఞుడని చెప్పబడును గనుక,

శ్లో॥ విహాయ కామాన్య స్సర్వాన్పుమాంశ్చరతి నిస్పృహః.
నిర్మమో నిరహంకార స్సశాంతి మధిగచ్ఛతి. ౭౧

సమష్ట్యంతఃకరణ వృత్తి విధానము యెవనికి అలవడునో అట్టివాడు ఆత్మ స్వరూప నిశ్చయము గలవాడై అన్ని విధములగు కోర్కెలు విడిచి అహంకార రహితుడై సంచరించు చుండును. సుఖ దుఃఖ రహితమగు స్వరూపమున నుండును గనుక.

శ్లో॥ ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ! నైనాం ప్రాప్య విముహ్యతి,
స్థిత్వాఽస్యామంతకాలేఽపిబ్రహ్మ నిర్వాణ మృచ్ఛతి. ౭౨

ఓ! అర్జునా, ఇదియే బ్రాహ్మీస్థితి. ఈ పద్ధతి నెరిగినవాడు విషయ వాసనా రూపమగు మోహమును బొందరు. తుదకు మరణ సమయ మందైన ఈ పద్ధతి గలిగినవాడు బ్రహ్మత్వము పొందగలడు.

శ్రీ కృష్ణార్జున సంవాదమగు భగవద్గీతలందు సాంఖ్యయోగమనెడి ద్వితీయాధ్యాయము

....—....

# అస్పర్శయోగము అను శ్రీ మద్భగవద్గీత

రా జ యో గీ య ము

## తృతీయాధ్యాయము

## కర్మయోగము

అర్జున ఉవాచ:-

శ్లో॥ జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన!
తత్కిం కర్మణి ఘోరేమాం నియోజయసి కేశవ! ౧

అర్జునుడు పల్కెను:

జనార్ధన! కర్మాచరణకంటే జ్ఞానాచరణమే శ్రేష్ఠమని నీ అభిప్రాయముగా తోచు చున్నది. అదే నిజమగుచో నన్ను హింసాత్మకమగు కర్మనొనర్ప నియోగించుటకు కారణమేమి.

శ్లో॥ వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే,
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్. ౨

ఓ! దేవా, సందేహాస్పదంబులగు నీ వాక్యంబులు నా మనస్సును భ్రాంతియందు బడద్రోయు చున్నవి. గనుక, కర్మజ్ఞానములరెంటిలో దేనివలన నేను శ్రేయమును బడయగలనో నిశ్చయించి, చెప్పుము.

శ్రీకృష్ణ ఉవాచ:

శ్లో॥ లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ!
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్. ౩

శ్రీకృష్ణుడు! పలికెను:

ఓ! అర్జునా, నే నిదివరకు జెప్పిన వాక్యములు సరియైనవే. కాని వానిని నీవు చక్కగా నవగాహనము చేసికొన జాలక కలవర

పడుచున్నావు. ఎట్లులనగా, ఇంతకు ముందు నీకు జెప్పిన ఆత్మ నిర్మిత పద్ధతియందు (౨-౫౯) సాంఖ్యులగు జ్ఞానుల అనుష్ఠానము, కర్మ స్వరూపులగు యోగుల అనుష్ఠానము రెండు విధముల పద్ధతులు చెప్పి యున్నాను. ఎట్లులనగా, జ్ఞానపరిణామమగు జ్ఞానేంద్రియముల ద్వారా విషయ పంచకము దెలసి కర్మేంద్రియములద్వారా కర్మ యొనర్చుట జీవోపాధుల విధానమై యున్నది. ఇందు కర్మయోగుల విధాన మెట్లుదనగా, కర్మేంద్రియములగు వాక్కు, పాణి, పాదము, గుహ్యము గుదములయందు నియమ పద్ధతిగలిగి యమ, నియమ, ఆసన, ప్రాణా యామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులయందు ప్రవర్తిం చుచు వాని ఫలానుభవము పొందుచుండ వారుకర్మయోగులని చెప్ప బడుదురు. జ్ఞానయోగుల పద్ధతి ఎట్లులనగా, జ్ఞానేంద్రియములచేత తెలియబడు విషయ పంచకమును, మనో పద్ధతివలన బుద్ధిరూప నిశ్చ యము పొందనీయక జ్ఞానేంద్రియములద్వారా, బాటసారులు వచ్చి పోవు విధముగా పారద్రోలి సహజ రూపకర్మాచరణపరులై యుందురు ఇది జ్ఞానయోగులగు సాంఖ్యుల పద్ధతి ఈ విధానము నీకు చక్కగా తెలియునట్లు వస్తునిశ్చయముగా ప్రబోధించెదను శ్రద్ధగా వినుము. అందువలన నీకు గలిగిన కలవరము నశించును.

శ్లో॥ న కర్మణామనారంభాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే,
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ౪

మనుష్యుడు కర్మల నొనర్చక పోవుట వలన ఆత్మ స్వరూప యథార్థస్థితి పొందజాలడు. ఎట్లులనగా, కర్మయందు సుకర్మ, దుష్క ర్మయని రెండు విధములు. సుకర్మవలన పుణ్యము. దుష్కర్మవలన పాపము కలుగుననే నిర్ణయము గనుక, కొందరు కర్మ యొనర్చక పాషాణరూప శిలలవలె ఒకచోటపడి యుందురు, వీరి బ్రతుకు కేవల

జడత్వము బొందియుండును. గనుక వీరికి ఆత్మ నిర్ణయము తెలియదు.

మఱికొందరు, పుణ్యపాప విచక్షణయే లేక యథేచ్ఛగా కర్మల నాచరించెదరు. ఇట్టివారు కర్మ పాషండులుగా నుండి నీచయోని ప్రాప్తి జెందెదరు.

మఱి కొందఱు కొంతకాలము వఱకు కర్మలాచరించి ఇహపరముల సాధించవలెనని భార్యాపుత్రాదులను త్యజించి పుణ్యనదీ క్షేత్రాదులయందు నివసించి, పరాన్న భుక్తివలన జీవించెదరు. ఇట్టివారు మానవ పశువులని తెలిసియుండుము. ఎట్లులనగా,

శ్లో॥ నహికశ్చిత్ క్షణమపి జాతు తిష్టత్య కర్మకృత్,
కార్యతే హ్యవశం కర్మసర్వః ప్రికృతి జైర్గుణై ॥

సృష్టికి మూలకారణమగు చేతన బ్రహ్మము (అఖండ ఎరుక) రాత్రి పగలు అను నిర్ణయము లేక స్థావరజంగ మాత్మకమగు జీవోపాధులను సృష్టి స్థితిలయము లొనర్చు చున్నది. గనుకనే ప్రాణవాయువు రాత్రి పగలనే నిర్ణయము లేక ఉచ్ఛ్వాస నిశ్వాసలు జేయుచున్నది. ప్రాణ సత్తా యున్నందున అధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆధిదైవిక వ్యవహారములు జరుగుచున్నవి. ప్రాణసత్తా లేనిచో సర్వము శూన్యమగు చున్నవి. గనుక, ప్రాణము అధిష్టాన చేతనమగు అఖండ ఎరుక యొక్క సత్తా (లేకశక్తి) యని చెప్పబడును. సనాతన కర్మ స్వరూపము అధిష్ఠాన చేతనమగు అఖండ చేతనయని చెప్పబడును. ఇట్టి ఎఱుకోద్భవులగు మానవులు కర్మరహిత మొనర్చవలయునని కర్మేంద్రియ జ్ఞానేంద్రియములచే అష్టాంగయోగములు శ్రవణ మనన నిధిధ్యాసలు యొనర్చుచు వానిచే కలుగు ఫలములు అంతఃకరణమునందు ప్రవేశింపజేసి లింగ శరీరమగు సూక్ష్మశరీరమును అజ్ఞాన ఆవరణమగు కారణ శరీరముతోగూడ ప్రత్యగాత్మ యగు శుద్ధ చేతనయందు లయ

చింతన చేసి సమాధి నిష్టయందుండి కాలాతీతులమగు కర్మరహితుల మని తలంచెదరు. కాని సమాధి నిష్టయందున్నా కర్మ జరుగుచునే యున్నది. ఎట్లులనగా, ప్రాణము నిలిచియున్నంత వఱకు అంతఃకరణ నిలిచియుండును. అంతఃకరణ యున్నంతవరకు జాగ్రిత్స్వప్న సుషుప్తి రూప అవస్థాత్రయములు తెలియక పోయినను బాల్య యౌవన కౌమార వృద్ధాప్యములు క్రిమముగా జరుగుచునే యుండును. గనుక మానసికావేశము వలన కర్మను విడిచినామనే నిర్ణయము మాత్రమే కాని ఎంతటి మహాత్ము లనిపించుకొను వారలు కూడా కర్మను విడువ లేరు గనుక కర్మను విడిచినామని అనుకొనుట కేవలము మూర్ఖత్వము.

శ్లో॥ కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసాస్మరన్,
ఇంద్రియార్థాన్వి మూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే ౬

ఏ మూఢుడు కర్మేంద్రియ కర్మలు అరికట్టి, అనగా, వాక్కుచే మానవ కళ్యాణార్థము చేయునట్టి ధర్మోపదేశము. పాణిచే జేయునట్టి దానధర్మాదులు, దుష్టశిక్షణ, శిష్టరక్షణ, పరిపాలన కార్యములు, పాదముచే నొనర్చునట్టి శరీర సాధనములు, గుహ్యేంద్రియముచే కలుగు లోక కళ్యాణ కరులగు సంతానము శరీరారోగ్య మొనర్చునట్టి మలమూత్ర విసర్జన అరికట్టి శబ్దాది విషయ పంచకము వలన కలుగు నట్టి పరలోక విషయ చింతన చేయువాడు మిథ్యాచారి అనగా కపట నాటక సూత్రధారియని చెప్పబడును గనుక,

శ్లో॥ యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున
కర్మేంద్రియైః కర్మ యోగమసక్తస్సవి శిష్యతే ౭

ఓ అర్జునా! శ్రోత్రము త్వక్కు- చక్షువు జిహ్వ ప్రాణములను జ్ఞానేంద్రియములను, అధిదేవతా పద్ధతియగు అధిష్ఠాన స్వరూపము యందుంచి కర్మేంద్రియములచే కర్మనొనర్చువాడు చిత్తశుద్ధినిబడయు

చున్నాడు. అతని అంతఃకరణమునందు విషయములను గుఱించి భయముండదు.

శ్లో॥ నియతం కురుకర్మత్వం కర్మజ్యాయో హ్యకర్మణః,
శరీర యాత్రా౽పి చ తేన ప్రసిద్ధ్యేద కర్మణః

కర్మము జేయకుండుటకంటె కర్మాచరణ శ్రేష్ఠమైనది. గను నీస్వధర్మాను సారము కర్మ మొనర్చుము. కర్మజేయక యున్న నీ జీవితము సౌఖ్యముగా నడువజాలదు.

శ్లో॥ యజ్ఞార్థాత్కర్మణో౽న్యత్ర లోకో౽యం కర్మబంధనః,
తదర్థం కర్మ కౌంతేయ! ముక్తసంగస్సమాచర

శ్లో॥ సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః,
అనేన ప్రసవిష్యధ్వ మేష వో౽స్త్విష్ట కామధుక్.

లోకమున ప్రతి మానవుడు చేయుచుండిన కర్మ అధిష్ఠానచేతః పద్ధతిని తెలియక స్వవిషయమని చేయుచున్నందున కర్మబద్ధులై జననః మరణాది సంసార బాధలు జెందుచున్నారు; గనుక నీవు కర్తృత్వ రహిత కర్మలను ఆచరించుము. అట్టి పద్ధతిగల వానిని ప్రాణ పంచః విషయములు కర్మబంధమున బడవేయ జాలవు. ఎట్లనగా, అధిష్ఠాః చేతన బ్రహ్మము ఈ సృష్టి చేయునపుడు సమస్త పదార్థములతో పాటు మానవులను సృజించి అవయవ స్ఫూర్తి కలిగించి వానికి తగిన ఇంద్రి య సముదాయమును వాని అధిదేవతలను నిర్ణయించి ప్రవర్తింప చేయుటకు ప్రయత్నించెను, కాని అధిదేవతాయుక్త ఇంద్రియ సము దాయ అవయవము లన్నియును కార్యసాధకమగు చేతన బ్రహ్మము లేనందున మానవుడు ప్రవర్తించలేక పోయెను. అప్పుడు తాను మానవ దేహమందు ప్రవేశించుటకు దారి వెదకెను. గాని నియమితమగు దారులయందు అధిదేవతలు నియమింపబడి యుండిరి. గనుక, అధిష్ఠాన

చేతన బ్రహ్మము ప్రవేశించుటకు ద్వారి లేక పోయెను. కనుక చేతన బ్రహ్మము కపాలము నుండి అనగా శిరోభాగ మధ్య ప్రదేశము నుండి ద్వారము నేర్పరచుకొని చక్కగా హృదయ నాళమందు నివసించుచూ సకలేంద్రియ అధిష్టాన దేవతలను చలింపచేసి జ్ఞానేంద్రియములను తమ తమ ప్రవృత్తుల యందు ప్రవర్తింప జేయుచున్నది. జనులు సృష్టి నిర్ణయము ఉన్నదనట్లు తెలియలేక స్వాభిమానమగు మోహాంధ కారమున కార్యకర్తృత్వము వహించి ఆధ్యాత్మిక ఆదిభౌతిక ఆధి దైవికములందు ద్వైత భ్రాంతి నుంచి కర్మబంధములో పడుచున్నారు గనుక,

శ్లో॥ దేవాన్ భావ యతానేన తే దేవా భావయంతు వః,
పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ ౧౧

శ్లో॥ ఇష్టాన్భోగాన్హి వో దేవా దాస్యంతే యజ్ఞ భావితాః,
తైర్దత్తాన ప్రదాయైభ్యో యోభుంక్తే స్తేన ఏవ సః ౧౨

నీవు స్వధర్మమగు కర్మాచరణ ద్వారా సర్వదేవతలను సంతోష పెట్టుము. ఎట్లులనగా, వృక్షముయొక్క తల్లి వేరునకు నీరు పోసిన ఎడల మొత్తము వృక్షము వృద్ధినొంది పువ్వులు కాయలు ఫలము లెట్టులొసంగు చున్నదో, అట్లే, అధిష్టాన చేతన బ్రహ్మ పద్ధతియగు నీస్వధర్మాచరణవలన ఇంద్రియాధి దేవతలు సంతోషించి లోకకల్యాణార్థమగు, సర్వవిషయములు సిద్ధింప జేయుదురు. సర్వదేవతలను ఆజ్ఞాపించు శక్తి నీలో నెలకొనగలదు. నీవాక్యము యెప్పుడునూ వ్యర్థముకాదు. సర్వమహాత్తులు నిన్ను వెంబడించును. నీవు స్వధర్మాచరణయందున్నంతవఱకు అధిదేవతలయందు నీవు నీయందు అధిదేవతలు ప్రేమ కలిగియుందురు. కాని సర్వసంపదలు చేజిక్కినప్పుడు స్వార్థపరుడవై ఇంద్రియములకు లోబడి మానవ లోకకళ్యాణాస్పదమగు మానవ సౌభ్రాతృత్వము,

అన్నము వలన కలుగు చున్నవి. అన్నముయొక్క ఉత్పత్తి మేఘముల వలన కలుగుచున్నది. మేఘములు యజ్ఞము వలన కలుగు చున్నవి. అనగా, యజ్ఞరూపమగు పరమాత్మసంకల్పమువలన ఋతు నిర్ణయము కలుగుచున్నది. యజ్ఞము కర్మమువలన కలుగుచున్నది. అనగా, సంకల్పరూపమగు యజ్ఞము అధిష్ఠాన చేతన బ్రహ్మము వలన కలుగుచున్నదని నిర్ణయము.

పురుషుని విడిచి పురుషశక్తి వుండనట్లు గుడమును విడిచి మధురముండనట్లు, కర్మను విడిచి సంకల్పరూపమగు యజ్ఞమును, యజ్ఞమునువిడిచిబ్రహ్మమును. ఉండవు గనుక, పరమాత్మయందు సంకల్పరూప యజ్ఞము శాశ్వతముగా నుండును. సంకల్పరూపయజ్ఞమునందు స్వప్రకాశచేతన బ్రహ్మము ప్రతిష్ఠితమై యుండును.

శ్లో॥ ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః,
అఘాయురింద్రియారామో మోఘంపార్థ! సజీవతి ౧౬

ఓ! అర్జునా, యజ్ఞముయొక్క మూలస్వరూపము అనగా అధిష్ఠాన చేతన పద్ధతియగు కర్మచక్రము తెలిసి సమష్టి రూప కర్మాచరణ పద్ధతి ఆచరింపక ఇంద్రియా సక్తుడై వ్యష్టిపద్ధతిగా ప్రవర్తించునట్టివాడు పాపియగును. వాని జీవితము వ్యర్థమగును. ఎట్టులనగా, సూక్ష్మశరీరమునందు సంకల్పరూపమున కర్మలు స్వాభావసిద్ధముగా నున్నవి. ఆచరణ యోగ్యమగు స్థూలశరీరము కలిగిన పిమ్మట లోక కళ్యాణాస్పదమగు సమష్టి కర్మలనొనర్చక ఉపేక్షించువాడు, స్వార్థమగు వ్యష్టికర్మలొనర్చు వాడు మూఢుడని తెలియుము.

శ్లో॥ యస్త్వాత్మరతి రేవ స్యాదాత్మ తృప్తశ్చ మానవః
ఆత్మన్యేవచ సంతుష్టస్తస్య కార్యం నవిద్యతే ౧౭.



ఏమనుజుడు ఆత్మయందు ప్రీతి,తృప్తి,సంతుష్టి, గలిగి సర్వము ఆత్మపద్ధతియేయని యున్నాడో అతడు కర్మఫలమును బొందడు. ఎట్టులనగా,అగ్నియందు అగ్నిని, నీటియందు నీటిని చేర్చినను యేబాధ యుండదో అట్లు ఆత్మ పద్ధతియందు కర్మ నొనర్చువాడు సుకృత దుష్కృత ఫలములను బొందడు. కర్మయనునది స్వాయముగానే లేకుండ పోవును.

శ్లో॥ నైవతస్య కృతేనార్థో నాకృతే నేహ కశ్చన,
న చాస్య సర్వ భూతేషు కశ్చిదర్థ వ్యపాశ్రయః ౧౮

పై నిర్ణయ పద్ధతి గలవాడు లోకమునందు చేయు కర్మవలన తనకు ప్రయోజనము కలదని కాని, లేదనికాని నిర్ణయించు కొనడు. ఇతడు భూతసముదాయమును తన ప్రయోజనము కొఱకు ఆశ్రయింప నవసరములేదు. ఎట్టులనగా, చతుర్దశేంద్రియాధి దేవతలగు, చంద్రుడు, బృహస్పతి, క్షేత్రజ్ఞుడు, రుద్రుడు, దిక్పాలకులు,వాయువు సూర్యుడు, వరుణుడు, అశ్వినులు, అగ్ని,ఇంద్రుడు,ఉపేంద్రుడు, బ్రహ్మ, మృత్యువు, ఆత్మపాద చతుష్టయమగు విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు, ప్రత్యగాత్మ, వీని సమష్టి స్వరూపములగు, బ్రహ్మపాద చతుష్టయము అనగా విరాట్టు, హిరణ్యగర్భ, అవ్యాకృత, పరమాత్మలను, ఇట్టి దైవనిర్మిత లోకముల ఫలాను భవమునకు వ్యష్ట్యంతఃకరణ వృత్తిగల వారు ఆ దేవతల స్థానస్వరూప స్వభావము లెరిగి, ఉపాసించెదరు. సమష్ట్యంతఃకరణ చేతన బ్రహ్మ నిర్మిత వృత్తిగలవారు అట్టి ఉపాసన చేయరు. మానవ లోకకళ్యాణాస్పదమునకు యొనర్చినను ఫలాను భవము నాశించరు. గనుక వారుచేయు సర్వకర్మలు స్వార్థ రహితముగాను లోక కళ్యాణముగాను, యుండును.

శ్లో॥ తస్మాదసక్త స్సతతం కార్యం కర్మసమాచర,
అసక్తోహ్యా చరన్ కర్మ పరమాప్నోతి పూరుషః ౧౯

స్వధర్మమగు కర్మ కర్తృత్వ రహితముగా ఆచరించుము. అందు వలన జనన మరణ భ్రాంతి రహిత మోక్షమును బొందెదవు.

శ్లో॥ కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః,
లోక సంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి ౨౦

జనకాది రాజ ఋషులు కర్తృత్వ రహిత కర్మాచరణ వలననే జనన మరణ భ్రాంతి రహిత మోక్షమును బొందియున్నారు. నీవు అదే విధమున లోక కళ్యాణమునకు కర్తృత్వ రహిత కర్మ ఆచరించి భ్రాంతి రహితమును బొందుము.

శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠస్తత్త దేవేతరో జనః,
సయత్ప్రమాణం కురుతే లోకస్త దనువర్తతే ౨౧

శ్రేష్ఠుడు, అనగా, స్వార్థరహిత సత్య సంభాషణ గలవాడు, యే పద్ధతిగా కర్మల నొనర్చునో ఇతరజనములు అదే పద్ధతి ననుసరింతురు, ఈ పద్ధతి లోకమున ఎల్లప్పుడు జరుగుచుండును. గనుక స్వధర్మాచర విహితకర్మ శ్రేష్ఠుడగువాడు సహితం ఎప్పుడూవిడువరాదు

శ్లో॥ నమే పార్థాఽస్తి కర్తవ్యం త్రిషులోకేషు కించన,
నాఽనవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చకర్మణి ౨౨

ఓ అర్జునా! ఇతరుల విషయము నీకు దూరస్తము నా స్వవిషయమును ఆలోచించి చూడుము గజకర్ణ, గోకర్ణ, ఇంద్రజాల, మహేంద్రజాల, మారణ, మోహన, స్థంభన, ఉచ్చాటన, ఆకర్షణాది చౌషష్టి విద్యలుగాక ముప్పది రెండు బ్రహ్మ విద్యలు, పదహారు కామ విద్యలు తెలిసి జనన మరణ భ్రాంతి రహితమునకు అచల పరిపూర్ణ పద్ధతి తెలిసి పరిపూర్ణత్వమునయున్న నాకు మూడు లోక

ములయందు యేలాటి కర్మ చేయవలసిన అగత్యము లేక యున్నాను నాగురువగు సాందీపుని కుమారుడు మరణించి యమలోకమున యమ యాతనలు బడుచుండగా గురుమాత కోరికపైన నేను యమలోక మునకు వెళ్లి అతనిని తీసుకొని వచ్చితిని. నాకు యే ఫలములు అవస రము లేకపోయినను లోకహితార్థము, యెవ్వరు యే కోరికలు కోరు చుందురో వానిని సిద్ధింప జేయుటకు కర్మాచరణయందే ప్రవర్తించు చున్న విధము నీవు చూచుచునే యున్నావు.

శ్లో॥ యది హ్యహం న వర్తేయం జాతుకర్మణ్య తంద్రితః,
మమ వర్త్మాను వర్తంతే మనుష్యాః పార్థ! సర్వశః ౨౩
శ్లో॥ ఉత్సీదే యురిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్,
సంకరస్యచ కర్తా స్యాముపహన్యామిమాః ప్రజాః ౨౪

ఓ! అర్జునా, నేను కర్మ చేయకయున్న ఈ మానవ లోకమంతయు నా మార్గమునే అనుసరించును. అందువలన వారిని పాపాత్ములను చేసిన వాడనగుదును. స్వధర్మాచరణయందు వారు పొరబడక యుండుటకే నేను స్వధర్మాచరణ మొనర్చుచున్నాను. పరిపూర్ణ జ్ఞానులగు ఉత్తమ పురుషులు ఈ లోకమున ఎన్నడు కూడ కర్మత్యాగము చేయరాదు. లేనిచో జనులు తమ మానవధర్మము నుండి పతితులుగాగలరు.

శ్లో॥ సక్తాః కర్మణ్య విద్వాంసో యథా కుర్వంతి భారత!,
కుర్యాద్విద్వాంస్తథా౽ సక్తశ్చి కీర్షుర్లోక సంగ్రహమ్. ౨౫

ఫలాసక్తులగు కర్మిష్ఠులు కర్మఫలంబులగోరి కర్మలయందు శ్రద్ధ వహించి యెట్లు కర్మ యొనర్చుచున్నారో, అట్లు లోకహితమునకు ఉత్తమ పురుషుడు కర్తృత్వ రహితుడై కర్మచేయవలెను.

శ్లో॥ నబుద్ధి భేదం జనయేద జ్ఞానాం కర్మ సంగినామ్.
జోషయే త్సర్వకర్మాణి విద్వాన్యుక్త స్సమాచరన్. ౨౬

అవివేకు లగువారు కర్మయందాసక్తి గలిగి కర్మ యొనర్చు చున్నను, వారిని కర్మరహితులను చేయరాదు. జ్ఞానియగువాడు తాను కర్మ యొనర్చుచు వారిని కర్మలయందు అధిక ఆసక్తి పరులను చేయవలెను.

శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః,
అహంకార విమూఢాత్మా కర్తాహమితి మన్యతే ౨౭

పురుషుని విడచి పురుషశక్తి యుండనట్లు అధిష్టానమును విడచి చేతనముండదు, గనుక చేతనము ప్రకృతి యనబడును. ఈ ప్రకృతి సత్త్వరజస్తమంబులను త్రిగుణ సామ్యము. ఈ త్రిగుణముల చేతనే సర్వకర్మలు జరుగు చుండును. స్వార్థపరుడగు సంకుచిత దృష్టిగలవాడు వ్యష్ట్యంతఃకరణ వృత్తివలన సర్వమునకు తానే కర్తయని కర్మఫలములు తనపై నిడుకొని మూఢుడగు చున్నాడు.

శ్లో॥ తత్త్వ విత్తు మహాబాహో! గుణకర్మ విభాగయోః,
గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే. ౨౮

ఈ సకల కర్మలకు మూలమగు ఆత్మ తత్త్వము తెలిసిన వారికి ప్రకృతియను మాయ యుండదు. గుణకర్మల అన్యోన్య సంబంధము తెలిసికొని గుర్తెరిగే దేహాభిమానము విడుతురు గనుక కర్మలయందు కర్తృత్వరహితులై యుందురు.

శ్లో॥ ప్రకృతేర్గుణసంమూఢాః సజ్జంతే గుణకర్మసు,
తానకృత్స్నవిదో మందాన్ కృత్స్నవిన్న విచాలయేత్ ౨౯

తాము చేయుపనులు ప్రకృతి గుణమున చిక్కి మాయా తంత్రము ననుసరించి చేయుచున్నామని తలంచు వారిని కర్మలు

బాధించును. సర్వజ్ఞుడగు ఆత్మవేత్తను కర్మలు బాధింపవు తాను ఇత రులను బాధింపడు.

శ్లో॥ మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా,
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగత జ్వరః 30

కారణకర్మ, కార్యకర్మయని కర్మ రెండు విధములు. కారణకర్మ యనగా? అధిష్ఠాన బ్రహ్మ చేతన కర్మ. ఇది, ఇతరుల కోరిక లేకనే తనంతట తాను జరుగు చుండును. అందువలన నిష్కామ కర్మ యనియు, నైష్కర్మ్య మనియు చెప్పుదురు. ఇది శరీరమును బాల్య యౌవన కౌమార వృద్ధాప్య మరణములు క్రమముగా బొందించి తిరుగా సృష్టించును. ప్రాణమును సూర్యచంద్ర నాడులద్వారా ఉచ్ఛ్వాస నిశ్వాస రూపమున పరివర్తింప జేయును. కార్య కర్మ యనగా?! అన్నపానాద ఇష్టయిశ్వర్యములచే రక్షింపబడు చున్నవాడ ననితలచి, అంతఃకరణ పరిణామంబునజ్ఞానేంద్రియములచే విషయపంచ కము తెలిసి, కర్మేంద్రియములచే నన్నపానాది సంపాదనకు కర్మనాచ రించి వాని సిద్ధికై వేచి యుండుట కార్య కర్మ యనబడును. శ్రు॥ ఏకో దేవః సర్వ భూతేషుగూఢః. అనే న్యాయమున అధిష్ఠాన బ్రహ్మచేతనము సర్వులయందు అంతర్యామిత్వముగా నుండి నేను నేనని వ్యవహరించు చున్నది. గనుక, నీవును పోనర్చు సమస్త కర్మలు నాయందుంచి వివేక బుద్ధిచే నుండుము. సంతాపము లేనివాడవై యుద్ధ మొనర్చుము.

శ్లో॥ యే మే మతమిదం నిత్యమను తిష్ఠంతి మానవాః,
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః 31

అభిమాన రహితమైన శ్రద్ధతో ఏ మానవులు నా సిద్ధాంత మును సర్వదా ఆచరింతురో వారు కర్మబంధముచే బంధింపబడరు. అనగా సర్వదాముక్తులై యుండెదరు.

శ్లో॥ యే త్వేతదభ్యసూయంతో నానుతిష్ఠంతి మేమతమ్,
సర్వజ్ఞాన విమూఢాంస్తాన్ విద్ధి నష్టా నచేతసః 32

నామతమును అనుష్ఠింపక యేమానవులు నిందించెదరో వారు వివేక హీనులు. అనగా, కర్మేంద్రియములకు దాసులు, పరమార్థ భ్రష్టులని తెలిసి కొనుము.

శ్లో॥ సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్ జ్ఞానవానపి,
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి? 33

పూర్వ జన్మముల యందొనర్పబడిన ధర్మాధర్మముల సంస్కారము వర్తమాన జన్మమున ప్రకాశితమగును, శ్రుతి॥ బుద్ధిః కర్మానుసారిణీ, యనున్యాయమున వారు ప్రకృతిననుసరించి కార్యముల నొనర్చు చున్నారు. గనుక, నేనుగాని మఱియొకరుగాని శాసించినను లేక నిషేధించినను ఫలమేమియుండును? అనగా, పూర్వ జన్మకర్మ వర్తమాన జన్మమునందు కాలానుగుణ్యముగా అంతఃకరణమున ప్రవేశించి అంతరేంద్రియ నిర్మాణానుసారముగా కర్మ మొనర్చును. దీని వృత్తి విధానము తెలిసినవారు అధిష్ఠాన చేతన బ్రహ్మనిర్ణయముగానొనర్చెదరు. తెలియనివారు జ్ఞానులైనను అజ్ఞానులవలె ప్రకృతికి దాసులుగానుండెదరు ఇట్టివారికి నిజపద్ధతులు రుచించవు.

శ్లో॥ ఇంద్రియ స్యేంద్రియస్యార్థే రాగ ద్వేషౌ వ్యవస్థితౌ,
తయోర్న వశమాగచ్ఛేత్తౌహ్యస్య పరిపంథినౌ. 34

ఇంద్రియములు అనగా-అంతరేంద్రియములు ఐదు, ప్రాణేంద్రియములు ఐదు, జ్ఞానేంద్రియములు ఐదు, విషయేంద్రియములు ఐదు కర్మేంద్రియములు ఐదు ఇందు ప్రాణపంచకమునకు రాగ ద్వేషములుండవు. జ్ఞానేంద్రియములలో జిహ్వేంద్రియము, కర్మేంద్రియములలో ఉపస్థేంద్రియము, ఈ రెండు ప్రపంచ విషయములు విషయేం

ద్రియములలో శబ్దేంద్రియము, అంతరేంద్రియములలో జ్ఞానేంద్రియము, ఈ రెండు పారమార్థిక విషయములు ప్రపంచ పారమార్థిక విధానముల ప్రవర్తన యందు రాగ ద్వేషంబులుండును గనుక మానవుని యొక్క శ్రేయో మార్గమునకవి ప్రతిబంధకములు.

శ్లో॥ శ్రేయాన్స్వ ధర్మో విగుణః పర ధర్మాత్స్వనుష్ఠితాత్.
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః 35

అధిష్ఠాన బ్రహ్మ చేతనము యొక్క నీ స్వధర్మ ప్రవర్తన కష్టమైనదిగా నున్నను దానిని ఆచరించుటలోనే మానవ లోక కళ్యాణము గలదు. ఆధి భౌతిక, ఆధి దైవిక ప్రవర్తన విధానములు పైకి ప్రీతికరముగా నున్నను, అంతర విధానము విషపూరితములు. నీ స్వభావమునకు అన్యధర్మములు. గనుక స్వధర్మ ఆచరణ పైకి ఎంత కష్టతరముగా నున్నను పరమాత్మ సౌఖ్యము చేకూర్చును. ఆధి భౌతిక, ఆధి దైవిక, ప్రవర్తన విధానములు పైకి యెంతటి సుఖదాయకముగా తోచియుచున్నను, నవి నరక రూపమగు భీతిని చేకూర్చును.

అర్జున ఉవాచ :

శ్లో॥ అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః 36

అర్జునుడు అడుగు చున్నాడు :

ఓ! కృష్ణస్వామీ, మానవులు పాపముచేయ నిచ్ఛయింపని వారైనను, ఎవరి వలననో ప్రేరేపింపబడి బలాత్కార పూర్వకముగా భృత్యునివలె పాపాచరణమున నియుక్తుడగుచున్నాడు. ఇట్లతని ప్రేరేపించునదేది?

శ్రీ భగవానువాచ :

శ్లో॥ కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్ 37

శ్లో॥ ధూమేనా వ్రియతే వహ్నిర్యథాదర్శో మలేన చ,
యథోల్బేనావృతో గర్భస్తథా తేనేదమావృతమ్ 38

ఓ అర్జునా! ఆకాశాదికమగు కూటస్థుని తమః ప్రధానమయిన ఆకాశమునుండి రజోగుణము వలన బుట్టినది కామము. దీని పరిణామము క్రోధ, మోహ, లోభ, భయములుగా నుండును మానవలోకమునకు యివి శత్రువులని నిర్ణయము. ఎట్లు లనగా, మురికి వలన అద్దము, బూడిద వలన నిప్పు, మావి వలన గర్భమున నుండు పిండము, ఎట్లు కప్పబడి యున్నవో, అట్లు వివేక జ్ఞానము కామాదుల వలన ఆవరింప బడియున్నది.

శ్లో॥ ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా,
కామరూపేణ కౌంతేయ! దుష్పూరేణా నలేన చ 39

శ్లో॥ ఇంద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే,
ఏతైర్వి మోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్ 40

ఓ కుంతీపుత్రా! కామము ఇచ్ఛారూపమైనది, తృప్తి జెందనిదిగా నున్నందున అగ్నిని యే వస్తువునయందు వింపినను దానిని కాల్చివేసి తానుకూడ నశించునట్లు ఆశ్రయమును దహింపజేసి తానుకూడ నశించును. ఇంద్రియ మనోబుద్ధులు కామము నాశ్రయించి అజ్ఞానులను ప్రపంచ విషయాదులయందు భ్రమింపజేయుచున్నవి. అన్నమయాది పుర నివాసియగు పురుషుని కామము నాశ్రయింపజేసి పారమార్థిక విషయాదులయందు భ్రమింపజేయుచున్నది.

శ్లో॥ తస్మాత్త్వ మింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ!
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞాన విజ్ఞాన నాశనమ్ ౪౧
శ్లో॥ ఇంద్రియాణి పరాణ్యాహురింద్రియేభ్యః పరం మనః,
మనసస్తుపరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తుసః ౪౨
శ్లో॥ ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా,
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ ౪౩

ఓ అర్జునా! నీవు మొదట, ఇంద్రియములను వశమొనర్చుకొని జ్ఞానమును విజ్ఞానమును పాడుజేయు కామమును పరిత్యజించుము ఎట్టులనగా, దేహమునకంటె ఇంద్రియములు శ్రేష్ఠము ఇంద్రియములలో సంకల్ప రూపమగు మనస్సు శ్రేష్ఠము. సంకల్పరూప మనస్సుకంటె నిశ్చయాత్మకమగు బుద్ధి శ్రేష్ఠము. కామ్యకారణ కర్మలు ఏ అధిష్ఠాన బ్రహ్మచేతనము వలన జరుగుచున్నవో ఆబ్రహ్మనిశ్చయము కలిగిన బుద్ధి సర్వమునకు శ్రేష్ఠమని చెప్పబడును. ఇట్లు పవిత్రి మొనర్పబడిన బుద్ధి వలన మనస్సు సుస్థిరమొనర్చి అధిష్ఠానమగు ఆత్మనిశ్చయము కలిగి కామమును జయింపుము.

శ్రీకృష్ణార్జున సంవాదమగు భగవద్గీతయందు
కర్మయోగమను, తృతీయాధ్యాయం, సంపూర్ణము,

# అస్పర్శయోగము అను శ్రీ మద్భగవద్గీత

## రా జ యో గీ య ము

### చతుర్థాధ్యాయము

# జ్ఞా న యో గ ము

oooooooooooo

### జ్ఞానయోగమునకు, కర్మయోగము సాధనము

**ఈ** కర్మయోగము మూడవ అధ్యాయమునందు జెప్పబడినది అదియే నాల్గవ అధ్యాయమునందు విస్తరించి చెప్పబడుచున్నది. ఈ కర్మ జ్ఞాన పక్షములు వేరు వేరు కావనియు రెండు నేకమేననియు ఈ యోగము, నిన్న నేడు కల్పించినది కాదనియు, అనాది నుండి సంప్రదాయముగా వచ్చుచున్నదనియు. ఈ దిగువమూడు శ్లోకములలో శ్రీభగవానులు చెప్పుచున్నారు.

శ్రీకృష్ణ ఉవాచ :-

శ్లో॥ ఇమం వివస్వతేయోగం। ప్రోక్తావానహమవ్యయమ్।
వివస్వాన్మనవేప్రాహ। మనురిక్ష్వాకవేఽబ్రవీత్॥ 1

శ్రీకృష్ణుడు పలికెను :-

ఓ అర్జునా! నాశన రహితమగు నీయోగము నాచే సూర్యునికి తెలియచేయబడినది అతడు మనువునకును మనువు ఇక్ష్వాకునకు నిద్దానినుపదేశించియుండిరి.

శ్లో॥ ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయోవిదుః
సకాలేనేహమహతా యోగోనష్టః పరంతప॥ 2

శ్లో॥ సఏవాయంమయాతేద్యయోగః ప్రోక్తః పురాతనః
భక్తోఽసిమేసఖాచేతి రహస్యంహ్యే తదుత్తమమ్॥ 3

పరంపరాప్రాప్తమగు ఈ యోగము రాజర్షులు తెలిసికొనిరి. ఆ యోగము కాలక్రమంబున, మందమతులు అజితేంద్రియులు, అనధికారులైన, స్వార్థపరులను పొందినది. వారు కామక్రోధములకు చిక్కి యీయోగమును చక్కగా నెరవేర్చనందున సంప్రదాయమునకు భంగము కలిగినది. నీవు నాకు భక్తుడవు. సఖుడవు. దానంజేశి యీ యుత్తమ రహస్యము నాచే నీకుచెప్పబడినది. నేను దక్క మరియొకరు దీనిని యెరుంగుటకు గాని చెప్పుటకుగాని సమర్థులు గారు నేను జెప్పినది సమస్తశ్రుతి స్మృతిపురాణేతిహాసముల యొక్కలి రహస్యముగాని వేరుగాదు. యిది స్వార్థపరులు తెలుసుకోజాలరు. యెందుకనగా యిది అభిమాన రహిత శ్రేష్టమగు రహస్యము.

అర్జున ఉవాచ :

శ్లో॥ అపరం భవతోజన్మ పరంజన్మ వివస్వతః ।
కథమేతద్విజానీయాం త్వమాదౌప్రోక్తవానితి ॥ 4

అర్జునుడు పలికెను :

సూర్యుని పుట్టుక చాలా ముందైనది. నీవు తర్వాత పుట్టితివి. యీ యోగము సూర్యునికి నీవు చెప్పినట్లు యెట్లు తెలిసికోగలను.

శ్రీకృష్ణ ఉవాచ :

శ్లో॥ బహూనిమేవ్యతీతాని జన్మాని తవచార్జున!
తాన్యహం వేదసర్వాణి నత్వంవేత్థ పరంతప! ॥ 5

శ్రీకృష్ణుడు పలికెను :

అర్జునా నాకును నీకును పెక్కుజన్మములు గడిచినవి. నేనువాని నన్నిటిని యెరుగుదును. నీవు యెరుగవు. వ్యవహారమంతయు కారణ కార్య పరంపర రూపముననున్నది కారణమువలన కార్యము గలుగు

చున్నది. ఈ కార్యము మరియొక కార్యమునకు కారణమగుచున్నది. గనుక కారణము తెలిసినప్పుడు తత్కార్యము తెలిసినట్లేయగును. కావున నాకుజన్మాంతరములందు జరిగినవి జ్ఞప్తియుండును. అవస్థలు నీకు తెలియునందున, నీకు జ్ఞప్తియుండదు.

శ్లో॥ అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపిసన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా॥ 6

శ్లో॥ యదాయదాహిధర్మస్య గ్లానిర్భవతిభారత!
అభ్యుత్థానమధర్మస్య తదాఽఽత్మానాం సృజామ్యహమ్॥7

జన్మరహితుడను. యెన్నడు లోపింపని జ్ఞానశక్తులతో కూడియుండు కారణుండగునాకు, కార్యరూపమగు జీవోపాధియెట్లు కలుగుచున్నదనిన, యెద్దానివలన యీ జగత్తువున్నదో ఆనాత్రిగుణాత్మకమగు ప్రకృతిని వశమొనర్చుకొని నామాయవలననే శరీరమును గైకొనుచున్నాను. యెప్పుడెప్పుడు ధర్మపతనము, అధర్మముయొక్క అభివృద్ధి యగునో, అప్పుడునేను నాశరీరమును సృజించుకొనుచున్నాను. అనగా జీవుడు ప్రకృతికిలోబడియుండును. ప్రకృతి త్రిగుణాత్మకమై వుండును. గనుక జీవుడు మూడు గుణములకు లోబడివుండును. గుణములు కర్మపరతంత్రములు. గావున జీవులకు ఆయాగుణములనుబట్టి జన్మము కలుగుచున్నది. యేకర్మఫలమెప్పుడు అనుభవింపవలయునో యాయాకర్మ ఫలమునను భవించుటకు అనుకూలమగు జన్మమెత్తు చుండును జీవునికిని తెనాయావతారమునకు కాలనిర్ణయముతేదు. ధర్మమున కెప్పుడెప్పుడు హానికలుగునో, (అందువల్ల అధర్మము వృద్ధిబొందును) అప్పుడప్పుడు నేను స్వేచ్ఛాపూర్వకముగా దేహధారణ చేయుచున్నను. పరమేశ్వరుడు మాయకు లోబడడు పరమేశ్వరుని యాధీనమందే మాయవుండును. అందువల్ల జీవుని జన్మనా కర్మబద్ధముకాక

స్వేచ్ఛాయుతమైయుండును, మనయిరువురి దేహధారణకుగల తారతమ్యమిదియని తెలుసుకొనుము.

ధర్మమనగా వర్ణాశ్రమధర్మంబులని కొందరి నిర్ణయము. వర్ణధర్మంబులు అంటుతగిలితే చెడిపోవును ఆశ్రమధర్మంబులు వేషము మారిస్తే చెడిపోతవి. ధర్మమనగాయిదికాదు. రహస్యంహ్యేతదుత్తమమ్॥ అనునదేదో అదే ధర్మము అనగా జ్ఞానకర్మపద్ధతులు వేరుకావు ఏకరూప ద్వంద్వమని నిర్ణయము.

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం। వినాశాయ చ దుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే 8

దుష్టశిక్షణ సాధురక్షణ ప్రతియుగమునందు జరుగుచుండును. అట్టి యవసరమొచ్చినప్పుడెల్ల నాయవతారము గలుగుచుండును.

శ్లో॥ జన్మకర్మచ మే దివ్యమేవం యోవేత్తి తత్త్వతః।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతిమామేతిసోఽర్జున ॥ 9

అర్జునా నాజననములోకసామాన్యమైనదిగాదనియు స్వేచ్ఛామయమైనదనియు, నేజేయు కర్మసాధురక్షణరూపమనియు నాయవతార ప్రయోజనము ధర్మసంస్థాపనరూపమనియును, యెవ్వడు తెలుసుకొనునో వాడు పునర్జన్మమునందక నన్నే పొందును.

శ్లో॥ వీతరాగ భయక్రోధా మన్మయా మాముపాశ్రితాః।
బహవో జ్ఞానతపసా పూతామద్భావమాగతాః॥ 10

రాగము భయము కోపము లేకయున్నవారు నన్నే భావించి త్రికరణశుద్ధిగా ప్రవర్తించి నన్ను ఆశ్రయించి పరమాత్మ జ్ఞానమను తపస్సు చేత పునీతులై ఎందరో నాస్వరూపమును పొందుచున్నారు.

శ్లో॥ యేయథామాంప్రపద్యంతే తాం స్తథైవభజామ్యహమ్।
మమవర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ! సర్వశః ॥ 11

ఎవరేరీతిగా నన్ను ఉపాసించుచున్నారో వారిని నారీతిగనే అనుగ్రహించుచున్నాను. మనుష్యులు సర్వవిధముల నా మార్గమునే అనుసరించుచున్నారు. ఏపద్ధతిగల నేను సృష్టి విధానమునందు ఆధ్యాత్మ ఆధిదైవిక అధిభౌతికములుగా వున్నందున వారువారి అవసరానుసారంగా ప్రవర్తించిన ఫలము వారికి నావల్ల అనుగ్రహింపబడుచున్నది.

శ్లో॥ కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః।
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా॥

ఈ లోకమున పెక్కుమంది కర్మఫలకాంక్షచే యితర దేవతలను పూజించుచున్నారు. మనుష్యలోకమున కర్మఫలములు శీఘ్రముగనే లభించుచున్నవి. అందువలన నన్ను శరణుబొందుటలేదు.

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః ।
తస్యకర్తారమపిమాం విద్ధ్యకర్తారమవ్యయమ్॥ 13

గుణకర్మ పద్ధతుల ననుసరించి నావలన నాలుగు వర్ణములు సృష్టింపబడినవి. సృష్టిరూపముననుసరించినేను కర్తనైనను, గుణకర్మ పద్ధతులు నాకు అంటవు గనుక నన్ను శ్రమరహితునిగను కర్తృత్వ బుద్ధిలేనివానిగను తెలిసికొనుము. పరమాత్మ సంకల్పముచేత సృష్టిమైన మానవోపాధియందు స్థూలశరీరము సూక్ష్మశరీరము కారణశరీరము మహాకారణశరీరము వీని గుణకర్మపద్ధతులు ననుసరించి సృష్టింపబడినవి పరమాత్మయీగుణకర్మ పద్ధతులకు కర్తకాదు. ఈ చాతుర్వర్ణ్యసృష్టి విధానము మానవ నిర్మిత వర్ణంబులగు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రములని కొందరి నిర్ణయము. యీ వర్ణ పద్ధతులు స్పర్శ దోషములచే నశించునవి. పరమాత్మచే సృష్టింపబడిన శరీర చతుష్టయము సృష్టినిర్ణయము యెంతవరకు వుండునో వాని గుణకర్మ నిర్ణయము అంతవరకువుండును. గనుక పరమాత్మచేత సృష్టింపబడిన

చాతుర్వర్ణ్యము గుణకర్మ పద్ధతి విభాగముగా స్థూల సాత్త్విక రాజస తామస కారణంబులనే నాల్గు తరగతులు

శ్లో॥ నమాంకర్మాణిలింపంతి నమేకర్మఫలేస్పృహా ।
ఇతిమాంయో౽భిజానాతి కర్మభిర్నసబధ్యతే॥ 14

శ్లో॥ ఏవం జ్ఞాత్వాకృతంకర్మ పూర్వైరపిముముక్షుభిః ।
కురుకర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరంకృతమ్॥ 15

కర్మములు నన్ను స్పృశింపవు నాకు కర్మఫలముల ఆసక్తిలేదు ఇట్లు యెవడు నన్ను యెరుగునో అతడు కర్మములవలన కట్టుపడడు. యీ నిర్ణయము గ్రహించిన పూర్వులగు మోక్షార్థులచే గూడ కర్మము అనుష్ఠింపబడినది. కనుక నీవు ప్రాచీనులచే నొనర్పబడిన కర్మమునే ఆచరింపుము,

శ్లో॥ కింకర్మ కిమకర్మేతి కవయో౽ప్యత్రమోహితాః।
తత్తేకర్మప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసే౽శుభాత్॥

ఆచరింపదగిన కర్మమెట్టిది? ఆచరింపదగనిది యెట్టిది? యీ విషయమున, మేధావులు గూడా భ్రాంతులైరి కనుక యెద్దానిని తెలుసుకొనిన జనన మరణ రూపమగు సంసారమనే అశుభమునుండి ముక్తుడ వగుదువో ఆ కర్మతత్త్వము నీకు చెప్పెదను.

శ్లో॥ కర్మణోహ్యపిబోద్ధవ్యం బోద్ధవ్యంచవికర్మణః ।
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనాకర్మణోగతిః ॥ 17

శాస్త్రవిహితములగు కర్మల యొక్కయు, నిషిద్ధకర్మయొక్కయు, నైష్కర్మ్యము యొక్కయు పద్ధతులు యెరుగనగును. యెందుకనగా కర్మము వికర్మము అకర్మముల పద్ధతి తెలియుట కష్టము.

శ్లో॥ కర్మణ్యకర్మయః పశ్యేదకర్మణిచ కర్మయః ।
సబుద్ధిమాన్మనుష్యేషు సయుక్తః కృత్స్నకర్మకృత్॥ 18

మెవరు కర్మమందు అకర్తృత్వమును, కర్మాభావమున పూర్ణసిద్ధియు మూచునో అతడు జ్ఞాన యోగులలో పూర్ణయోగియును సర్వ కర్మలు ఆచరించినవాడు కృతకృత్యుడును.యని నిర్ణయము

శ్లో॥ యస్యసర్వేసమారంభాః కామసంకల్ప వర్జితాః
జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుః పండితంబుధాః॥ 19

ఎవని సమస్త కర్మంబులు కర్తృత్వాభిమానరహితములో అనగా జ్ఞానాగ్నివలన దహింపబడినవో నాతని బుధులు పండితుడని అందురు.

శ్లో॥ త్యక్త్వాకర్మ ఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవకించిత్కరోతి సః॥ 20

అతడు కర్తృత్వము ను పరిత్యజించి, సర్వదాపరితృప్తుడై యొద్దానిని ఆశ్రయింపక, కర్మలొనర్చుచున్నను యేమియు నొనర్పనివాడే యగును యేలయన కర్తృత్వరహితమగు జ్ఞానాగ్నిచేత కర్మదగ్ధముగును, గనుక

శ్లో॥ నిరాశీర్యతచిత్తాత్మా త్యక్త సర్వపరిగ్రహః।
శారీరం కేవలం కర్మకుర్వన్నాప్నోతి కిల్బిషమ్॥ 21

కర్తృత్వ రహిత కర్మాచరణ పద్ధతియందు శరీర రక్షణార్థము అనగా ఆకలిదప్పి నిద్రాదులకు సంబంధించిన కర్మలు నొనర్చినను పుణ్య పాపములను పొందడు. అనగా పరమాత్మ నిర్ణయ పద్ధతిగల వ్యక్తి మనస్సు నూతన కర్మాచరణకు సహాయపడను గనుక పుణ్య పాప రూపమగు బంధములు కలుగవు.

శ్లో॥ యదృచ్ఛాలాభ సంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః
సమః సిద్ధావసిద్ధౌచ కృత్వాపి న నిబధ్యతే॥ 22

ప్రాణధర్మమగు ఆకలిదప్పులనివృత్తి కొరకు తన కర్మపద్ధతిననుసరించి యే పదార్థము తినినా అవి పంచభక్ష్య పరమాన్నములుగానున్నను,గంజి మెతుకులుగానున్నను, భుజించి తృప్తి చెందును. ధనమూలమిదంజగత్

శ్లో॥ శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే, సంయమాగ్నిషు జుహ్వతి
శబ్దాదీన్విషయానన్యే, ఇంద్రియాగ్నిషు జుహ్వతి॥ 26

కొందరు సంయమ మను యజ్ఞము ననుష్ఠింతురు. అనగా ధారణ ధ్యానము సమాధి అను మూడు కలసి సంయమ మగును. మనఃకమలమునందో; భ్రూమధ్యమునందో, అష్టదళ కమల మధ్యముననో లేక మరియొండేని నొకచోట. మనస్సును చిరకాలము నిలుపుట ధారణయగును. దేనియందు మనస్సు నిల్పుదువో దాని వంకనే ని మనో ప్రవృత్తిని మొదతెగకుండా ప్రసరింపజేయుచు మరియొక వంకకు మరలకుండా చేయుట ధ్యానమనబడును. ధ్యానించు వస్తువు దక్క మరియొకటి స్ఫురింపకుండుట సమాధియగును. అనగా నైష్ఠిక బ్రహ్మచారులు, సన్యాసులు, జ్ఞానేంద్రియములను సంయమమను అగ్నియందు ఆహుతినొనర్చుచున్నారు. గృహస్థులు, శబ్దాది విషయ సమూహమును, ధర్మవిరుద్ధముగాని విషయములను మాత్రము గ్రహించి హోమబుద్ధితో భోగించుచున్నారు.

శ్లో॥ సర్వాణీంద్రియ కర్మాణి ప్రాణ కర్మాణి చాపరే.
ఆత్మ సంయమ యోగాగ్నౌ, జుహ్వతి జ్ఞాన దీపితే॥ 27

మరికొందరు అనగా ధ్యానయోగులు జ్ఞానప్రదీప్తమగు ఆత్మ నిగ్రహమను యోగాగ్నియందు యింద్రియ కర్మములను ప్రాణాది పంచవాయు కర్మములను ఆహుతినొనర్చుచున్నారు.

శ్లో॥ ద్రవ్యయజ్ఞాస్తపో యజ్ఞా యోగ యజ్ఞాస్తథాపరే.
స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞాశ్చ యతయస్సంశితవ్రతాః॥ 28

పైన జెప్పినవిగాక. 1. ద్రవ్యయజ్ఞము (దానయజ్ఞము) 2. తపోయజ్ఞము 3. యోగయజ్ఞము 4. స్వాధ్యాయయజ్ఞము 5. జ్ఞానయజ్ఞము 6. వ్రతయజ్ఞము అని యారు యజ్ఞములు గలవు.

1. కొందరు ద్రవ్యదానమను యజ్ఞము నొనర్చు చున్నారు.
2. కొందరు చాంద్రాయణాది రూపమగు తపోయజ్ఞము నొనర్చుచున్నారు.
3. కొందరు ప్రాణాయామ ప్రత్యాహారములతో గూడిన యోగయజ్ఞము నొనర్చు చున్నారు.
4. కొందరు యతులు దృఢవ్రతులై వేదాభ్యాసమను స్వాధ్యాయ యజ్ఞము నొనర్చు చున్నారు.
5. వేదార్థమును విధిగా నెరుగుట జ్ఞానయజ్ఞమగును.
6. సంకల్పము పూర్తియగు వరకు నిద్రాహారములు మాని తీవ్రముగా పాటుపడుట, వ్రత యజ్ఞమగును.

శ్లో॥ అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానంతథాఽపరే.
ప్రాణాపానగతీరుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః 29

యోగశాస్త్ర పద్ధతి ననుసరించి ప్రాణాయామ మనగా ప్రాణము అపానము ఈరెంటి వృత్తిని నిరోధించుట ప్రాణాయామ మనబడును. యిది రేచకము, పూరకము, కుంభకము అని మూడు విధములు.

1. అపాన వాయువున ప్రాణవాయువును హోమ మొనర్చుట పూరక ప్రాణాయామము.
2. ప్రాణవాయువున అపానవాయువును హోమ మొనర్చుట, రేచక ప్రాణాయామము.
3. ప్రాణా పానవాయువుల గతిని నిరోధించిన ప్రాణాయామ మును కుంభక మందురు.

అంతర బాహ్యములని, ఈ కుంభకము రెండు విధములు
1. వూపిరి పీల్చుకొన్న తర్వాత దాన్ని విడువక యట్లే యుండుట అంతర కుంభక మనబడును.



2. వూపిరి విడిచిన తర్వాత మరల పీల్చుకొనక యుండుట బాహ్యకుంభక మనబడును.

శ్లో॥ అపరే నియతాహారాః ప్రాణాన్ప్రాణేషు జుహ్వతి.
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపిత, కల్మషాః॥ 30

ప్రాణాయామము చేయునపుడు ఆహార నియతిగలదు. మెట్లు లనగా వుదరకోశములో రెండుపాళ్ళు అన్నము. వొక్కపాలు నీటితో నింపి వొక్కపాలు ఖాళీగా వుంచిన, వాయువు సంచరించుటకు వీలుగా వుండును. పైన చెప్పిన మూడు విధములైన ప్రాణాయామ పద్ధతులు గాక కొందరు ప్రాణములందు ప్రాణములను హోమము చేయుదురు. అనగా సారధి కళ్లెములను బిగబట్టినచో గుర్రములెల్లు కదలకనిల్చునో యట్లు ప్రాణములను బిగబట్టినచో యింద్రియములెల్లు కదలక నిలుచును. యింద్రియములు నిలచినప్పుడు వానిచేష్టలుకూడా నిలుచును. ఆవిధముగా సర్వేంద్రియ నిగ్రహమను ధారణయను యోగము నభ్యసింతురు. ఈ యజ్ఞముల నెరుగువారును. ఆచరించువారును, పాపములనుండి ముక్తులగుచున్నారను నిశ్చయము.

శ్లో॥ యజ్ఞశిష్టామృతభుజో యాంతిబ్రహ్మ సనాతనమ్।
నాయంలోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ॥ 31

అర్జునా యజ్ఞానంతరము మిగులు అమృతమును భుజించువారు శాశ్వతమగు బ్రహ్మమును పొందెదరు. యజ్ఞరహితునకు ఈ లోకమూ లేదు. పరలోకమూ లేదు.

శ్లో॥ యేవంబహువిధా యజ్ఞావితతా బ్రహ్మణోముఖే।
కర్మజాన్విద్ధి తాన్సర్వానేవం జ్ఞాత్వావిమోక్ష్యసే॥ 32

వేదముఖమందు పలువిధములగు యజ్ఞములు విస్తరింపబడి యున్నవి. అవి యన్నియు కర్మబంధములని గ్రహించుము. యిట్లు

తెలుసుకున్నవాడు ముక్తుడగును.

శ్లో॥ శ్రేయాన్ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞఃపరంతప।
సర్వంకర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే॥ 33

అర్జునా కర్మము లన్నియు ఫలసహితముగా ఆత్మ జ్ఞానముననే అంతర్గతములగు చున్నవి గనుక ద్రవ్యయజ్ఞముకంటె జ్ఞానయజ్ఞమే శ్రేష్టమని తెలుసుకొనుము.

శ్లో॥ తద్విద్ధిప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।
వుపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వ దర్శినః॥ 34

జ్ఞానమును బడయగోరువాడు గురువు నొద్దకు జని దీర్ఘ నమస్కార మొనర్చి ఆయనను సేవించుచు అవకాశము చూచుకొని బంధమనగా యేమి, మోక్షమనగాయేమి, అని వినయముతో అడిగి ఆయన అనుగ్రహించి యుపదేశించునట్లు వర్తింప వలయును. ఆ గురువు వుపదేశించుటకు దగినంత యనుభవ పరుడుగా నుండవలయును. అట్లాశ్రయింపగా గురువు వుపదేశించును. అనుభవ నిష్టగల వాని యుపదేశమే ఫలవంతమగును గాని వట్టి శాస్త్రజ్ఞానము గలవాని యుపదేశము ఫలవంతముగాదు.

శ్లో॥ యద్జ్ఞాత్వాన పునర్మోహ మేవం యాస్యసి పాండవ!
యేన భూతాన్య శేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథోమయి॥ 35

అర్జునా యెద్దానిని పొందిన మరల యిటువంటి మోహమును పొందవో. ఆ జ్ఞానము వలన నీవు బ్రహ్మనుండి స్థావరము వరకుగల ప్రాణుల నన్నింటిని నీలోనను నాయందునను జూడగలవు.

శ్లో॥ అపిచేదసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి 36

పాపులందరిలోను నీవు పాపిష్ఠుడవేయైనను జ్ఞానమను తెప్పతోడనే పాపిని అతిక్రమించగలవు గనుక ఆజ్ఞానమహాత్మ్యమిట్టిదని తెలుసుకొనుము.

శ్లో॥ యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేర్జున.
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతేతథా॥ 37

అర్జునా ప్రజ్వలితమగు అగ్నికట్టెలనెట్లు భస్మముచేయునో అట్లు జ్ఞానమను అగ్ని సమస్తమగు శుభాశుభ కర్మలను భస్మము చేయుచున్నది.

శ్లో॥ నహిజ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి॥

లోకమున జ్ఞానతుల్యమగు శుద్ధవస్తువు మరియొకటిలేదు. కర్మయోగ సిద్ధుడై ముముక్షువు తనయందుదాను బ్రహ్మజ్ఞానమును కాలక్రమమున బడయుచున్నాడు.

శ్లో॥ శ్రద్ధావాన్‌లభతేజ్ఞానం తత్పరస్సంయతేంద్రియః
జ్ఞానం లబ్ధ్వాపరాంశాంతి మచిరేణాధి గచ్ఛతి॥ 39

శ్రద్ధాళువును. గురుసేవాప్రయుక్తుడును జితేంద్రియుడును అగువ్యక్తి బ్రహ్మజ్ఞానమును పొందును ఆత్మజ్ఞానమును పొంది దానితోబాటు మోక్షమును పడయును.

శ్లో॥ అజ్ఞశ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మావినశ్యతి.
నాయంలోకోఽస్తి న పరో నసుఖం సంశయాత్మనః॥ 40

గురువు కలిగినను, కొంచము జ్ఞానము కలిగినను, శ్రద్ధయున్నను, యిది సిద్ధించునో సిద్ధించదోయని సందేహపడువాడు భ్రష్టుడగును. సందిగ్ధచిత్తునకు ఈ లోకమూలేదు పరలోకమూలేదు అనగా సంసార సుఖమునకు బ్రియత్నింపబోవునప్పుడు యిందేమి సుఖమున్నదియని

ప్తియని విడచును మోక్షమును సాధించుటకు ప్రయత్నించుచు మనస్సు నిలకడగావుండబోదని, యింత కష్టపడినను మోక్షము వచ్చునో, రాదో, యని సంశయించును. అందువల్ల స్వర్గాదిఫల నష్టము పొందును.

శ్లో॥ యోగసన్న్యస్తకర్మాణం జ్ఞాన సంఛిన్న సంశయమ్।
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ॥ 41

అర్జునా ఆత్మజ్ఞానమువలన ధర్మాధర్మములు త్యజించినవాడును బ్రహ్మజ్ఞానమువలన సంశయములన్నియును తొలగినవాడును అగు అప్రమత్తుని కర్మలు బంధింపజాలవు.

శ్లో॥ తస్మాదజ్ఞాన సంభూతం హృత్స్థం జ్ఞానాసినాఽఽత్మనః
ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత!॥ 42

అర్జునా అజ్ఞానజాతమును, హృదయస్థితమును, ఆత్మవిషయకమగు ఈ సంశయమును, జ్ఞాన ఖడ్గముచే ఛేదించి, కర్తృత్వరహిత కర్మయోగమునవలంబించి యుద్ధార్థము లెమ్ము.

జ్ఞానయోగమను చతుర్థాధ్యాయము సమాప్తము.

# అస్పృశ్యయోగము అను శ్రీ మద్భగవద్గీత

## రాజయోగీయము

## పంచమోఽధ్యాయం

## కర్మసన్యాసయోగము

అర్జున ఉవాచ :-

శ్లో॥ సన్న్యాసం కర్మణాం కృష్ణ! పునర్యోగం చ శంససి,
యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్. 1

అర్జునుడు పల్కెను :

కృష్ణా! నీవు కర్మత్యాగమును కర్మానుష్ఠానమును రెండు చెప్పుచున్నావు యీ రెంటిలో యేది శ్రేయస్కరమో నూటిగా నాకు తెలియజేప్పుము.

శ్రీభగవానువాచ :

శ్లో॥ సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ,
తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే. 2

శ్రీకృష్ణుడు పల్కెను :

కర్మసన్యాసము, కర్తృత్వ రహిత కర్మయోగము, రెండును గూడా ముక్తిదాయకములే కాని రెంటిలోను కర్మత్యాగము కంటె కర్తృత్వ రహిత కర్మానుష్టానము శ్రేష్టముపుత్తమము.

శ్లో॥ జ్ఞేయస్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాఙ్క్షతి,
నిర్ద్వన్ద్వోహి మహాబాహో! సుఖం బన్ధాత్ప్రముచ్యతే, 3

అర్జునా! యెవడు ద్వేషింపడో, మరియు కోరిక లేకుండా కర్మ మొనర్చు చున్నాడో అతడు కర్మమొనర్చుచున్నను. సన్యాసియని తెలియనగును. సుఖ దుఃఖాది ద్వంద్వహీనుడు అవలీలగానే సంసార బంధమునుండి ముక్తుడగుచున్నాడు.

శ్లో॥ సాఙ్ఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవద న్తి నపణ్డితాః,
ఏక మప్యాస్థిత స్సమ్య గుభయో ర్విన్దతే ఫలమ్. 4

కర్మసన్యాసమును కర్మయోగమును వేరువేరని మూర్ఖులు చెప్పుచుందురు. పండితులు అట్లు చెప్పరు కర్తృత్వరహిత కర్మాచరణ యందు రెంటియొక్క ఫలముపొందును.

శ్లో॥ య త్సాఙ్ఖ్యైః ప్రాప్యతే స్థానం త ద్యోగై రపి గమ్యతే.
ఏకం సాఙ్ఖ్యంచ యోగంచ యః పశ్యతి సపశ్యతి. 5

జ్ఞాననిష్ఠులగు సన్యాసులు యే స్థానమును పొందుచున్నారో నిష్కామ కర్మయోగులు కూడా ఆస్థానమును పొందుదురు. అయినా జ్ఞానకర్మయోగములను వొకటిగా చూచువాడే యథార్థదర్శియని నిర్ణయము.

శ్లో॥ సన్న్యాసస్తు మహాబాహో దుఃఖ మాప్తు మయోగతః,
యోగయుక్తో ముని ర్బ్రహ్మ నచిరే ణాధిగచ్ఛతి. 6

కర్తృత్వ రహిత కర్మాచరణ లేకుండా జ్ఞాననిష్ఠారూపమగు కర్మసన్యాసము పొందుట కష్టతరము కర్తృత్వ రహిత కర్మ నిష్ఠుడు అగు మననశీలుడు శీఘ్రముగా బ్రహ్మముపొందును.

శ్లో॥ యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః
సర్వభూతాత్మభూతాత్మా కుర్వ న్నపి న లిప్యతే. 7

కర్తృత్వ రహిత కర్మాచరణ కర్మయోగమనబడును. అట్టి యోగమనుష్ఠించువాడు చిత్తశుద్ధినిబడయును. చిత్తశుద్ధికలిగినవానికి

దేహేంద్రియములు వశమగును. అతడు పరిపూర్ణతత్వదర్శియగును. అట్టివారు లోకసంగ్రహార్థముగాని స్వాభావికముగాగాని చేయు కర్మము బంధకారణము గాదు.

శ్లో॥ నైవకించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్,
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ నశ్నన్గచ్ఛన్ స్వపన్ శ్వసన్

శ్లో॥ ప్రలపన్ విసృజన్ గృహ్ణన్ నున్మిషన్ నిమిషన్నపి,
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్. 9

పూర్ణతత్వజ్ఞతగల కర్మయోగి, చూచుచు, వినుచు, తాకుచు, వాసన చూచుచు, తినుచు, నడచుచు, నిద్రించుచు, గాలిపీల్చుకొనుచు, పలుకుచు, విడుచుచు, తీసికొనుచు, కన్నులు తెరచుచు కన్నులుమూయుచు వానివాని కర్మానుసారం తన యింద్రియములు వర్తించుచున్నవి అని విశ్చయించుకొని, ఏ కొంచెమైనను తనకు నేనుగాయొనర్చు నది లేదని తలచును

శ్లో॥ బ్రహ్మణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః,
లిప్యతే న స పాపేన పద్మపత్రమివామ్భసా. 10

ఎవ్వడు తనను తాను తెలిసికొని ఫలాసక్తిని విడిచి కర్మల నాచరించునో అతడు నీటిచే తామరాకువలె పుణ్యపాపముల వలన అంటబడడు.

శ్లో॥ కాయేన మనసా బుద్ధ్యా కేవలైరిన్ద్రియైరపి,
యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాత్మశుద్ధయే. 11

కర్తృత్వరహిత కర్మాచరణము గలిగిన యోగులు ఆత్మశుద్ధికొరకు శరీరము మనస్సు బుద్ధీంద్రియములతో కర్మనొనర్చుచున్నారు.

శ్లో॥ యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే. 12

ఫలాపేక్ష లేక కర్తృత్వ రహితముగా కర్మయొనర్చు కర్మయోగి శమాది షట్కసంపత్తి గలిగి శాంతిపొందియుంటున్నాడు. అన్యులు కామ పరవశముచే కర్మఫలమున ఆసక్తులై బద్ధులగుచున్నారు.

శ్లో॥ సర్వకర్మాణి మనసా సన్న్యస్యాऽస్తే సుఖం వశీ,
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్. 13

కర్తృత్వ రహిత కర్మాచరణ గల పురుషుడు తాను నవద్వారపురమున నుండి కర్మయొనర్చుచున్నానని గాని తనకు వేరుగా నొక ప్రకృతి యున్నది. అది కర్మచేయించుచున్నదని గాని నిర్ణయము లేక వెలయుచుండును.

శ్లో॥ న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే. 14

శ్లో॥ నాదత్తే కస్యచి త్పాపం న చైవ సుకృతం విభుః.
అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః 15

పరిపూర్ణ పరమాత్మ తాను యితర వస్తువును స్పృశించదు. యితరయే వస్తువుచేతను స్పృశించబడదు. గనుక అది జనులను సృష్టించుట లేదు కర్మఫలాసక్తిని సృజించుచుండుట లేదు. కాని జనన మరణ స్వభావపద్ధతిగల మాచేతనే ఇట్లు ప్రవర్తిల్లుచున్నది. మరియు పరిపూర్ణపరమాత్మ సర్వవ్యాపకుడు గనుక యేవొకరి పాపమును పుణ్యమును గ్రహించడు సర్వపూర్ణున్ని తెలుసుకొనుటకు అహంయను అజ్ఞానము కప్పియున్నది. గనుక అందువల్ల జీవులు మోహమునందుచున్నారు.

శ్లో॥ జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః.
తేషా మాదిత్యవ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్. 16

శ్లో॥ తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః,
గచ్ఛన్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః. 17

ఆత్మజ్ఞానము వలన యెవరి అహంవృత్తియును ఆ అజ్ఞానము నష్టమైనదో, వారి యాత్మజ్ఞానము పరబ్రహ్మరూపమై ఆదిత్యునివలె ప్రకాశింపజేయును. మరియు ఆ పరమాత్మనిశ్చయముగల ఆత్మభావులును ఆత్మస్థితులును ఆత్మపరాయణులును ఆత్మజ్ఞానముచే పోగొట్టబడిన ఆవరణము గలవారు అగు ముముక్షువులు జన్మరహితమును పొందుచున్నారు.

శ్లో॥ విద్యావినయసమ్పన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పణ్డితాః సమదర్శినః. 18

ఇట్టిజ్ఞానులే, విద్యతోడను వినయముతోడను పెంపొందిన అంతఃకరణవృత్తితో వుందురు గనుక బ్రాహ్మణునియందును, శునకమునందును చాపిని దిను చండాలుని యందును ఆవునందును ఏనుగునందును సమదృష్టిగలవారు అగుచున్నారు.

శ్లో॥ ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః,
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః 19

యెవ్వరిమనస్సు పూర్ణపద్ధతియందు సమభావమునవిశ్చలమగుచున్నదో వారి వలన యీ జీవితమునవే సృష్టిరూపమైన సంసారము జయింపబడుచున్నది. యెట్లులనగా బ్రహ్మము గుణదోషరహితమగు సమస్వరూపము కనుకవారు పూర్ణపద్ధతిగా పరిణమించుచున్నారు.

శ్లో॥ న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః 20

స్థిరబుద్ధితో మోహవర్జితుడగు పూర్ణపురుషుడు, ప్రియవస్తువునుపొంది సంతోషింపడు అప్రియవస్తువును పొంది విషాదమునందడు.

శ్లో॥ బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్,
సబ్రహ్మయోగయుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే. 21

కర్తృత్వ రహిత కర్మాచరణపద్ధతిగలవారు తన్మాత్రలచే తెలియబడు విషయాదులతో ఆనందింపబడు పూర్ణసత్యము అమృతానందము పొందును.

శ్లో॥ యేహి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవతే,
ఆద్యన్తవన్తః కౌన్తేయ! న తేషు రమతే బుధః. 22

ఓ! కుంతీపుత్రా! యే సుఖభోగములు విషయజాతములో అవి దుఃఖ కారణములె మరియు సంయోగ, వియోగాత్మకములు గనుక జ్ఞాని ఆవిషయములలో ప్రీతినందజాలడు.

శ్లో॥ శక్నోతీహైవ యః సోఢుం ప్రాక్ఛరీరవిమోక్షణాత్,
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః 23

ఎవ్వడు శరీరము విడుచు వరకు కామక్రోధములనుండి కలుగు వేగమును యీ జీవితమునందే సహించి నిగ్రహమొనర్ప సమర్థుడగునో, అతడు యోగి మరియు ఆనందమయుడగు పురుషుడు.

శ్లో॥ యోऽన్తస్సుఖోऽన్తరారామ స్తథాన్తర్జ్యోతిరేవ యః
సయోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోऽధిగచ్ఛతి. 24

ఎవ్వడు ఆత్మయందే సుఖించువాడును, ఆత్మయందే క్రీడించువాడును అయి మరియు అంతరదృష్టితో బ్రహ్మస్వరూపుడై యుండునో ఆ యోగి నిర్వాణమును పొందుచున్నాడు.

శ్లో॥ లభన్తే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః;
ఛిన్నద్వైధా యతాత్మాన స్సర్వభూతహితే రతాః. 25

పుణ్యపాపవర్జితులు సంశయ శూన్యులు సంయమచిత్తులు సమస్త జీవులకు శుభమొనర్చువారు ఋషులు బ్రహ్మస్వరూపముగనే నిర్వాణము పొందెదరు.

శ్లో॥ కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్,
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్. 25

కామక్రోధ విముక్తులను సంయమ చిత్తులును ఆత్మజ్ఞులును నగు యతులకు శరీర త్యాగమునకు పూర్వమునను తరువాతను గూడ మోక్షము లభించుచున్నది.

శ్లో॥ స్పర్శాన్కృత్వా బహిర్బాహ్యాం శ్చక్షుశ్చైవాన్తరే భ్రువోః,
ప్రాణాపానౌ సమౌకృత్వా నాసాభ్యన్తరచారిణౌ.
యతేన్ద్రియమనోబుద్ధి ర్ముని ర్మోక్షపరాయణః, 27
విగతేచ్ఛాభయక్రోధో య స్సదా ముక్త ఏవ సః 28

బాహ్యములగు విషయాదులను అంతఃకరణమునందు నివాసమొనర్చ నివ్వకుండా బాటసారులను పంపివేసినట్లు పంపివేయవలెను. నేత్రముల రెంటిని ఆత్మపద్ధతిగా యేకమొనర్చి అజ్ఞేయమందునిలిపి నాసికారంధ్ర మందు సంచరించు ప్రాణవాయువు అపానముతో చేర్చి వ్యానరూప మున కుంభించి పూర్ధ్వఅధోగమనమును శూన్యమొనర్చి, బుద్ధినిశ్చ యమున, ముముక్షువై ఇచ్ఛ భయము కోపములేనివాడై యే యోగి వెలయుచుండునో అతడే సర్వదా బంధములేనివాడగును.

శ్లో॥ భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరమ్,
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి 29

నన్ను యజ్ఞమునకును తపస్సునకును భోక్తగను, సర్వలోకేశ్వరునిగను సర్వజీవుల మిత్రునిగను, తెలుసుకొని, యోగి శాంతిని పొందు చున్నాడు.

పంచమోధ్యాయం కర్మసన్న్యాసయోగము
సంపూర్ణము.

—•••—

# అస్పర్శయోగము అను శ్రీమద్భగవద్గీత

## రా జ యో గీ య ము

## ఆత్మసంయమయోగం

ooooooooooooooooooo

శ్రీ భగవానువాచ.

శ్లో॥ అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః
సన్న్యాసీచ యోగీచ న నిరగ్ని ర్నచాక్రియః 1

శ్రీ భగవానుడు చెప్పుచున్నాడు,

కర్మఫలత్యాగ పద్ధతిగా కర్తవ్యమును నిత్యకర్మములను యెవ్వడు యొనర్చుచున్నాడో అతడె సన్యాసి, యోగి యని చెప్పఁగును. అగ్ని కర్మలనుగాని అగ్న్యపేక్ష లేని తపోదానాది కర్మములను గాని త్యజించిన మాత్రమున వాడు సన్యాసియును కాడు, యోగియును కాడు. వైదికకర్మ ఇష్ట పూర్త దత్తములని త్రివిధము ఇష్టమనఁయజ్ఞయాగాదులు. పూర్తమన తటాక నిర్మాణాదులు, దత్తమనదానము.

శ్లో॥ యంసన్న్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాణ్డవ,
న హ్యసన్న్యస్తసఙ్కల్పో యోగీ భవతి కశ్చన. 2

అర్జునా! శాస్త్రము యెద్దానిని సన్యాసమని చెప్పునో దానిని యోగమని గ్రహింపుము యేలయన సంకల్ప త్యాగి కాని యెడల యెవ్వడును యోగి కాజాలడు.

శ్లో॥ ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే.
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే. 3

ధ్యానయోగమును పొందగోరు మునికి నిష్కామ కర్మానుష్ఠానము సాధనమని చెప్పబడుచున్నది జ్ఞానమును అధిష్ఠించిన అధ్యాననిష్ఠునకు సర్వకర్మనివృత్తియే సాధనమని చెప్పబడుచున్నది.

శ్లో॥ యదాహి చేన్ద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే.
సర్వసఙ్కల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే. 4

యెప్పుడు కర్తృత్వ రహిత కర్మాచరణ పద్ధతియందు సర్వసంకల్ప త్యాగియగువాడు నిత్యనైమిత్తిక కర్మలకు ఆసక్తుడుకాడో అప్పుడు యోగారూఢుడని చెప్పబడును.

శ్లో॥ ఉద్ధరే దాత్మనాఽఽత్మానం నాత్మాన మవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బన్ధు రాత్మైవ రిపు రాత్మనః. 5

మనుష్యుడు వివేకముతో కూడిన కర్తృత్వ రహితమగు మనస్సువలన తన్ను తానే సంసారమునుండి ఉద్ధరించుకొనవలయును. యెప్పుడును విషయాసక్తి రూపకర్తృత్వము పొందకూడదు యేలననగా కర్తృత్వ రహిత మనస్సే మనుష్యునకు యథార్థమగు హితమును తెలియచేయు మిత్రము. కర్తృత్వరూప విషయాసక్తమగు మనస్సే మనుష్యునకు పరమ శత్రువు

శ్లో॥ బన్ధురాత్మాఽఽత్మనస్తస్య యేనాత్మై వాత్మనా జితః,
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్. 6

యే వివేకముతో గూడిన మనస్సు వలన దేహేంద్రియాదులు జయింపబడుచున్నవో ఆ మనస్సు ఆ జీవాత్మకు మిత్రము కాని అజితాత్ముని వివేకశూన్యమగు మనస్సు కర్తృత్వరూపస్వేచ్ఛా ప్రవర్తనవలన శత్రువువలె అపకృతి నొసర్చ ప్రవర్తించును.

శ్లో॥ జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః,
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః. 7

జితేంద్రియుడును శాంతుడును అయినవాడు శీతోష్ణసుఖదుఃఖముల లోను, సన్మాన తిరస్కారములందునప్పుడును ఆత్మపద్ధతిగానుండును యేలాటిచలనము వుండదు.

శ్లో॥ జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః,
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః. 8

జ్ఞానమనగా మోక్షవిషయమైనబుద్ధి విజ్ఞానమనగా మోక్షవిషయవస్తు నిశ్చయము తెలుసుకొనుట తృప్తాత్మ అనగా ఆత్మపరమాత్మల ఏకైక స్థితిపొందిన నిర్వికారజితేంద్రియుడు. అతడుమట్టిబెడ్డనురాతినిబంగారమును సమముగా జూచును. అటువంటివాడు యోగారూఢుడని యోగియని చెప్పబడును.

శ్లో॥ సుహృన్మిత్రార్యు దాసీనమధ్యస్థ ద్వేష్యబన్ధుషు,
సాధు ష్వపిచ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే. 9

సుహృదుడు మిత్రుడు శత్రువు వుదాసీనుడు మధ్యస్థుడు ద్వేషుడు బంధువు వీరియందును. సాధువులయందును దురాచారులందును సమబుద్ధిగలవాడు యోగారూఢుడగుచున్నాడు.

1. సుహృదుడు= స్వభావమువలననే హితమునుగోరువాడు.
2. మిత్రుడు= స్నేహమున వుపకారమొనర్చువాడు.
3. శత్రువు= ఘాతకుడు చంపువాడు మరియు నొప్పించువాడు.
4. వుదాసీనుడు= యిరువురుపోరాడుచుండగావుపేక్షనువహించువాడు
5. మధ్యస్థుడు= పోరాడే యిరువురి మంచిని కోరువాడు.
6. విరోధి= విద్వేషింపదగినవాడు.
7. బంధువు= చుట్టము.
8. సాధువు= సృష్టినిర్ణయ స్థితికి అనుకూలముగా ప్రవర్తించువాడు
9. దురాచారుడు= సృష్టినిర్ణయమునకు వ్యతిరేకముగా ప్రవర్తించువాడు.

అర్జునా మనస్సు మిక్కిలి చలించుచుండును. ఈ మనశ్చాంచల్యమును మాన్పుటయే యోగము యొక్క ముఖ్యోద్దేశ్యము. యిట్టి యుత్తమ ఫలప్రాప్తికి సాధనములగు యోగాంగములు చెప్పెదను వినుము,

శ్లో|| యోగీ యుఞ్జీత సతత మాత్మానం రహసి స్థితః,
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీర పరిగ్రహః. 10

యోగి నిర్జన స్థానమున యేకాకిగా నుండి కాంక్షా శూన్యుడును పరిగ్రహ రహితుడునునై దేహమును మనస్సును సంయమ మొనర్చి అంతఃకరణమును సమాహిత మొనర్చవలయును.

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్ 11
తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేన్ద్రియక్రియః,
ఉపవిశ్యాసనే యుఞ్జ్యా ద్యోగమాత్మ విశుద్ధయే. 12

పవిత్ర స్థానమున మిక్కిలి యెత్తుకానిదియు. మిక్కిలిగ క్రిందుకాని దియునగు కుశాజినచేలయుతమగు స్థిరాసనమును తనకొరకు నిర్మించు కొని యందాసీనుడై బాహ్యేంద్రియ కార్యములను అంతరింద్రియ కార్యములను నిరోధించి ఏకాగ్రమనస్కుడై చిత్తశుద్ధికొరకు యోగము నభ్యసించవలయును.

సమం కాయశిరో గ్రీవం ధారయన్నచలం స్థిరః,
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్, 13
ప్రశాన్తాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః,
మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీతమత్పరః. 14

బ్రహ్మ దండిని కంఠమును శిరస్సును స్థిరముగను సమానముగను నిలిపి కదలికలేనివాడై నాసికాగ్రమున దృష్టి నిలపి ప్రశాంత చిత్తుడును భయరహితుడును బ్రహ్మచర్య వ్రతమునందున్నవాడునై నాయందు చిత్తము నిల్వ నన్నొక్కనినే భావించుచు సమాహితుడై యుండవలయును.

యుఞ్జన్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః,
శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి, 15

యోగి యిట్లు నిరంతరము సమాహితుడై మనస్సును సమాధాన మొనర్చి నాయాధీనమగు నిర్వాణరూపమగు శాంతిని బొందుచున్నాడు

నాత్యశ్నతస్తు యోగోఽస్తి నచైకాన్త మనశ్నతః,
న చాతిస్వప్న శీలస్య జాగ్రతో నైవ చార్జున! 16

అర్జునా మిక్కుటముగా భుజించువానికి ధ్యానము కుదురదు. అస్లే యేమి తినని వానికి కూడా యిది లభించదు మిక్కువగా నిద్రించు వానికిని అమితముగా మేల్కొనియుండు వానికిని గూడ ధ్యానము కుదురదు.

యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు,
యుక్తస్వప్నావ బోధస్య యోగో భవతి దుఃఖహా, 17

పరిమితములగు ఆహార విహారములు గలిగి జపతపములగు కర్మములందు పరిమితములగు ప్రయత్నము గలిగి నియమితములగు నిద్రా జాగరణములు గలిగియుండువాని ధ్యానము సంసార దుఃఖమును పోగొట్టుచున్నది.

యదా వినియతం చిత్త మాత్మన్యేవావతిష్ఠతే,
నిస్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా. 18

ఐహికాముష్మిక విషయతృష్ణనుండి విడువబడి నిస్పృహుడైన యోగి చిత్తము విశేషముగ నిరోధింపబడి ఆత్మయందే వెలయునప్పుడు అతడు యోగసిద్ధుడని చెప్పబడును.

యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా,
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః. 19

గాలిలేనిచోట దీపమెట్లు కంపింపకుండునో ఆత్మయందు యోగమును అభ్యసించు యోగి చిత్తము అట్లు కంపించకుండును.

యోగశబ్దమున కర్థము కర్తృత్వ కర్మాచరణయని సమాధియని చెప్ప

బడినది యీ రెంటిలో ముఖ్యమెయ్యదియో యీ దిగువ 20-21-22 23 శ్లోకములయందు చెప్పబడుచున్నది.

యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా,
యత్ర చైవాత్మనాఽఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి. 20

యేస్థితియందు యోగాభ్యాసము వలన నిరోధింపబడిన చిత్తము ఉపరతినొందుచున్నదో మరియు యేస్థితియందు యోగి కేవల చిత్తమువలన ఆత్మచైతన్యమును దర్శించుచు పరితుష్టినందుచుండునో.

సుఖమాత్యంతికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్.
వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః. 21

యేస్థితియందు యోగి యింద్రియ నిరపేక్షమును బుద్ధిగ్రాహ్యమును అతీంద్రియమునగు అనంత సుఖమననుభవించునో మరియు యేస్థితియందుండిన యోగి ఆత్మతత్వమునుండి అణుమాత్రమైన చలింపకుండునో.

యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః.
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే. 22

యేస్థితిని పొందిన యోగి తదితరములగు లాభములు అనగా అణిమాది అష్టసిద్ధులు కోరడో యేస్థితియందుండిన మహాదుఃఖములవలన గూడా చలింపకుండునో.

తం విద్యాద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్.
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా. 23

దుఃఖముయొక్క అత్యంతిక నివృత్తియగు అస్థితిని యోగమని గ్రహింపుము అనగా కర్మత్రిత్వరహిత కర్మాచరణయోగమని నిశ్చయము విసుగులేని చిత్తముతో పట్టుదలబూనియీ యోగమునభ్యసింపదగును పరిపడు సరిపడదనకను సరిగా సమరస బుద్ధితో అనుష్ఠింపవలయును.

సంకల్పప్రభవాన్కామాం స్త్యక్త్వా సర్వానశేషతః,
మనసైవేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః. 24

సంకల్పమువలనకలుగు సమస్త కామములను సంపూర్ణముగా త్యజించి మనస్సువలన యింద్రియ సమూహమును సమస్త విషయములనుండి మరలించి.

శనైశ్శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా,
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చిన్తయేత్. 25

ధైర్యముతో కూడిన బుద్ధితో మనస్సును నిదానముగా ఉపరతి యొనర్చవలయును అనగా మనస్సును ఆత్మయందువుంచు దానిగా యొనర్చవలయును యితర చింతలు యేమియున్నవుండకూడదు. అంతయు ఆత్మయే ఆత్మకంటె మరియేమియు లేదని భావించుచుండవలెను. యిదియే యోగమును గురించిన పరమవిధి ఇదియే తత్వనిష్ఠ.

యతో యతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరమ్.
తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్. 27

చంచలమును అస్థిరమును అగు మనస్సు యేయే విషయములపై పరుగిడునో ఆయా విషయముల నుండి మరల్చి ఆత్మను స్వాధీనమునకు తీసుకొని రావలయును. ఆత్మయందె స్థిరమొనర్పవలయును.

ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్,
ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూతమకల్మషమ్, 27

ప్రశాంతచిత్తుడును రజోగుణ కార్యములగు విక్షేపాదులులేనివాడును. పాపరహితుడును. బ్రహ్మభావమును పొందినవాడును అగు యోగినే, పరమమగు పరిపూర్ణశాంతి ఆశ్రయించును. అనగా నాతనికే పరిపూర్ణస్థితి లభించును.

శ్లో॥ యుంజన్నేవం సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః,
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యన్తం సుఖమశ్నుతే. 28

ఇట్లు మనస్సును సర్వదా యోగయుక్తమొనర్చిన పాపరహితుడగు యోగి అనాయాసముగా బ్రహ్మానుభూతివలన కలుగు ఆత్యంతిక శాంతి బొందుచున్నాడు.

సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. 29

కర్తృత్వ రహిత కర్మాచరణగల పురుషుడు సర్వభూతములయందు బ్రహ్మమును దర్శించుచు తన ఆత్మను బ్రహ్మాదిస్థావరాంతముగగల సర్వభూతములలోను సర్వభూతములను తనయందును దర్శించు చుండును.

యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం నప్రణశ్యామి సచ మేన ప్రణశ్యతి. 30

యెవ్వడు సర్వభూతములలో నన్ను చూచునో మరియు నాయందు జీవేశ్వర జగత్తు నంతటిని చూచునో నేను వానికి అదృశ్యుడనుగాను మరియు నాకు అతడు పరోక్షుడవడు అనగా వుభయులము యేకమే.

సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయివర్తతే. 31

సర్వభూతములయందు వెలయుచున్న నన్ను యేకత్వముగా తెలుసుకొని యెవ్వడు భజించునో ఆజ్ఞానియేయవస్థయందున్నను నాయందే వెలయుచుండును.

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున!
సుఖం వా యదివా దుఃఖం స యోగీ పరమో మతః. 32

అర్జునా భూతముల నన్నింటిని తనతోడ బోల్చుకొనుచు సుఖముగాని

దుఃఖముగాని సమభావమున చూచునో ఆ ఆత్మజ్ఞాని శ్రేష్ఠుడని నా అభిప్రాయము.

అర్జున ఉవాచ :

యోఽయం యోగస్త్వయాప్రోక్త స్సామ్యేన మధుసూదన!
ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్. ౩౩

అర్జునుడు పల్కెను.

మధుసూదనా మనస్సులయ విక్షేపశూన్యమై కేవలాత్మాకారమై వెలయు సమత్వ యోగమును నీవు చెప్పితివి. చంచలస్వభావమగు మనస్సున యీసమత్వభావమెట్లు స్థిరమగునో గ్రహింపజాలకున్నాను.

చంచలం హి మనః కృష్ణ! ప్రమాథి బలవద్దృఢమ్,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్. ౩౪

కృష్ణా మనస్సు చంచలము. శరీరమునకు యింద్రియములకు కలత కలుగ జేయునదై యున్నది. దీనిని విషయ వాసనల నుండి నివృత్తి మొనర్చుట అత్యంత కఠినము, దీని నిరోధించుట ఆకాశమునందలి వాయువును నిరోధించు ప్రయత్నమువలె అసాధ్యమని తలంచు చున్నాను.

శ్రీ భగవానువాచ—

అసంశయం మహాబాహో! మనో దుర్నిగ్రహం చలమ్,
అభ్యాసేన తు కౌన్తేయ! వైరాగ్యేణ చ గృహ్యతే. ౩౫

శ్రీకృష్ణుడు పల్కెను మహావీరుడవగు ఓకుంతీ పుత్రా! మనస్సు నిగ్రహింప కష్టమనుటలో సందేహము లేదు. కాని ధ్యానాభ్యాసము వలనను, కర్తృత్వ రహిత కర్మాచరణవలనను, ఐహికపారలౌకిక విషయ వితృష్ణవలనను దీనిని నిరోధింపవచ్చును.

అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః. 36

స్వాధీన చిత్తుడుకాని వానికి యీ యోగము పొందనశక్యము అని నా అభిప్రాయము. కాని యత్నశీలుడును వశీభూత చిత్తుడునగు వ్యక్తి వలన తగిన వుపాయమున యియ్యది పొంద సంభవమైనది.

అర్జున ఉవాచ :

అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలిత మానసః,
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ! గచ్ఛతి? 37

అర్జునుడు పల్కెను కృష్ణా శ్రద్ధతో యోగసాధన నారంభించియత్న హీనతవలన చిత్తస్థైర్యమును కోల్పోయిన యోగభ్రష్టుడు యోగ సిద్ధిని పొందడు. మరి అతడు యెటువంటిగతిని పొందుచున్నాడు.

కచ్చిన్నోభయవిభ్రష్టః ఛిన్నాభ్ర మివ నశ్యతి,
అప్రతిష్ఠో మహాబాహో! విమూఢో బ్రహ్మణః పథి. 38

కృష్ణా బ్రహ్మప్రాప్తి సమయమున కలతనందినవాడు నిరాశ్రయతవలన కర్మధ్యానములకు రెంటికిని చెడినవాడై చెదరిన మేఘము పోలె వినాశనమును పొందడుకదా! అనగా,

కర్తృత్వ రహిత కర్మాచరణ పద్ధతి పూనక కర్మలను ఈశ్వరార్పణ మొనర్చినను లేక త్యజించినను స్వర్గము లభింపదు. మరియు పారగర్థ చరమార్గ సంయోగసిద్ధినందకపోవుటవలన మోక్షము లేదు. స్వర్గమోక్షములకు రెంటికిని చెండినవాడగుట వలన వుభయభ్రష్టుడగుచున్నాడు అనగా

విచ్ఛిన్నమేఘము పూర్వమేఘమునుండి తెగినదై తర్వాత దానిని మరలపొందజాలక సుడిగాలియందుపడి నశించుచున్నది. అదే పద్ధతిగా యోగభ్రష్టుడు నశింపడు గదా! యని అర్జునుని భయము.

ఏతన్మే సంశయం కృష్ణ! ఛేత్తుమర్హస్యశేషతః,
త్వదన్యస్సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే. 39

కృష్ణా నా ఈ శందేహమును సంపూర్ణముగ నివారింప నీవు యోగ్యుడవు నీవు తప్పించుదుపు ఋషులుగాని దేవతలుగాని ఈ సంశయమును దీర్పజాలరు

శ్రీభగవానువాచ :

పార్థ! నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే,
న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత! గచ్ఛతి. 40

శ్రీకృష్ణుడు పల్కెను. అర్జునా యోగభ్రష్టునకు యీ లోకమున శిక్షలుండవు కలుగదు. పరమున నరక ప్రాప్తి మున్నగునవి గూడ కలుగవు. కర్తృత్వ రహిత కర్మాచరణగలవాడు మానవలోకమునకు మంచినొనర్చువాడుగానేవుండును అందువల్ల అధోగతిని పొందడు.

ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీస్సమాః
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే. 41

ఒకప్పుడు కర్తృత్వముతో కర్మనొనర్చిన యెడల యోగభ్రష్టుడగును. అట్టి వ్యక్తి పుణ్యాత్ముల లోకముల పొంది పెక్కు సంవత్సరములు అక్కడవుండి సదాచారపరులును, ధనికులునగువారి గృహమున పుట్టును.

అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్,
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్, 42

లేక జ్ఞానులును యోగులును అగు వారి వంశమున జన్మించును. యిటువంటి జన్మము కలుగుట అత్యంత దుర్లభము.

తత్రతం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్,
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునన్దన! 43

అర్జునా పూర్వజన్మమందు పొంది యుండిన అమోక్ష పరమగు బుద్ధిని పొందును. మరియు పూర్వజన్మమున నొనర్పబడిన సాధనతో పూర్వ జన్మమునందలి సంస్కారముల ప్రేరేపణ వలన సిద్ధిని బొంద అంత కంటె యెక్కువగ ప్రయత్నించును.

పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోపి సః,
జిజ్ఞాసు రపి యోగస్య శబ్దబ్రహ్మాఽతివర్తతే. 44

అతడు ప్రయత్న మొనర్పక పోయినను, పూర్వజన్మము నందలి అభ్యాసమువనే ఆకర్షింప బడును. యోగస్వరూపమును యెరుగ గోరు వాడు వేదోక్తములగు కర్మముల ననుష్ఠించిన కలుగు ఫలమును అతిక్రమించును.

ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః,
అనేక జన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్. 45

పూర్వ జన్మ కృతమగు యత్నముకంటె యెక్కువగా ప్రయ త్నించుచు పాపరహితుడై యోగి బహుజన్మ సాధనా ఫలముగ పరమ గతిని పొందును.

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున. 46

యోగియగు తత్వజ్ఞాని కృచ్ఛ్ర చాంద్రాయణాది రూపకమగు తపస్సు నొనర్చుదాని కంటెను శ్రేష్ఠుడు. శాస్త్రజ్ఞానము, శాస్త్రార్థము నెరుగు పండితుల కంటెను శ్రేష్ఠుడు. అగ్నిహోత్రాది కర్మల నొనర్చువాని కంటెను శ్రేష్ఠుడు. అని నా నిర్ణయము గనుక అర్జున నీవు తత్వ జ్ఞానివి కమ్ము.

యోగినా మపి సర్వేషాం మద్గతే నాన్తరాత్మనా,
శ్రద్ధావాన్ భజతే యోమాం సమేయుక్తతమో మతః. 47

యెవ్వడు శ్రద్ధాయుక్తుడై ఆసక్తితో గూడిన చిత్తముతో నన్ను భజించునో అతడు రుద్రాదిత్యాది దేవతా ధ్యానపరులగు యోగులందరికంటెను సర్వశ్రేష్ఠుడు యిది నా సిద్ధాంతము.

కర్మషట్కము (షష్ఠాధ్యాయము) సంపూర్ణము

—*—



# అస్పర్శ యోగము

## అనే

# శ్రీ మద్భగవద్గీత

## రాజయోగీయము

### ద్వితీయ భాగము

*(7 నుండి 12 అధ్యాయములు)*



వ్యాఖ్యాత :

శ్రీ దయానంద పొన్నాల రాజయోగి

సికింద్రాబాద్.

వెల రు. 6-/

## అపూర్వయోగము అనే శ్రీ మద్భగవద్గీత
రెండవ భాగము (7 నుంచి 18 అధ్యాయములు)

# పీఠిక

శ్రీమద్భగవద్గీత, అర్జునుని వ్యాజముతో సమస్త మానవాళికి శ్రీ కృష్ణుడు ప్రపంచ పారమార్థికములలో కర్తవ్య ముపదేశించిన గ్రంథరాజము. కురుపాండవ పక్షములు యుద్ధ సన్నద్ధులై ముఖాముఖి నిలబడి సేనాధ్యక్షుల ఆజ్ఞలకై నిరీక్షించుచూ వేచియుండిన సమయము యుద్ధరంగమే వుపదేశ స్థలము. పూజనీయులగు గురువులు, తాత, తండ్రులు ప్రేమ పాత్రులగు బంధువర్గము తమ్మెదిరించ వచ్చినట్లు కనుగొని వారిని చంపవలసి వచ్చునేయని అర్జునుడు విషాదగ్రస్తుడై రథమున చతికిలబడెను. మాధవుడు గురువు. మానవోత్తముడగు అర్జునుడు శిష్యుడు. ఇవి గీతోపదేశమునకు దేశకాల పాత్రలు.

700 శ్లోక సంఖ్యగల విస్తృతమైన భగవద్గీతయంతయు నిజముగా నపుడు శ్రీ కృష్ణుడర్జునునికి ప్రబోధించి యుండెనా? వూరక పఠించుటకే కనిసము రెండు గంటల కాలము కావలెనే? ఒకరిపై నొకరు గుకుటకు తొందరపడుచున్న వీరాగ్రేసరులందరు వూరక నిలబడి అపుడేమి చేయుచుండిరి? మహాభారతమందలి యీ గీతా శ్లోకములు కవి ప్రకాండుడగు వ్యాసుడు తన సహజ పాండిత్యముతో విస్తరించి వ్రాసి యుండునేమోనని చెప్పవలసివుండును. అట్టి సంక్లిష్టసమయమున ఏవో కొన్ని సూటిమాటలచే అర్జునునికి దుఃఖోపశమనము గావించి కర్తవ్యోన్ముఖుని గావించునేగాని, వేదాంత సర్వస్వమును గూర్చి దీర్ఘోపన్యాసముచేసి పదునెనిమది యోగములు (మార్గములు) విపులపరచి బోధించుచూ కాలక్షేపము చేయడుగదా! కనుక అర్జునుని దుఃఖ కారణమగు మోహముయొక్క నిరాకరణము గావించి కర్తవ్య నిష్ఠునిగావించిన గీతయందలి ముఖ్యమార్గ మేదియో నరయవలసివున్నది.

ఇందుకు ముందుగా అర్జునుని విషాదమునకు మూలకారణము లేమో తెలియవలసి వున్నది. స్వస్వరూప జ్ఞానము బడయు విశేషజ్ఞానము యొక్క మానవోపాధియందే గలదు. కాని "అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః" ఆ స్వస్వరూపము అజ్ఞానముచే నావరింప

బడియుండుటచే అజ్ఞాన కార్యములగు కామ క్రోధ లోభ మోహ భయములచే మానవుడే, యెక్కువగా వివశుడగుచున్నాడు. అర్జునుడు ముఖ్యముగా గురుభక్తి, బంధుప్రీతి పాపభీతి మొదలగు వానిచే స్వధర్మోచిత కర్మ నిర్వాహణనుంచి పరాఙ్ముఖుడైనాడు. మరియును యుద్ధమునందు వైరులను "నేను నా పరాక్రమముచే చంపబోవు చున్నాను అని స్వాభిమాన పూరితమైన వ్యష్ట్యహంకారమునకు గురియైనాడు. స్వరూప జ్ఞానముచేత మాత్రమే భేదబుద్ధి రహితమై మోహవృత్తి నశించగలదు. కర్తృత్వ త్యాగరూపమైన శరణాగతి చేత మాత్రమే కర్తృత్వాహంకారము నశించును. కనుక మోహ వృత్తి నశించుటకు స్వస్వరూప మెరిగించి స్థితప్రజ్ఞనిచేయు సాంఖ్య యోగమును కర్తృత్వాహంకార నాశనమునకు శరణాగతి పరాకాష్ట గాగల చరమ శ్లోకమును శ్రీ కృష్ణుడు ప్రబోధించవలసివుండెను.

కామక్రోధాదులకు అంతఃకరణముతో గూడిన చిజ్జడాత్మకమగు చేతనాత్మయే ముఖ్యకారణమనిన్ని ఆ చేతనాత్మ కన్యముగా యే పరిపూర్ణ పరబ్రహ్మము కలదో దానియందు కామాదివృత్తుల కత్యంత మూలకారణము చేతనాత్మకు స్థానముగాని మూలముగాని లేదని దెలసి ఆపరిపూర్ణ పరబ్రహ్మమును చేతనాత్మను యెరిగి పంచతన్మాత్ర విషయములకు లోనుగాక పరిపూర్ణత దనువాడే స్థితప్రజ్ఞుడు. కనుక సాంఖ్యయోగములో ముందుగా చేతనాత్మయు, పరిపూర్ణ పరబ్రహ్మ మును, దెల్పి పిదప స్థితప్రజ్ఞ లక్షణములు చెప్పబడినవి ఈ సాంఖ్య యోగము కపిలసాంఖ్యమువంటిదికాదు "సమ్యగ్ ఖ్యాపనంసాంఖ్యం" అనగా ఆత్మను సంపూర్తిగా వివరించునదిసాంఖ్యము ఎనుక పరిపూర్ణ లక్షణములు ఏ విధంగా యిందు చెప్పబడినవి? అని ప్రశ్నించవచ్చును? ఆత్మ శబ్దము నానార్థములలో ప్రయోగింపబడుచున్నది. దేహము, మనస్సు, బుద్ధి, అంతఃకరణము, జీవుడు, ప్రత్యగాత్మ, పరమాత్మ బ్రహ్మము (పరిపూర్ణ బ్రహ్మము) యివన్నియు ఆత్మ శబ్దార్థములే. ఇందు లక్ష్యార్థముచే పరమాత్మయు, లక్ష్యలక్ష్యార్థముచే పరిపూర్ణ పరబ్రహ్మమున్ను అర్థముగా గ్రహించవలెను. గీతయందలి సాంఖ్య

యోగములో 12 నుంచి 16 వరకుగల శ్లోకములు లక్ష్యార్థముచే, చేతనాత్మను వివరిస్తే, అక్ష్యలక్ష్యార్థముచే 17 నుంచి 29 వరకుగల శ్లోకములు పరిపూర్ణ పరబ్రహ్మాను ననువదించుచున్నవని గ్రహించవలసియున్నది. ఇట్లు, ఎరుక పరిపూర్ణములు, తదుపరి స్థితప్రజ్ఞ లక్షణము యీ సాంఖ్యయోగమున దెలుపబడినవి.

మిగతా అధ్యాయములలో లోకంలోగల కర్మ భక్తి జ్ఞాన, ధ్యానాది మార్గములన్నియు (సర్వధర్మములు) ప్రబోధింపబడినవి. మరిన్ని ప్రపంచమందుగల వైదిక లౌకిక నైతిక సాంఘిక (వర్ణాశ్రమాచార) ధర్మములన్నియు చెప్పబడినవి. చివరకు కర్తృత్వ త్యాగ రూపమైన కర్మాచరణము చెప్పబడి "సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజ" అంటూ ఎరుక విడుచు నుపాయం కూడా వుద్ఘాటింపబడినది విభిన్న ప్రకృతులుగల వ్యక్తులకు విభిన్న మార్గములు గీత సూచిస్తూ వచ్చినది కాని ఆద్యంతములయందు అనగా సాంఖ్య యోగమునందును చరమ శ్లోకమునందును, పరిపూర్ణ మెరుకలను దెల్పి ఎరుకను విడచు నుపాయము చెప్పియున్నది. "శిష్యస్తేహం శాధి మాం త్వాం ప్రపన్నమ్" అంటూ తన్నాశ్రయించిన సచ్ఛిష్యుడైన అర్జునునికి సద్గురువైన శ్రీ కృష్ణుడు తొలుతనే సాంఖ్యయోగములోనే పరిపూర్ణ మెరుకల దెల్పి చరమ శ్లోకములో మెరుకలు విడిపించు నుపాయము దెల్పి మధ్యలో కర్తృత్వత్యాగ రూపమైన కర్మకౌశల మొసగించి సర్వసంశయ రాహిత్యమును గావించెను.

"అతనికి దయవస్తే అరనిమిషమునచే బోధస్థితి నీకుకుదిరించు" ననే న్యాయంగా ఒకటి రెండు మాటలలోనే సూటిగా పరిపూర్ణ బోధను దెల్పి స్వధర్మ కర్మ నిర్వహణతో గూడిన రాజమార్గము నుపదేశించి "నష్టోమోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాచ్యుత స్థితోస్మిగత సందేహః కరిష్యేవచనంతవ" అని గీత అర్జునునిచే పలికించినది. కనుక సర్వధర్మాధర్మములను విడచి త్రికరణ శుద్ధిగా తను మనధనములు ధారబోసి సర్వభారమును గురునిపైనే వదలి గురుని ఆజ్ఞానారము ప్రవర్తించుటయే అస్పర్శయోగమునకు పరాకాష్ఠ.

"సర్వేజనా స్సుఖినోభవంతు" (గ్రంథకర్త)

# శుభాశీస్సు

శ్రీయుత కోటపాటి పున్నయ్య వీరి సతీమణి శ్రీమతి పున్నమ్మ గార్ల పుణ్య గర్భవాసమున జన్మించిన చి॥ కృష్ణారావు పుట్టినవెంటనే తల్లి పరమపదించినందున, గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా, పుంతిరి పాలెంలో మాతామహి శ్రీమతి గోగినేని మహాలక్ష్మమ్మగారీతనిని అల్లారుముద్దుగా పెంచి, విద్యాబుద్ధుల గరపి, ఆలపర్తివారి కుటుంబము నుండి, రమాకుమారి యనే కన్యారత్నమును వివాహ మొనర్చి తన కున్న స్థిరచరాస్తు లిచ్చియుండెను. వీరి పూర్వజన్మ సుకృత విశేష మున శ్రీ మదచలఋషి రామనుగు శ్రీ శివరామ దీక్షిత పీఠాధికా రులగు అచలఋషి శ్రీ దయానంద పొన్నాల రాజయోగీశ్వరుల నాశ్రియించి ధర్మోపదేశముపొంది శక్తిద్వయ నిరాసకంబై, ఉపాధు లోపాధి ద్వయదోష రహితంబై యొప్పు పరిపూర్ణ తత్వమును తెలిసికొని, వీరు జనన మరణ భ్రాంతి రహిత పరిపూర్ణ స్థితినిబొంది కృతార్థులైరి. తద్వత్తుగా సోదర మానవులు కృతార్థులగుట కొఱకు యీ గ్రంధము నకు ద్రవ్య సహాయము మొనర్చియున్నారు. వీరికి మా శుభాశీస్సులు.

ఇట్లు

పీఠాధిపతి :

సికిందరాబాద్ : శ్రీ మదచలఋషి దయానంద పొన్నాల రాజయోగి

15—4—74 : గ్రంధకర్త.

# అపూర్వయోగము అనే

# శ్రీమద్భగవద్గీత

## రాజయోగీయము

### సప్తమాధ్యాయము

### విజ్ఞాన యోగము

శ్రీ భగవాన్ ఉవాచ :

శ్లో॥ మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్మదాశ్రయః।
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు ॥ 1

శ్రీ కృష్ణుడు పల్కెను అర్జునా! నా యందు ఆసక్తమైన చిత్తముతో శరణాగతుడవై యోగమును అభ్యసించుచునుందువేని, విభూతి బలైశ్వర్యాది సంపన్నమగు నా పూర్ణ స్వరూపమును నిస్సంశయముగ తెలిసికొనగల రీతిని వినుము.

శ్లో॥ జ్ఞానం తేఽహం సవిజ్ఞానమిదం వక్ష్యామ్యశేషతః।
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్యమవశిష్యతే ॥ 2

నేను నీకు అనుభవముతో గూడిన బ్రహ్మతత్వమును సంపూర్ణముగా చెప్పెదను దానిని గ్రహించిన యీ శ్రేయోమార్గమున, యిక తెలిసికొనదగిన దేదియు మిగులదు.

శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥ 3

మనుష్యులలో వేయింటికి యే ఒకడో ఆత్మజ్ఞానమును బొంద ప్రయత్నించును. యిట్లు ప్రయత్నించు ముముక్షువులలో నెవడో ఒకడు మాత్రమే అరుదుగా నన్ను యథార్థముగ తెలిసికొనగలుగుచున్నాడు.

శ్లో॥ భూమిరాపోనలో వాయుః ఖం మనోబుద్ధిరేవచ ।
అహఙ్కార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా ॥ 4

పృథివి, నీరు, అగ్ని, గాలి, ఆకాశము సంకల్ప వికల్పాత్మకమగు మనస్సు, నిశ్చయాత్మకమగు బుద్ధి, నేను నేను అను అహంకారము, అని ఈ నామాయాశక్తి యెనిమిది విధములుగా విభజింప బడినది.

శ్లో॥ అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరమ్ ।
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥ 5

అర్జునా! అష్టవిధమగు ఈ ప్రకృతి అపరము అనగా వికారమని గ్రహింపుము దీనికంటె వేరుగా నా పరాప్రకృతి జీవస్వరూపమున వెలయుచున్నది. ఈ జీవభూతమగు ప్రకృతియే జగత్తును ధరించుచున్నది.

శ్లో॥ ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా ॥ 6

నా యొక్క ఈ ఉభయ విధ ప్రకృతుల నుండి క్షేత్ర క్షేత్రజ్ఞ రూపమగు సర్వము జనించుచున్నదని గ్రహింపుము. నేను ప్రకృతితో గూడియున్న సమస్త జగత్తుయొక్క సృష్టి ప్రళయములకు కారణభూతుడను.

శ్లో॥ మత్తః పరతరం నాన్యత్కించి దస్తి ధనంజయ ।
మయి సర్వమిదం ప్రోతంసూత్రే మణిగణా ఇవ ॥ 7

అర్జునా! నాకంటె శ్రేష్ఠతరమగు కారణము వేరొకటి యేదియును లేదు. దారమున గుచ్చబడిన పెక్కు మణులవలె ఈ జగత్తు నా యందు ఆశ్రయించుకొనియున్నది

శ్లో॥ రసో౽హ మప్సు కౌన్తేయ! ప్రభాస్మి శశిసూర్యయోః ।
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥ 8

కుంతీపుత్రా నేను నీటియందు రసతన్మాత్రను. చంద్రసూర్యులలో ప్రకాశమును. నాల్గు వేదములలో ఓంకారమును. ఆకాశములో శబ్దతన్మాత్రను. మనుష్యులలో పురుషకారమునై యున్నాను.

శ్లో॥ పుణ్యోగన్ధః పృధివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ ।
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు ॥ 9

నేను పృధివియందలి సుగంధమును అగ్నియందలి దీప్తిని జీవరాశులలో ప్రాణమును. తపోనిష్ఠయందు శీతోష్ణాది ద్వంద్వసహన సామార్థ్యమును అయియున్నాను.

పంచభూతములలో గుణరూపంగానున్న పంచతన్మాత్రలు స్వాభావికముగ పవిత్రమైయుండును. ప్రాణులు అధర్మపద్ధతుల నపేక్షించి అపవిత్రత పొందుచున్నవి. గనుక నా నిర్ణయ పద్ధతి తెలిసిన వారు విషయంబులచే అపవిత్రత నొందక తన్మాత్రలు నేనేయని నిర్ణయించి ప్రవర్తించవలయునని భగవానుని నిర్ణయము.

శ్లో॥ బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్ ।
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్ ॥ 10

అర్జునా నన్ను స్థావర జంగమములగు సకల భూతములకు సనాతనమగు కారణముగ దెలిసికొనుము. వివేకులగు వారి వివేక బుద్ధిని నేను మరియు తేజోవంతులగువారి తేజస్సును గూడ నేనే అయియున్నాడను.

శ్లో॥ బలం బలవతాం మస్మి కామరాగ వివర్జితమ్ ।
ధర్మావిరుద్ధో భూతేషు కామో౽స్మి భరతర్షభ! ॥ 11

భరతశ్రేష్ఠా! బలవంతులగు వారియందుండు కామ, రాగ

విసర్జితమగు స్వధర్మానుష్ఠాన సామర్థ్యమును నేనే అయియున్నాడను మరియు జీవులలో నుండు శాస్త్ర విరుద్ధముకాని కామమును నేనే.

శ్లో॥ యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చయే ।
మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి ॥ 12

సాత్త్వికములగు పదార్థములును రాజసికమగు పదార్థములును తామసిక పదార్థములును భావములును యేవేవికలవో అవన్నియు నా నుండియే కలిగినవని తెలిసికొనుము. కాని నేను వాని యధీనుడనుకాను. అవి-యన్నియు నా యధీనములు.

శ్లో॥ త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వమిదం జగత్ ।
మోహితంనాభిజా నాతిమామేభ్యః పరమవ్యయం ॥ 13

త్రిగుణ జాతములగు ఈ రాగద్వేష మోహాదులవలన భ్రాంతి నంది ప్రాణి సమూహము, ఈ గుణ జాతకములగు భావములకంటె విలక్షణమగు, సర్వవికారవర్జితమగు నన్ను తెలిసికొనజాలకున్నది.

శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా ।
మామేవయే ప్రపద్యంతే మాయా మేతాంతరన్తి తే ॥ 14

త్రిగుణాత్మకమగు నామాయ, అలౌకికము. అనగా దైవికపద్ధతి గనుక దానినతిక్రమించుట అత్యంత కష్టము. కాని యెవరు యితర సాధనలతో తృప్తి జెందక నన్నే ఆశ్రయించుచున్నారో వారే దుస్తరమగు ఈమాయ నతిక్రమించి నన్ను దెలిసికొని ముక్తులగుచున్నారు.

శ్లో॥ న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః ।
మాయయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః ॥ 15

దుష్కర్ములును అజ్ఞులును నీచులును అగువారి వివేకము మాయవలన కప్పబడిపోయినందునవారు అసుర స్వభావమును పొంది నన్ను భజింపకున్నారు.

శ్లో॥ చతుర్విధా భజన్తే మాం జనా స్సుకృతినోఽర్జున,
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ. 16

భరతశ్రేష్ఠా! అర్జునా! విపన్నుడు తత్వ జిజ్ఞాసువు అర్థకామి తత్వజ్ఞాని అను నాలుగుతెరగతుల పుణ్యజనులు నన్ను భజించుచున్నారు.

శ్లో॥ తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే,
ప్రియోహి జ్ఞానినోఽత్యర్థ మహం సచ మమప్రియః 17

ఈ నలువురిలో సర్వదా నా యందు సమాహితుడగువాడు ఏకనిష్ఠుడునగు తత్వజ్ఞాని శ్రేష్ఠుడు యేలయనగా నేను జ్ఞానికి అత్యంతము ప్రియుడను అతడు కూడా నాకు అత్యంతమూ ప్రియుడు.

శ్లో॥ ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్.
ఆస్థిత స్సహి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్ 18

వీరందరును గూడ గొప్పవారు. నాకు ప్రియులును గూడ. యే భక్తుడును నాకప్రియుడుకాడు. కాని జ్ఞాని నాకత్యంతము ప్రియుడు యేమన జ్ఞాని నా ఆత్మ స్వరూపుడు. ఇది నా నిశ్చితాభిప్రాయము. ఆత్మ సమాహితుడగు ఈ జ్ఞాని నన్నే పరమగతిగ ఆశ్రయించుకొని యుండును.

శ్లో॥ బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే,
వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః. 19

బహు జన్మముల సాధనా ఫలముగ తుది జన్మమందు తత్వజ్ఞానియై ఈ జగత్తు వాసుదేవుడేయని గ్రహించి నన్ను భజించును గనుక అట్టి మహాపురుషుడు అత్యంతము దుర్లభుడు.

శ్లో కామై స్తైస్తై ర్హృతజ్ఞానాః ప్రపద్యన్తేఽన్య దేవతాః,
తంతం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతా స్స్వయా. 20

పుత్రపశు స్వర్గాది వాంఛల వలన నష్ట వివేకులగువారు ఆయా

కోరికలకు తగిన జప వ్రతవాసాది నియమములను ఆచరించి తమ స్వభావమునకు వశీభూతులై యితర దేవతలను సేవించుచున్నారు.

శ్లో॥ యో యో యాంయాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి
తస్యతస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్. 21

ఏయే భక్తులు ఏయే దేవమూర్తులను శ్రద్ధతో అర్చింపబూనుదురో నేను ఆయా భక్తులకు ఆయా దేవతారూపములయందు దృఢమగు భక్తిని కలుగజేయుచున్నాడను.

శ్లో॥ సతయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే,
లభతేచ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్. 22

అభక్తుడు అట్టి శ్రద్ధాయుక్తుడై ఆ దేవతారాధనము నొనర్చును ఆ దేవతనుండి ఆయా కోరికలు ఫలించును కాని అవి నేను యేర్పాటు చేసినవేయని తెలుసుకొనము.

శ్లో॥ అన్తవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్పమేధసామ్,
దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి. 23

అల్ప బుద్ధులగు నా వ్యక్తుల ఆరాధనా లబ్ధమగు ఆ ఫలములశాశ్వతము. దేవతో పాసకులు దేవతలనే పొందుచున్నారు. మరి నా భక్తులో అనాద్యనంతరమును పరమానందమగు నన్ను బొందుచున్నారు.

శ్లో॥ అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యన్తే మామబుద్ధయః,
పరంభావ మజానన్తో మమావ్యయ మనుత్తమమ్. 24

అల్పబుద్ధులగువారు నిత్యమును సర్వోత్తమమును అగు నా స్వరూపమును గ్రహింపక ప్రపంచాతీతుడను అగు నన్ను దేహ విశిష్టునిగా భావించుచున్నారు.

శ్లో॥ నాహంప్రకాశ స్సర్వస్య యోగమాయాసమావృతః,
మూఢోఽయం నాభిజానాతి లోకా మామజ మవ్యయమ్. 25

త్రిగుణాత్మయగు మాయవలన ఆవరింపబడియుండుటచే అంద రును గోచరింపకున్నాను. కనుక మోహావృతమగు ఈ జగత్తు జన్మమృత్యు రహితమగు నా అవ్యయ స్వరూపమును గ్రహింపజాల కున్నది.

శ్లో॥ వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున,
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన. 26

పార్థా నేను భూత భవిష్యద్వర్తమాన భూతముల నన్నిటిని యెరుగుదును కాని నన్ను యెవ్వరును యెఱగజాలరు

శ్లో॥ ఇచ్ఛా ద్వేషసముత్థేన ద్వన్ద్వమోహేన భారత,
సర్వభూతాని సమ్మోహం సర్గే యాన్తి పరంతప. 27

అర్జునా జన్మముతోడనే ఇష్టా నిష్టముల వలన కలుగు సుఖ దుఃఖ నిమిత్తమగు బుద్ధి భ్రాంశమున ప్రాణులందరును మోహమును పొందుచున్నారు.

శ్లో॥ యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్,
తే ద్వన్ద్వ మోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః. 28

కాని యే పుణ్యశీలురగు జనుల పాపము సమాప్తమైనదో వారు ద్వంద్వ మోహములనుండి విడిబడి దృఢ నిష్ఠతో నన్ను భజించు చున్నారు.

శ్లో॥ జరామరణమోక్షాయ మామాశ్రిత్య యతన్తి యే,
తేబ్రహ్మ తద్విదుః కృత్స్నమధ్యాత్మం కర్మచాఖిలమ్. 29

జరామరణములనుండి ముక్తులు కాగోరి యెవరు నన్నాశ్రయించి సాధన యొనర్చుచున్నారో వారు పరబ్రహ్మమును ఆత్మను కర్మముల నన్నిటిని గ్రహింపగలుగుచున్నారు.

శ్లో॥ సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యేవిదుః,
ప్రయాణకాలేపిచ మాం తే విదు ర్యుక్త చేతసః. 30

అధిభూత, అధిదైవ, అధియజ్ఞములతో గూడినన్న యెవ్వారెరుంగుదురో అసమాహిత చిత్తులగు వ్యక్తులు మృత్యుకాలమునగూడ నన్ను యెఱుగగలరు. అనగా కృష్ణ నిర్ణయ భక్తియే యత్నముతో చేసినను బ్రహ్మ జ్ఞానము లభింపజేయునని నిర్ణయము.

సప్తమాధ్యాయ సమాప్తము.





# అపూర్వయోగము అనే శ్రీ మద్భగవద్గీత

## రాజయోగీయము

### అష్టమాధ్యాయము

### అక్షర పరబ్రహ్మయోగము

అర్జున ఉవాచ :

శ్లో॥ కిం తద్బ్రహ్మ? కిమధ్యాత్మం? కిం కర్మ? పురుషోత్తమ!
అధిభూతం చ కిం ప్రోక్త మధిదైవం కిముచ్యతే? 1

పురుషోత్తమా బ్రహ్మమన యేది. అధ్యాత్మమననేమి? కర్మ స్వరూపమెట్టిది? అధి భూతమని దేని నందురు? ఏది అధి దైవమని చెప్పబడును. 5 ప్రశ్నలు.

శ్లో॥ అధియజ్ఞః కథం కోఽత్ర? దేహేఽస్మిన్మధుసూదన!
ప్రయాణకాలేచ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః 2

మధుసూదనా! ఈ శరీరమున అధిష్టించి సమస్త కర్మలను నియమించుచు ఫలముల నొసగు వాడెవడు? అతడెట్లు యీ శరీరమున వెలయుచున్నాడు? మృత్యు సమయమున నియతచిత్తులగు వ్యక్తులు యే ప్రాయమున నిన్ను తెలుసుకోగలుగుచున్నారు? (మూడు ప్రశ్నలు)

భగవాన్ ఉవాచ :

శ్లో॥ అక్షరం బ్రహ్మపరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే,
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః. 3

వినాశము లేనిది మూలకారణమగునదియే పరమగు బ్రహ్మము అది ప్రతి దేహమున ప్రత్యగాత్మ పద్ధతి బొందుటయే అధ్యాత్మమని చెప్పబడుచున్నది. జీవుల సృష్టి స్థితులకు కారణమగు విసర్జనము కర్మ మని చెప్పబడుచున్నది.

శ్లో॥ అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతమ్,
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాంవర! 4

నరశ్రేష్ఠుడవగు అర్జునా! నశించునవియగు దేహాదులగు పదార్థములే అధిభూతమని చెప్పబడుచున్నవి. పురుషుడు అనగా హిరణ్యగర్భుడు అదిదైవతము మరియు యీ శరీరమున నేనే విష్ణువనంబడు యజ్ఞాధిష్ఠాన దేవతను. యజ్ఞప్రవర్తకుడను. యజ్ఞఫలదాతను.

శ్లో॥ అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్,
యః ప్రయాతి సమద్భావం యాతి నాస్త్యత్ర సంశయః. 5

మృత్యుసమయమున నన్నే స్మరించుచు శరీరమును త్యజించి యెవడు ప్రయాణ మొనర్చునో అతడు నా స్వరూపమును పొందును యీ విషయమున యేలాటి సందేహము లేదు.

శ్లో॥ యం యం వాఽపి స్మరన్భావం త్యజత్యన్తే కలేబరమ్,
తం తమేవైతి కౌన్తేయ! సదా తద్భావభావితః 6

మరణ సమయమున యెవడెవడు యేయే దేవతా భావమును చింతించుచు శరీరమును విడుచుచున్నాడో అతడా దేవతా భావమునే పొందుచున్నాడు.

శ్లో॥ తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ,
మయ్యర్పితమనోబుద్ధి ర్మామేవైష్యస్యసంశయః. 7

కనుక అన్ని వేళలయందు నన్ను స్మరించుము. యుద్ధము నొనర్పుము. నా యందున మనోబుద్ధుల నర్పించిన నిస్సందేహముగా నన్నే పొందుదువు.

శ్లో॥ అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా,
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచిన్తయన్. 8

అర్జునా! అభ్యాసమను వుపాయముతో కూడినదియును. ఇతర విషయముల దెరకు బోనిదియును అగు చిత్తముతో స్మరించుచున్న వుత్తముడు, జోతిర్మయుడగు పరమేశ్వరుని పొందును.

శ్లో॥ కవిం పురాణమనుశాసితారం మణోరణీయాంసమనుస్మరేద్యః
సర్వస్య ధాతారమచిన్త్యరూపమాదిత్యవర్ణంతమసఃపరస్తాత్ .9

శ్లో॥ ప్రయాణకాలే మనసాఽచలేన భక్త్యాయుక్తోయోగబలేనచైవ
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సతం పరంపురుషము
పైతిదివ్యమ్. 10

మృత్యు సమయమున భక్తియుక్తుడై యేకాగ్ర చిత్తమున భూమధ్యముననే ప్రాణమును సంపూర్ణముగా నిల్పి, సర్వజ్ఞుడును అనాదియును సూక్ష్మమగు దాని కంటెను. సూక్ష్మమగువాడును. అచింత్యస్వరూపుడును, సూర్యునివలే స్వప్రకాశించువాడును. మోహాంధకారమునకు ఆవలనుండువాడునగు పురుషుని స్మరించునో అతడు జోతిర్మయుడగు పురుషుని పొందును.

శ్లో॥ యదక్షరం వేదవిదో వదన్తి విశన్తి యద్యతయో వీతరాగాః,
యదిచ్ఛన్తోబ్రహ్మచర్యంచరన్తి తత్తేపదంసంగ్రహేణప్రవక్ష్యే11

వేదజ్ఞులు దేనిని అవినాశియగు పురుషుడని చెప్పుచున్నారో నిస్పృహులగు యతులు దేనియందు ప్రవేశించుచున్నారో దేనిని తెలిసికొనగోరి గురుకులవాసము పాలించుచున్నారో ఆబ్రహ్మ పదమును నీకు సంక్షేపముగా చెప్పెదను.

శ్లో॥ సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ,
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్ 12

శ్లో॥ ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్,
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్. 13

యింద్రియములనన్నిటిని యేక మొనర్చి మనస్సును హృదయ పుండరీకమున నిలిపి ప్రాణమును, సహస్రారమున నిలిపి ఆత్మయోగమున వెలయుచు ఓం అను యేకాక్షర బ్రహ్మమును వుచ్చరించుచు నన్ను స్మరించుచు శరీరమును వీడి యెవ్వడు ప్రయాణ మొనర్చు చున్నాడో అతడు ఉత్తమమగు గతిని పొందుచున్నాడు.

శ్లో॥ అనన్యచేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః,
తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః

యెవడు అనన్య చిత్తుడై నన్నుయావజ్జీవము నిరంతరము స్మరించుచుండునో సదా సమాహిత చిత్తుడగు యోగికి నేను సహజముగనే లభించగలను.

శ్లో॥ మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్,
నాప్నువన్తి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః. 15

సర్వోత్తమమగు సిద్ధిని పొందిన మహాత్ములు నన్ను చేరి అనిత్యము దుఃఖ పద్ధతియగు పునర్జన్మము పొందరు.

శ్లో॥ ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున!
మాముపేత్య తు కౌన్తేయ! పునర్జన్మ న విద్యతే. 16

అర్జునా భూలోక మాదిగా బ్రహ్మ లోకమువరకుగల లోకము లన్నియును పునరావృత్తితో గూడుకొనినవి కాని అర్జునా నన్ను బొందినవారికి మరి జన్మము కలుగదు.

శ్లో॥ సహస్రయుగపర్యన్త మహర్యద్బ్రహ్మణో విదుః,
రాత్రిం యుగసహస్రాన్తాం తేఽహోరాత్రవిదో జనాః 17

వెయ్యి యుగముల నిర్ణయ పద్ధతిగల బ్రహ్మ యొక్క దినమును అట్టి నిర్ణయ పద్ధతిగల రాత్రిని యెవరు తెలియుచున్నారో ఆయోగులు దివారాత్రము యొక్క తత్వము నెరిగినవారని నిర్ణయము.

శ్లో॥ అవ్యక్తా ద్వ్యక్తయః సర్వాః ప్రభవన్త్యహరాగమే,
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవాఽవ్యక్తసంజ్ఞకే. 18

బ్రహ్మయొక్క పగలు అయినతోడనే చరాచరములగు వస్తువులన్నియు అవ్యక్తమునుండి జన్మించుచున్నవి. బ్రహ్మ యొక్క రాత్రి అయినతోడనే అవ్యక్తమగు దానియందే విలీనమగుచున్నవి.

శ్లో॥ భూతగ్రామ స్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే,
రాత్ర్యాగమేఽవశః పార్థ! ప్రభవ త్యహరాగమే. 19

అర్జునా! పూర్వముండిన ప్రాణసమూహమే మరల మరల పుట్టి బ్రహ్మయొక్క రాత్రి అయినప్పుడు లయమందుచున్నవి. బ్రహ్మము యొక్క పగలు అయిన తమ తమ కర్మముల కధీనమై పుట్టుచున్నవి.

శ్లో॥ పరస్తస్మాత్తు భావోఽన్యో వ్యక్తోఽవ్యక్తాత్సనాతనః,
యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి. 20

కాని ఆప్రజాపతి నిద్రారూపమునగు అవ్యక్తముకంటె వేరగు మరియొక యింద్రియాగోచరమును అనాదియునగు యే బ్రహ్మము కలదో అయ్యది సమస్త భూతములు నశించినను అది వినాశము బొందదు.

శ్లో॥ అవ్యక్తోఽక్షరఇత్యుక్తస్తమాహుఃపరమాంగతిమ్,
యంప్రాప్య ననివర్తన్తే తద్ధామ పరమం మమ. 21

యింద్రియాగోచరమునువినాశరహితమునుఅని యేదినిశాస్త్రము వర్ణించుచున్నదో. దానినే శ్రేష్ఠమగు గతియని అందురు. యే అక్షరమును పొందిన తిరిగివచ్చుచుండుటలేదో అయ్యది నా శ్రేష్ఠమగు పదము.

శ్లో॥ పురుష స్సపరః పార్థ! భక్త్యా లభ్య స్త్వనన్యయా,
యస్యా న్తస్థాని భూతాని యేన సర్వమిదంతతమ్. 22

అర్జునా! జీవులందరును యెవనిమధ్య వెలయుచున్నవో యెవని వలన యీ జగత్తు అంతయును వ్యాప్తమైయున్నదో ఆ పరుడైన పురుషుని యేకాంతమగు భక్తివలన పొందవగును.

శ్లో॥ యత్రకాలేత్వనావృత్తి మావృత్తించైవ యోగినః,
ప్రయాతా యాన్తితం కాలం వక్ష్యామి భరతర్షభ. 23

భరతర్షభా! యేకాలమున మృతులైన వుపాసకులును. కర్మిష్ఠులును యథాక్రమముగా మోక్షమును పునర్జన్మమును బొందెదరో ఆ కాలమును గురించి చెప్పెదను.

శ్లో॥ అగ్నిర్జ్యోతి రహశ్శుక్ల షణ్మాసా ఉత్తరాయణమ్,
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః. 24

అగ్నిజ్యోతి దినము, శుక్లపక్షము, షణ్మాసయుక్తమగు వుత్తరాయణము, అనునవిగల దేవయానమార్గమున ప్రయాణ మొనర్చిన పరమేశ్వరోపాసకులు బ్రహ్మమును బొందుచున్నారు.

శ్లో॥ ధూమో రాత్రి స్తథాకృష్ణ షణ్మాసాదక్షిణాయనమ్,
తత్ర చాన్ద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే. 25

ధూమము రాత్రి కృష్ణపక్షము ఆరు మాసములుగల దక్షిణాయణము అనువానితో గూడిన పితృయాన మార్గమున జనిన కర్మపరుడు చంద్రలోకమునకు బోయి జన్మాదులకు తిర్గివచ్చుచున్నాడు.

శ్లో॥ శుక్లకృష్ణేగతి హ్యేతే జగత శ్శాశ్వతే మతే,
ఏకయా యాత్యనావృత్తి మన్యయా వర్తతే పునః 26

జగత్తున శుక్లగతియును కృష్ణగతియును రెండు మార్గంబులు శాశ్వతములని గ్రహింపుము. దేవయాన మార్గమున అరిగినవారు క్రమముక్తినందుచున్నారు. పితృయాన మార్గమున చనినవాడు తిరిగి వచ్చి నరల జన్మించుచున్నాడు.

శ్లో॥ నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన,
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున. 27

అర్జునా యీ రెండు మార్గములను యెరిగిన యే వొక్కవుపాసకుడుగాని, లేక కర్మపరుడుగాని మోహాగ్రస్తుడుకాడు అనగా అనిత్యములును వుపాసనార్జితములగు కర్మలదెసకుపోడు. పరమేశ్వర నిష్ఠుడగును. కనుక అర్జునా! నీవు సర్వదా సమాహిత చిత్తుడవుకమ్ము.

శ్లో॥ వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలంప్రదిష్టమ్,
అత్యేతి తత్సర్వ మిదం విదిత్వా
యోగీ పరంస్థాన ముపైతి చాద్యమ్. 28

వేదాధ్యయనము వలన యజ్ఞాది కర్మానుష్ఠానమున శరీరశోషణాదులవలన, సత్పాత్ర దానాదులవలన. యే పుణ్యఫలము శాస్త్రములందు చెప్పబడినవో సమాహిత చిత్తుడగు వ్యక్తి ఆ సర్వమును అతిక్రమించును. మరియు జగన్మూల భూతమును శ్రేషమును అగు పదమును పొందును.

అష్టమోధ్యాయము సమాప్తము



# అపూర్వయోగము అనే
# శ్రీ మద్భగవద్గీత

## రాజయోగీయము

### నవమోధ్యాయము

### రాజవిద్యా రాజగుహ్యయోగము

శ్లో॥ ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే,
జ్ఞానం విజ్ఞానసహితం యద్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. 1

శ్రీ కృష్ణుడు పల్కెను. దేనిని తెలిసికొనిన సంసారబంధము నుండి విడువడగలవో అట్టి ఈ అత్యంత రహస్యమును అనుభవయుక్తమును అగు బ్రహ్మ జ్ఞానమును, దోషదృష్టిలేని నీకు వుపదేశించుచున్నాను.

శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్,
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్. 2

ఈ బ్రహ్మ విద్యలన్నింటిలో శ్రేష్ఠమైనది, అతిగుహ్యము, అనధికారికి అగమ్యము, శ్రేష్టమైనది, విశుద్ధకరము, సాక్షాత్తుగా ఫలము నొసగునది, ధర్మసంగతము, అనుష్ఠింప మిక్కిలి తేలికయు మరియు అక్షయ ఫలప్రదమును అయియున్నది.

శ్లో॥ అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప,
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని. 3

అర్జునా! ఈ బ్రహ్మజ్ఞానమను ధర్మముయొక్క స్వరూపఫలముయెడ శ్రద్ధా హీనులగు పురుషులు నన్ను పొందక మృత్యుమయమగు సంసార పథమున పరిభ్రమించుచున్నారు.

శ్లో॥ మయా తత మిదం సర్వం జగదవ్యక్తమూర్తినా,
మత్స్థాని సర్వభూతాని నచాహం తే ష్వవస్థితః. 4

అతీంద్రియ స్వరూపుడను కారణ భూతుడను అగు నాచే ఈ విశ్వమంతయు వ్యాప్తమైయున్నది. పంచభూతములు నాయందు వున్నవి నేను వానియందు వుండుటలేదు.

శ్లో॥ నచమత్ స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరమ్,
భూతభృన్నచ భూతస్థో మమాత్మా భూతభావనః. 5

నా యోగైశ్వర్యమును చూడుము. భూతములు నాయందుండుటలేదు. నా స్వరూపము భూతములను ధరించునదియును పాలించునదియును అయినను నేను భూతములయందు లేను.

శ్లో॥ యథాకాశస్థితో నిత్యం వాయు స్సర్వత్రగో మహాన్,
తథాసర్వాణి భూతాని మత్ స్థానీ త్యుపధారయ. 6

యెట్లు అంతటను దిరుగు గొప్పదగు వాయువు సదా ఆకాశమున వెలయుచున్నదో అట్లే సకల భూతములును నాయందు వెలయుచున్నవి అని గ్రహింపుము.

శ్లో॥ సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్,
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజా మ్యహమ్. 7

కుంతీపుత్రా! ప్రళయకాలమున సర్వభూతములును నాత్రిగుణాత్మకమగు మాయయందు లీనమగుచున్నవి.మరల కల్పారంభమున నేను వానిని సృష్టించుచున్నాడను.

శ్లో॥ ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునఃపునః,
భూతగ్రామ మిమంకృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్. 8

నా అవిద్యా రూపమగు ప్రకృతిని వశమొనర్చుకొని పూర్వ సంస్కారానుసారము ఈసమస్తమును జనన మరణముల కధీనమునగు భూతసమూహమును మరలమరల సృష్టించుచున్నాను.

శ్లో॥ నచ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనంజయ!
ఉదాసీనవ దాసీన మసక్తం తేషు కర్మసు. 9

అర్జునా ఆ కర్మములయందు నాకాసక్తి లేదు. తటస్థునివలె వెలయునన్ను అవి బంధింపజాలవు.

శ్లో॥ మయాధ్యక్షేణ ప్రకృతి సూయతే సచరాచరమ్.
హేతునానేన కౌన్తేయ! జగద్విపరివర్తతే. 10

కుంతీపుత్రా! నా అధిష్ఠానమున త్రిగుణాత్మకమగు మాయ స్థావర జంగమాత్మకమగు జగత్తును సృష్టించుచున్నది. ఈ కారణమున వ్యక్తావ్యక్తమగు విశ్వము వివిధ రూపముల పరివర్తనము నందుచున్నది.

శ్లో॥ అవజానన్తి మాంమూఢా మానుషీంతను మాశ్రితమ్,
పరంభావ మజానన్తో మమ భూతమహేశ్వరమ్. 11

సర్వభూతేశ్వరుడనగు నా పరమ తత్త్వమును తెలియక మూఢులు మానవ దేహమును ధరించిననన్ను అవజ్ఞనొనర్చుచున్నారు.

శ్లో॥ మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః.
రాక్షసీ మాసురీంచైవ ప్రకృతిం మోహినీం శ్రితాః 12

వ్యర్థకాములును విఫలకర్ములును నిష్ఫలజ్ఞానులును, వివేకశూన్యులును అగు వ్యక్తులు దేహాత్మబుద్ధిని కలిగించు తామసరాజసస్వభావముగల రాక్షసులు అసురులు నన్ను అవమానించుచున్నారు.

శ్లో॥ మహాత్మానస్తు మాం పార్థ! దైవీం ప్రకృతి మాశ్రితాః.
భజన్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్ 13

కాని పార్థా దైవీస్వభావమును ఆశ్రయించిన మహాత్ములు అనన్యమనస్కులగుచు నన్ను జగత్కారణముగను, నిత్యునిగను తెలిసి భజించుచున్నారు.

శ్లో॥ సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః,
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే, 14

వారు సదా నన్ను కీర్తించుచు యేక నిష్ఠులై ప్రయత్నశీలురై పరమ ప్రీతిపూర్వకముగ నమస్కరించుచు సర్వదా సమాహితచిత్తులై నన్ను వుపాసించుచున్నారు.

శ్లో॥ జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మా ముపాసతే,
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతో ముఖమ్. 15

యితరులు కొందరు భగవత్ విషయకమగు జ్ఞానము అను యజ్ఞమువలన పూజించుచు నన్ను వుపాసించుచున్నారు. బ్రహ్మైకత్వ రూపమగు పరమార్థ దర్శనము వలనను భగవంతుడగు విష్ణువే చంద్రాదిత్యాది రూపముల వేరువేరుగా వెలయుచున్నాడు అని గ్రహించియును విశ్వరూపుడనగు నన్ను రుద్రాదిత్యాది నామములచే బహు విధముల వుపాసించుచున్నారు.

శ్లో॥ అహం క్రతు రహం యజ్ఞ స్స్వధాహ మహ మౌషధమ్,
మన్త్రోహ మహమే వాజ్య మహ మగ్ని రహం హుతమ్. 16

శ్రౌతయజ్ఞము, స్మార్తయజ్ఞము, శ్రాద్ధకర్మ, ఔషధము, హోమఘృతము, హోమాగ్ని, హవనక్రియ ఇవన్నియుగూడ నేనే.

శ్లో॥ పితాహ మస్య జగతో మాతాధాతా పితామహః,
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామయజు రేవచ. 17

నేనే ఈ జగత్తునకు జనకుడను తల్లిని కర్మఫలదాతను తాతను జ్ఞేయమును శోధకములగు ప్రాయశ్చిత్తాదులును ప్రణవమును ఋగ్వేదమును సామవేదమును యజుర్వేదమును గూడా నేనే.

శ్లో॥ గతి ర్భర్తా ప్రభుస్సాక్షీ నివాస శ్శరణం సుహృత్,
ప్రభవః ప్రళయ స్థానం నిధానం బీజ మవ్యయమ్. 18

నేను కర్మఫలమును, పోషకుడను ప్రభువును సర్వప్రాణుల శుభాశుభముల ద్రష్టను వాసస్థానమును శరణాగతుల ఆర్తిని హరించువాడను ప్రత్యుపకారమును గోరక హితమును గూర్చువాడను. స్రష్టను సంహర్తను ఆధారమును ప్రళయస్థానమును అక్షయమగు జగత్కారణమును అయియున్నాను.

శ్లో॥ తపా మ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామిచ,
అమృతంచైవ మృత్యుశ్చ సదస చ్చాహ మర్జున. 19

సూర్యరూపమున నేను వేడినొసగుచున్నాను. జలమును ఆకర్షించుచు వర్షించుచున్నాడను. అమరుల అమృతమును మర్త్యుల మృత్యువును మరియు స్థూలసూక్ష్మములగు వస్తువులుగూడా నేనే.

శ్లో॥ త్రైవిద్యామాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే,
తేపుణ్య మాసాద్య సురేన్ద్రలోక
మశ్నన్తి దివ్యాన్ దివి దేవభోగాన్. 20

త్రివేదజ్ఞులు యజ్ఞములవలన నన్ను పూజించి యజ్ఞశేషమున సోమరసమును త్రాగి పాప విముక్తులై స్వర్గగమనమును ప్రార్థించుచున్నారు. వారు పుణ్యఫలమగు యిందరలోకమును పొంది స్వర్గలోకమున మనుష్య దేహమున బొందజాలని దేవభోగములను భోగించుచున్నారు.

శ్లో॥ తేతం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి,
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతంకామకామా లభన్తే. 21

వారు ఫలమును స్వర్గలోకమున భోగించి పుణ్యాచయమవగానే మనుష్యలోకమునకు తిరిగి వచ్చుచున్నారు. యిట్లు వేదోక్తధర్మము ననుసరించు భోగేచ్ఛాపరులు, జనన మరణ సంసారమును పొందు చున్నారు.

శ్లో॥ అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్. 22

నన్ను ఆత్మజ్ఞానమున చింతించుచు ధ్యానమొనర్చు యోక నిష్ఠులకువారి యోగమును, క్షేమమును వహించుచున్నాడను. పొంద జేయుచున్నాడను.

శ్లో॥ యేప్యన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః
తేపి మామేవ కౌన్తేయ! యజన్త్యవిధిపూర్వకమ్. 23

అర్జునా! ఆస్తిక్య బుద్ధియుక్తులై అన్యదేవతలను పూజించు వారు కూడా నన్నే పూజించుచున్నారు. కాని వారు అజ్ఞానపూర్వక ముగ భజించుచున్నారు.

శ్లో॥ అహంహి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ.
నతు మా మభిజానన్తి తత్త్వేనాఽతశ్చ్యవన్తి తే. 24

శ్రౌతస్మార్తాదులగు సర్వయజ్ఞములకు నేను దేవతాత్మారూప మున భోక్తను, ఫలదాతనుకూడా కాని అన్య దేవతాభక్తులు స్వరూపతా నన్ను యెరుగరు. అందువలన పునరావృత్తి నందు చున్నారు.

శ్లో॥ యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాన్తి పితృవ్రతాః,
భూతాని యాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజినోపి మామ్. 25

దేవోపాసకులు దేవతలను బొందుచున్నారు. పితృభక్తులు పితృగణమును జేరుచున్నారు. భూతపూజకులు భూతములను బొందు

చున్నారు. నన్ను పూజించువారు నన్నే పొందుచున్నారు. మరల జన్మించరు.

శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః 26

ఎవడు నాకుభక్తిపూర్వకముగా ఆకునో, పువ్వునో, పండునో నీటినో సమర్పించునో శుద్ధచిత్తుడగు ఆ నిష్కామ భక్తుని భక్తితో నొసగబడిన ఆ కానుకలను నేను గ్రహించుచున్నాను.

శ్లో॥ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌన్తేయ! తత్కురుష్వ మదర్పణమ్ 27

కుంతీపుత్రా! దేనిని ఆచరించుచున్నావో, దేనిని భుజించు చున్నావో, దేనిని హోమ మొనర్చుచున్నావో దేనిని దాన మొనర్చు చున్నావో, దేనిని తప మొనర్చుచున్నావో దానిని నాకు సమర్పణ చేయుము.

శ్లో॥ శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబన్ధనైః,
సన్న్యాసయోగ యుక్తాత్మా విముక్తో మాము పైష్యసి. 28

ఇట్లు ఆచరించిన ఇష్టానిష్ట ఫలవిశిష్టములగు కర్మబంధముల నుండి ముక్తుడవగుదువు. కర్తృత్వరహిత కర్మసమర్పణ యోగయుక్తుడవై జీవత్కాలముననే ముక్తినంది నన్ను బొందెదవు.

శ్లో॥ సమోహం సర్వభూతేషు న మే ద్వేష్యోస్తి న ప్రియః,
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్. 29

నేను సకలభూతముల యెడసముడను. నాకు అప్రియుడు లేడు ప్రియుడును లేడు. కాని నన్ను భక్తిపూర్వకముగ భజించుచున్నారో వారు నాయందు మరియు నేను వారియందు వుందును.

శ్లో॥ అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్,
సాధురేవ సమన్తవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః. 30

అత్యంత దురాచారుడగు వాడుకూడ అనన్యచిత్తుడై నన్ను భజించునెడల అతనిని సాధువనియే యెన్నదగును. యేమన అతని సంకల్పము మిక్కిలి యుత్తమమైనది. అతడు భగవద్భజన వలన కృతార్థుడనగుదునని నిశ్చయించుకొనినాడు.

శ్లో॥ క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి,
కౌన్తేయ! ప్రతి జానీహి న మే భక్తః ప్రణశ్యతి. 31

ఆ దురాచారి నన్ను భజించుచు శీఘ్రముగా ధర్మచిత్తుండగు చున్నాడు. పిదప నిత్యశాంతిని పొందుచున్నాడు. కౌంతేయా, నా భక్తుడెన్నడు వినష్టుడు కాడు. కృతార్థుడే యగును. నిశ్చయముగ గ్రహించి ప్రతిజ్ఞపూర్వకముగ నుడువుము.

శ్లో॥ మాంహి పార్థ! వ్యపాశ్రిత్య యేపి స్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేపి యాన్తి పరాంగతిమ్ 32

పార్థా! నికృష్ట జన్ములగు అంత్యజులును కృష్యాది నిరతులగు వైశ్యులును, అన్యాయ నిరతులగు స్త్రీ శూద్రులును గూడ నన్ను సేవించి మోక్షమను తప్పక పొందుచున్నారు.

శ్లో॥ కింపునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా,
అనిత్య మసుఖం లోక మిమంప్రాప్య భజస్వ మామ్ 33

సత్కులోద్భవులగు బ్రాహ్మణులను గురించియు మరియు భక్తులగు రాజర్షులను గురించియు యేమి చెప్పనగును. అనగా వారు నన్నాశ్రయించిన తప్పక మోక్షమును బొందుచున్నారు. కనుక నీవు అనిత్య

మును సుఖరహితమును అగు మనుష్యశరీరమును పొంది నన్ను భజించుము.

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు,
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః. 34

మనస్సును నాయందు నిల్పుము. నా భక్తుడవు కమ్ము. నన్నుం పూజింపుము. నాకు నమస్కార మొనర్పుము. ఇట్లు నాశరణాగతుడవై మనస్సును నాయందు నిల్పిన నన్నే పొందెదవు.

నవమోధ్యాయః సమాప్తః.

# అస్పర్శయోగము అనే

# శ్రీమద్భగవద్గీత

## రాజయోగీయము

### దశమాధ్యాయము

### విభూతి యోగము

శ్రీ భగవానువాచ

శ్లో॥ భూయ ఏవ మహాబాహో! శృణు మే పరమం వచః,
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా. ౧

శ్రీ భగవానుడు పలికెను. అర్జునా, నీవు నా వాక్యములను సంతోషపూర్వకముగా విని ఆనందించుచున్నావు కనుక నేను నీ హితమును గోరి మతిపరిమేయము లేని తత్వనిర్ణయము జెప్పుచున్నాను. శ్రద్ధగా వినుము.

శ్లో॥ న మే విదు స్సురగణాః ప్రభవం న మహర్షయః
అహ మాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః. ౨

ఇంద్రాది దేవతలును భృగ్వాది మహర్షులును గూడా నా వుత్పత్తిని యెరుగరు. యేమన దేవతలకును, మహాఋషులకును గూడ సర్వవిధముల మూలకారణం నేనె గనుక నాకృపలేకున్న నన్నెవ్వరు తెలుసుకోనజాలరు.

శ్లో॥ యో మా మజ మనాదించ వేత్తి లోక మహేశ్వరమ్,
అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే. ౩

యెవ్వడు నన్ను కారణ రహితునిగను జన్మరహితునిగను సర్వలోకేశ్వరునిగను తెలిసికొనునో అతడు మనుష్యులలో భ్రాంతిరహితుడై తెలసియో తెలియకయో చేసిన పాపములనుండి విడువబడు చున్నాడు.



శ్లో॥ బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమ శ్శమః,
సుఖందుఃఖం భవోభావో భయం చాభయ మేవచ. ౪

శ్లో॥ అహింసా సమతా తుష్టి స్తపోదానం యశోఽయశః,
భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః. ౫

సూక్ష్మ విషయగ్రహణ సామర్థ్యము ఆత్మాది పదార్థముల జ్ఞానము, వ్యాకులత్వాభావము సహిష్ణుత, వినినదివినినట్లుగను, చూచునది చూచునట్లుగను వచించుట యథార్థభాషణము, బాహ్యేంద్రియ సంయమము అంతరేంద్రియ సంయమము ఆహ్లాదము, సంతాపము. వుత్పత్తి. వినాశము మరియు భీతియును. భయరహితమును, ప్రాణికి పీడ నొనర్పకుండుట సమచిత్తత, సంతోషము మనోవాక్కాయ సంయమము, దానము, ధర్మనిమిత్తమగుకీర్తి. అధర్మనిమిత్తమగు అపకీర్తి మున్నగునవి ప్రాణులకు స్వకర్మానుసారము విభిన్నములగు భావములు నానుండియే వుత్పన్నమగుచున్నవి.

శ్లో॥ మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవస్తథా,
మద్భావా మానసాజాతా యేషాం లోకా ఇమాః ప్రజాః ౬

భృగువు మున్నగు సప్తర్షులును వారికంటెను పూర్వపు వారగు సనకుడు మొదలగు నల్వురు ఋషులును. స్వాయంభువాదులగు చతుర్దశ మనువులు నా సంకల్పము నుండియే కలిగినారు. వారు నా మానస పుత్రులు మద్గత చిత్తులగుటచేత నాప్రభావముతో నొప్పుచున్నారు. వీరినుండియే ఈ జగత్తునందలి స్థావరజంగ మాత్మకమగు సంతతి కలిగినది.

1) భృగు, మరీచి, అత్రి, పులహ, ఆంగిర. క్రతు, పులస్త్యులు లేక మరీచి, అంగిర, అత్రి, పులస్త్య, పులహ, క్రతు, వశిష్టులు



2) సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులు

3) స్వాయంభువ స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, చాక్షుష వైవస్వత, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, రుద్ర సావర్ణి, దేవసావర్ణి, ఇంద్రసావర్ణులు.

శ్లో॥ ఏతాం విభూతిం యోగంచ మమ యోవేత్తి తత్త్వతః,
సోఽవికమ్పేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః.

యెవ్వరు నా ఈ విభూతిని యోగమును యథార్థముగా గ్రహించునో అతడు చలనములేని సమ్యగ్ దర్శనముచేత స్థిరపడు చున్నాడు. ఈ విషయమున సందేహములేదు.

1) విభూతి అనగా వివిధరూపములుగా తెలియబడుచున్నట్టి [illegible] జీవేశ్వర సర్వాత్మకము 2) యోగమనగా [illegible] మని తెలియుట. అనగా పారిగ్రహ చరమార్థమనునది [illegible] కలిసియున్న దని భిన్నముగా లేదని తెలియుట. యీపద్ధతి తెలిసినవారు సందేహ రహితముగా స్థిరపద్ధతి కలిగివుందురు.

శ్లో॥ అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః.

నేను సమస్త జగత్తునకు వుత్పత్తి స్థానమును. నావలననే సమస్తమును కలుగుచున్నది కదలుచున్నది అని యెరిగి జ్ఞానులు భక్తియుక్తులై భజించుచున్నారు.

శ్లో॥ మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్
కథయన్తశ్చమాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ.

యెవ్వరు ప్రాణమనంబులు నాకు అర్పించి యిందిరియవృత్తులు మాని జ్ఞానబల వీర్యాది విశిష్టుడనగు నన్ను అన్యోన్యము బోధించు కొనుచు సంతోషించుచున్నారు.

శ్లో॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్,
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే ౧౦

ఎవరు నిత్య యుక్తులై ప్రీతితో అన్యవాంఛలు పరిత్యజించి నన్ను భజించుచున్నారో వారికి నేను మతప్రమేయములేని తత్వ విషయకమగు సమ్యగ్జ్ఞానమును ప్రసాదించుచున్నాడను, ఈ జ్ఞానము వల్ల నన్ను వారు పొందుచున్నారు.

శ్లో॥ తేషామేవాను కమ్పార్థ మహ మజ్ఞానజం తమః
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా. ౧౧

భక్తులగువారిని అనుగ్రహింప నేను వారిబుద్ధియందు నెలకొని సమ్యగ్దర్శన దీప్తితో నెలకొనిన వివేక దీపమువలన అవివేక జనిత మగు మోహాంధకారమును వినాశ మొనర్చుచున్నాను.

శ్లో॥ పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్,
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్. ౧౨

శ్లో॥ ఆహుస్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా,
అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే. ౧౩

అర్జునుడుపలికెను. నీవు పరబ్రహ్మమవు తుదకు పరమపదమవు. పరమపావనుడవు. నీవు సర్వవ్యాపి. సనాతనుడవు. దివ్యపురుషుడవు. ఆది దేవుడవు. ఋషులందరును దేవఋషియగు నారదుడును అసితుడును దేవలుడును వ్యాసుడును గూడ నిన్నీవిధముగనే వర్ణించుచున్నారు. నీవుకూడ నాకు అట్లే చెప్పుచున్నావు.

శ్లో॥ సర్వ మేత దృతం మన్యే యన్మాం వదసి కేశవ,
నహి తే భగవన్ వ్యక్తిం విదు ర్దేవా నదానవాః ౧౪

కేశవా, నీవు నాకు చెప్పునది సమస్తమును సత్యమనియే తలచుచున్నాను. దేవా నీ ఆవిర్భావమును దేవతలును దానవులును గూడా యెరుగరు.

శ్లో॥ స్వయమే వాత్మ నాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ,
భూతభావన! భూతేశ! దేవదేవ! జగత్పతే. ౧౫

పురుషోత్తమా, భూతోత్పాదకా, జీవనియామకా ఆదిత్యాది దేవతలను పరిపాలింపజేయువాడ. విశ్వపాలక! నీవు నీయంతట నీవే సాధనాంతర వ్యతీతముగా ఆత్మస్వరూపమున నిన్ను తెలిసికొనుచున్నాడవు.

శ్లో॥ వక్తు మర్హస్య శేషేణ దివ్యా హ్యాత్మ విభూతయః,
యాభి ర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి. ౧౬

నీ ఆవిర్భావమును దేవాదులుకూడా యెరుగరు గనుక నీవు ఏ యే విభూతులవలన యీలోకముల యందంతటను వ్యాపించి యున్నాడవో ఆయా దివ్యములగు ఆత్మవిభూతులను సంపూర్ణముగా వర్ణింప నీవే సమర్థుడవు.

శ్లో॥ కథం విద్యా మహం యోగిన్ త్వాం సదా పరిచిన్తయన్,
కేషు కేషు చ భావేషు చింత్యోఽసి భగవన్మయా ౧౭

యోగీశ్వరా నిన్నెట్లు నిరంతరము చింతించిన నేను నిన్ను యెరుగగలను? ఈశ్వరా ఏ యే వస్తువుల నిన్ను నేను ధ్యానింతును?

శ్లో విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన.
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్.

కృష్ణా నీసర్వజ్ఞత్వాదికమగు ఐశ్వర్యమును, వేరువేరుగా ధ్యేయ వస్తువులను యెక్కువగా మరల చెప్పుము. యేమన నీ వాక్యామృతమును వినెడి నాకు పరితృప్తి, చాలుననుభావము కలుగచుండుట లేదు. యింకను వినవలయుననే యున్నది.

శ్రీ భగవానువాచ

శ్లో॥ హంత తే కథయిష్యామి దివ్యాహ్యాత్మ విభూతయః,
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ! నాస్త్యంతో విస్తరస్య మే ౧౯

శ్రీ భగవానుడు పల్కెను. అర్జునా! ఆశ్లయిన అత్యంతము ముఖ్యములును దివ్యములును ధ్యానావలంబన యోగ్యములును అగు వస్తు సమూహములను నీకుజెప్పెదను. నాఅవాంతర విభూతులకు అంతములేదు. కనుక ప్రధానములగు వానిని కొన్నింటిని వర్ణింతును.

శ్లో॥ అహ మాత్మా గుడా కేశ! సర్వభూతాశయస్థితః,
అహ మాదిశ్చ మధ్యంచ భూతానా మంత ఏవచ. ౨౦

అర్జునా! నేను ప్రాణులందరి హృదయమున వెలయు ప్రత్యగాత్మను. మరియు నేనే ప్రాణుల వుత్పత్తి, స్థితి, ప్రళయ కారణమును

శ్లో॥ ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్,
మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ. ౨౧

నేను ద్వాదశాదిత్యులలో విష్ణుడను, ఆదిత్యుడను ప్రకాశ మొసగువానిలో కిరణములుగల సూర్యుడను మరుద్గణ సప్తకమున అవహానాముడనగు మరీచిని అయి యున్నాడను. నక్షత్రములకు అధిపతినగు చంద్రుడను నేనే.

శ్లో॥ వేదానాం సామవేదోఽస్మి దేవనా మస్మివాసవః,
ఇన్ద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా ౨౨

వేదములలో నేను సామమును. త్రింశత్ కోటిదేవతలలో నేను ఇంద్రుడను. యేకాదశేంద్రియములలో సంకల్ప వికల్పాత్మకమగు మనస్సును ప్రాణుల శరీరముననుండు జ్ఞానశక్తిని గూడ నేనే.

శ్లో॥ రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్,
వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణా మహమ్ ౨౩

యేకాదశ రుద్రులలో శంకరుడను. యక్షరాక్షసులలో కుబేరుడను. అష్ట వస్తువులలో అగ్నిని. శిఖరములుగల పర్వతములలో మేరువును అయి యున్నాడను.



శ్లో॥ పురోధసాంచ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్,
సేనానీ నామహం స్కంద స్సరసామస్మిసాగర: ౨౪

అర్జునా! నేను పురోహితులలో ముఖ్యుడగు బృహస్పతిని. సేనాపతులలో దేవ సేనానాయకుడనగు కుమారుడను. జలాశయములలో సముద్రుడను

శ్లో॥ మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేక మక్షరమ్.
యజ్ఞానాం జపయజ్ఞోస్మి స్థావరాణాం హిమాలయః ౨౫

మహాఋషులలో నేను భృగువును. శబ్ద సమూహమున యేకాక్షరమును అనగా బ్రహ్మవాచకమగు ఓంకారమును. శ్రౌత స్మార్తాది యజ్ఞములలో జపరూపమగు యజ్ఞమును. స్థావరపదార్థములలో హిమాలయమును.

శ్లో॥ అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాంచ నారదః.
గంధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలో మునిః ౨౬

నేను వృక్షములలో అశ్వత్థమును. దేవఋషులలో నారదుడను. గంధర్వులలో చిత్రరథుడను. సిద్ధులలో కపిలుడను. అయియున్నాను.

శ్లో॥ ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్.
ఐరావతం గజేంద్రాణాం నరాణాంచ నరాధిపమ్ ౨౭

నన్ను అశ్వములలోనుచ్చైశ్శ్రవముగను శ్రేష్ఠములగు యేనుగులలో ఐరావతముగను మనుష్యులలో రాజుగను యెరుగుము. శ్రుతి.- నా విష్ణుః పృథివీ పతిః

శ్లో॥ ఆయుధా నామహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్,
ప్రజనశ్చాస్మి కందర్ప స్సర్పాణామస్మి వాసుకిః ౨౮

ఆయుధములలో వజ్రమును. ఆవులలో కామధేనువును, సంతానోత్పాదకుడనగు మన్మధుడను నేనే. విషయుక్తములగు సర్పములకు అధిపతియగు వాసుకియును గూడ నేనే.

శ్లో॥ అనంతశ్చాఽస్మి నాగానాం వరుణో యాదసామహమ్,
పితౄణామర్యమాచాఽస్మి యమస్సంయమతామహమ్

నేను విషములేని పాములలో అనంతుడను జలదేవతలలో, వరుణుడను పితృదేవతలలో అర్యముడను. నియమించు లేక శాసించు వారిలో యముడను అయియున్నాను.

శ్లో॥ ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్,
మృగాణాంచ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్ 30

దైత్యులలో నేను ప్రహ్లాదుడను. గణకులలో కాలమును, మృగములలో సింహమును, పక్షులలో వినతాసుతుడనగు గరుడుడను నేనే.

శ్లో॥ పవనః పవతామస్మి రామశ్శస్త్రభృతామహమ్
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ 31

పవిత్రమొనర్చు లేక వేగవంతమగు వానిలో వాయువును నేను. ఆయుధధారులలో శ్రీరాముడను లేక పరశురాముడను మత్స్యాదులలో మొసలి యనబడు మత్స్యజాతి విశేషమను, నదులలో గంగను.

శ్లో॥ సర్గాణామాదిరంతశ్చ మధ్యంచైవాహమర్జున,
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్ 32

అర్జునా! నేను ఆకాశాది సృష్ట వస్తువులన్నిటికిని వుత్పత్తి, స్థితి, సంహారకుడనగు కర్తను. విద్యలలో మోక్షప్రదమగు అధ్యాత్మ విద్యను. తార్కికుల వాద, జల్ప, వితండములలో వాదమను

వాదము=తత్వనిర్ణయార్థమగు తర్కము
వితండము=పరపక్ష దూషణము
జల్పము=ఆత్మపక్షసమర్థనము

యీ మూటియందు వాదమే తత్వనిర్ణయ సమర్థముకాన భగవద్విభూతిగా చెప్పబడినది



శ్లో॥ అక్షరాణా మకారోఽస్మి ద్వంద్వస్సామాసికస్యచ,
అహమేవాక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః 33

అక్షరములలో నేను అకారమును. సమాసములలో ద్వంద్వ సమాసమును ప్రవాహ రూపమగు కాలమును సర్వతోముఖుడనగు కర్మఫలదాతయును కూడ నేనే

శ్లో॥ మృత్యుస్సర్వహరశ్చాహ ముద్భవశ్చభవిష్యతామ్,
కీర్తిః శ్రీ ర్వాక్చనారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా. 34

సంహారకులలో నేను సర్వ సంహారకుడనగు మృత్యువును భవిష్యత్తున గొప్పతనమును గలిగించెడి కల్యాణ గుణములలో అభ్యుదయమును. ధర్మని సతులగు కీర్తి శ్రీ వాక్కు స్మృతి మేధ ధృతి క్షమలును కూడా నేనే.

శ్లో॥ బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహమ్,
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః. 35

అటులనే నేను సామ గీతములలో ఇంద్రుని సర్వేశ్వరునిగా స్తుతించుటచే శ్రేష్ఠమగు బృహత్సామమును. ఛంధో విశిష్టమగు ఋక్కులలో గాయిత్రిని. మాసములలో నేను మార్గశిర్షమును ఋతువులలో వసంతమును.

శ్లో॥ ద్యూతం ఛలయతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్,
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతా మహమ్. 36

నేను వంచన పరులగువారి జూదమును. ప్రభావశాలుర తేజమును, జయశీలుర విజయమును, ఉద్యమపరుల ఉద్యమమును, సాత్వికులగు పురుషుల సత్వగుణమును, అగుచున్నాను.

శ్లో॥ వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః,
మునీనా మప్యహం వ్యాసః కవీనాముశనా కవిః 37

యాదవులలో నేను శ్రీకృష్ణుడను. పాండవులలో అర్జునుడను సర్వపదార్థ జ్ఞానులు అగు వ్యాసుడను వేదవ్యాసుడను. సూక్ష్మార్థ వివేకముగలవారిలో శుక్రుడను.

శ్లో॥ దండో దమయతా మస్మి నీతి రస్మి జిగీషతామ్,
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్. 38

నేను శిక్షన మొనర్చువారి దండించువారి దండ నీతిని అగుచున్నాడను. జయింపగోరువారి రాజనీతిని అగుచున్నాడను. గోప నీయ విషయములకు సంబంధించిన మౌనము కూడా నేనే. తత్వజ్ఞానుల యందు నా విభూతి జ్ఞాన రూపమున వెలయుచున్నది

శ్లో॥ యచ్చాపి సర్వభూతానాం బీజం తదహ మర్జున,
నతదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్. 39

అర్జునా యెయ్యది సర్వభూతములకు మూలకారణమో అయ్యది కూడా నేనే. నేను లేకుండిన స్థావరజంగమాత్మకములగు వస్తువులలో ఏ ఒక్కటియును నా శక్తి లేకుండిన నిలువబడ గలిగినది లేదు.

శ్లో॥ నాంతోస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప,
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా. 40

అర్జునా దివ్యమగు నా విభూతులకు పరిమితి లేదు. అయినను సంక్షేపముగా ఈ విభూతులను వర్ణన మొనర్చితిని.

శ్లో॥ యద్యద్విభూమత్సత్త్వం శ్రీమదూర్జిత మేవవా,
తత్తదేవావగచ్ఛత్వం మమ తేజోంశసంభవమ్, 41

ఐశ్వర్య యుక్తమును శ్రీమంతమును సర్వశ్రేష్ఠమును అగు వస్తు వెయ్యదియైనను కానిమ్ము అది నా శక్తి అంశమునుండి కలిగినది అని నీవు గ్రహింపుము.



శ్లో॥ అథవా బహునైతేన కింజ్ఞాతేన తవార్జున,
విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్ ౪౨

అర్జునా నా విభూతులను యింత యెక్కువగా తెలిసుకొనగా నీకు కలిగెడి లాభ మేమి? నా యొక్క అంశమువలననే సమస్త విశ్వమును వ్యాపించి నిండియున్నాను అని తెలిసికొనుము.

దశమోధ్యాయము సమాప్తము.





# అస్పర్శయోగము అనే
# శ్రీ మద్భగవద్గీత
## రాజయోగీయము
### ఏకాదశాధ్యాయము
### విశ్వరూప సందర్శన యోగము

అర్జున ఉవాచ :

శ్లో॥ మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మసంజ్ఞితమ్,
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయంవిగతో మమ. ౧

అర్జునుడు పల్కెను భగవంతుడా! నన్ను అనుగ్రహింప పురు షార్థ ప్రదమును అత్యంత రహస్యమును ఆత్మానాత్మ వివేక విషయ మును ఆధ్యాత్మమనబడునదియును అగు ఏ వాక్యము నీచే చెప్పబడి నదో దానివలన నా ఈ భ్రమ తొలగినది.

శ్లో॥ భవాప్యయౌహి భూతానాంశ్రుతౌ విస్తరశో మయా,
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్య మపి చావ్యయమ్. ౨

శ్రీ కృష్ణా నీనుండి విశదముగనే భూతముల వుత్పత్తి ప్రళయ ములను అక్షయమగు నీ మహాత్మ్యము గూడ వింటిని.

శ్లో॥ ఏవమేతద్యథాత్థత్వ మాత్మానం పరమేశ్వర,
ద్రష్టుమిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ. ౩

పరమేశ్వరా! నీవు ఏ ఆత్మతత్త్వమును నుడివితివో అది యథా ర్థము. పురుషోత్తమా! జ్ఞానైశ్వర్య శక్తి బల వీర్యాది సంపన్నమగు నీ ఈశ్వరీయ రూపమును సాక్షాత్కరింపజేసుకొన గోరుచున్నాను.

శ్లో॥ మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో,
యోగేశ్వర! తతో మేత్వం దర్శయా త్మాన మవ్యయమ్. ౪

ప్రభూ. ఆ విశ్వరూపమును నాచే దర్శింపబడుటసాధ్యము అని తలంతువేని యోగేశ్వరా! ఇక నీవు నాకు నిత్యమగు నా జగదాత్మ రూపమును చూపుము.

శ్రీ భగవానువాచ :

శ్లో॥ పశ్య మే పార్థ! రూపాణి శతశోఽథ సహస్రశః,
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ. ౫

శ్రీ కృష్ణుడు పల్కెను. పార్థా నానావిధ వర్ణములతోడను ఆకృతులతోడను, ఒప్పునవియును, అనేకములును, విభిన్నములును అగు దివ్యరూపములను దర్శింపుము.

శ్లో॥ పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రానశ్వినౌ మరుతస్తథా,
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత. ౬

భారతా! ద్వాదశాదిత్యులను, అష్ట వసువులను, ఏకాదశ రుద్రులను, అశ్వనీకుమార ద్వయమును, మరుద్దేవతా సప్తకమును, చూడుము, మరియు నీవుగాని ఇతరులుగాని ఇంతవరకు చూడని అద్భుతములను పెక్కింటిని చూడుము.

శ్లో॥ ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్,
మమ దేహే గుడాకేశ! యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి. ౭

అర్జునా! ఈ నా శరీరమున శరీరావయవములవలె ఒకచోటనున్న స్థావరజంగమ సహితమగు విశ్వము సమస్తమును మరి యితరమగు దేనిని చూడగోరుదువో నేడు దానినంతటిని గూడ చూడుము.

శ్లో॥ న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా,
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్. ౮

ఈ నీ మాంస చక్షువులతో నన్ను చూడజాలవు కనుక అలౌకికమగు జ్ఞాన నేత్రమును ప్రసాదించుచున్నాను. నా అసాధారణ

మగు యోగశక్తిని జూడుము.

సఞ్జయ ఉవాచ :

శ్లో॥ ఏవముక్త్వా తతో రాజన్! మహాయోగేశ్వరో హరిః.
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్. ౯

సంజయుడు పల్కెను ధృతరాష్ట్రా! మహాయోగేశ్వరుడగు నారాయణుడిట్లు పల్కి అర్జునునకు దివ్యమగు తన విశ్వరూపమును జూపెను.

శ్లో॥ అనేకవక్త్రనయన మనేకాద్భుత దర్శనమ్,
అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్. ౧౦

ఆ విశ్వరూపము అసంఖ్యములగు ముఖనేత్రములతోడను అనేకములగు అద్భుతాకృతులతోడను నానావిధమగు దివ్యాలంకారములతోడను నొప్పుచుండెను. మరియు పలువిధములగు దివ్యాయుధములను చేబూని యుండెను.

శ్లో; దివ్యమాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనమ్,
సర్వాశ్చర్యమయం దేవ మనన్తం విశ్వతోముఖమ్. ౧౧

ఆ విశ్వరూపము, దివ్యమాలావస్త్ర విభూషితమై దివ్యగంధానులిప్తమై అత్యంతాశ్చర్యమయమై దీప్తిమంతమై అపరిచిన్నమై విశ్వతోముఖమై నొప్పారు చుండెను.

శ్లో॥ దివిసూర్య సహస్రస్య భవే ద్యుగపదుత్థితా,
యదిభా స్సదృశీ సాస్యాద్భాస స్తస్య మహాత్మనః. ౧౨

ఆకాశమున వెయ్యిమంది సూర్యులప్రభ వొకే తడవ సముదితమైన యెడల ఆ కాంతి ఆ విశ్వరూపుని ప్రభను పోలునది కావచ్చును.

శ్లో॥ తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా,
అపశ్యద్దేవదేవస్య శరీరే పాండవస్తదా. ౧౩

అప్పుడర్జునుడు ఆ దేవదేవుని శరీరమున దేవ, పితృ, మనుష్యాది నానా రూపముల విభజింపబడిన జగత్తు నంతటిని జూచెను. అది విశ్వరూపమున అవయవమువలె నొక్కట వెలయుచుండెను.

శ్లో॥ తత స్సవిస్మయావిష్టో హృష్టరోమా ధనఞ్జయః,
ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలి రభాషత. ౧౪

అనంతరము అర్జునుడు ఆశ్చర్యాన్వితుడును పులకితాంగుడును ఆయెను విశ్వరూప ధారియగు భగవంతునకు శిరస్సుతో ప్రణమిల్లి చేతులు జోడించి ఇట్లు పల్కెను.

శ్లో॥ పశ్యామి దేవాంస్తవదేవ! దేహే
సర్వాంస్తథా భూతవిశేషసఙ్ఘాన్,
బ్రహ్మాణ మీశం కమలాసనస్థం
ఋషీంశ్చసర్వా నురగాం శ్చ దివ్యాన్. ౧౫

దేవా ఈ నీ విశ్వరూపమున దేవతలందరిని, చరాచరమగు జగత్తును వసిష్ఠాది ఋషులను తక్షకాది సర్పసమూహమును మేరువును, నీ నాభిపద్మమునమెరయు సృష్టికర్తయగు బ్రహ్మను చూచుచున్నాను.

శ్లో॥ అనేకబాహూదరవక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతో౽నన్తరూపమ్,
నాన్తం నమధ్యం నపునస్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప. ౧౬

విశ్వేశ్వరా. సర్వత్ర అనంతమగు నీ రూపమే కనబడుచున్నది అసంఖ్యములగు హస్తవుదర ముఖనేత్రములు కలిగియున్నావు. అనంత

రూపధరుడ వగు నిన్ను సర్వత్ర చూచుచున్నాడను. మరియు నీ తుదను చూడజాలకున్నాను. మధ్య భాగమును చూడజాలకున్నా డను మొదలును గూడ చూడజాలకున్నాడను.

శ్లో॥ కిరీటినం గదినం చక్రిణంచ
తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్,
పశ్యామి త్వాం దుర్నిరీక్షం సమన్తా
ద్దీప్తానలార్కద్యుతిమప్రమేయమ్. ౧౭

కిరీటధరునిగను, గదాధారిగను, చక్రహస్తునిగను, సర్వత్ర ప్రకాశించువానిగను ప్రభా పుంజముగను, దుర్దర్శనీయునిగను, సూర్యాగ్నుల కాంతిని బోలు కాంతిగలవానినిగను, అపరిచ్ఛిన్నుని గను, నిన్ను అన్ని యెడల చూచుచున్నాడను.

శ్లో॥ త్వ మక్షరం పరమం వేదితవ్యం
త్వ మస్య విశ్వస్య పరంనిధానమ్,
త్వ మవ్యయః శ్శాశ్వతధర్మగోప్తా
సనాతనస్త్వం పురుషో మతో మే. ౧౮

నీవు పరబ్రహ్మరువు యేకమాత్రమగు జ్ఞేయ వస్తువవు. నీవు విశ్వమునకు శ్రేష్ఠమగు ఆశ్రమవు సనాతన ధర్మరక్షకుడవు. నిత్యు డవు పరమాత్మవు అని నా అభిప్రాయము.

శ్లో॥ అనాదిమధ్యాన్త మనన్తవీర్య
మనన్తబాహుం శశిసూర్యనేత్రమ్,
పశ్యామిత్వాం దీప్తహుతాశవక్త్రం
స్వతేజసా విశ్వ మిదం తపన్తమ్. ౧౯

నీవు ఆదిమధ్యాంత రహితుడవు. అఖండ శక్తిశాలివి. అసంఖ్య బాహు విశిష్టుడవు. చంద్ర సూర్యులు నీనేత్రములు. నీ ముఖమండల మున ప్రదీప్తాగ్నిజ్యోతి దీపిల్లుచున్నది. నీ తేజమున జగత్తు సంతటిని తపింప చేయువానిగను నిన్ను చూచుచున్నాడను.

శ్లో॥ ద్యావాపృథివ్యో రిద మన్తరం హి
వ్యాప్తం త్వయై కేన దిశ శ్చ సర్వాః,
దృష్ట్వాఽద్భుతం రూప ముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్. 20

మహాత్మా భూమి ఆకాశము ఈ మధ్య ప్రదేశము నీయొక్క-నిచేతనే వ్యాపింపబడి దిక్కులు అన్నియు గూడా వ్యాపింపబడి యున్నవి. నీ ఈ ఆశ్చర్యకరమును అదృష్ట పూర్వమును ఘోరమును అగు విశ్వరూపమును చూచి ముల్లోకములు భయపడుచున్నవి. అని నేను చూచుచున్నాను.

శ్లో॥ అమీ హి త్వాం సురసఙ్ఘా విశన్తి
కేచి ద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి,
స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధస ః
స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః 21

ఈ యుద్ధమునక్కు మనుష్య శరీరధారులగు వసువు మొదలగు దేవతలు నీ యందు ప్రవేశించుచున్నారు. కొందరు భీతినంది చేతులు జోడించి నిన్ను నుతించుచున్నారు. మహారుషులు సిద్ధులును జగత్తునకు శుభమగుగాక అని పలికి శ్రేష్ఠములగు స్తోత్రములతో నిన్ను బొగడుచున్నారు.

శ్లో॥ రుద్రాదిత్యా వసవో యేచ సాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ,
గన్ధర్వయక్షాసురసిద్ధసఙ్ఘా
వీక్షన్తే త్వాం విస్మితా శ్చైవ సర్వే 22

రుద్రులును, అదిత్యులు, వసువులు, సాధ్యులు, విశ్వదేవతలు, అశ్వనీ దేవతలు, మరుద్గణము పితృదేవతలు, గంధర్వులు, యక్షులు,

అసురులు, సిద్ధులు మున్నగువారు అందరు గూడ విస్మితులై నిన్ను వీక్షించుచున్నారు.

శ్లో॥ రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో బహుబాహూరుపాదమ్,
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వాలోకాః ప్రవ్యథితా స్తథాఽహమ్ 23

ప్రభూ అనేకములగు ముఖనేత్రములు హస్తపాదములు పూరువులు, వుదముర ములతో నొప్పుచు నీ విశ్వరూపము అసంఖ్యములగు దంతములతో భయంకరమై తోచుచున్నది. యీ రూపమును గాంచి ప్రాణులందరును నేనును గూడ భీతిజెందు చున్నారము.

శ్లో॥ నభస్స్పృశం దీప్తమనేకవర్ణం వ్యాత్తాననందీప్తవిశాలనేత్రమ్
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితా న్తరాత్మా ధృతిం న విన్దామి శమం చ విష్ణో.

సర్వవ్యాపి గగన స్పర్శియును తేజోమయుమును నానావర్ణ యుక్తమును విస్ఫారవదనమును వుజ్వల విశాల నేత్రమును అగు నీ విశ్వరూపమును గాంచి నా మనస్సు కలవరపడుచున్నది. ధైర్య మును శాంతిని బొందజాలకున్నాను.

శ్లో॥ దంష్ట్రాకరాళానిచ తే ముఖాని దృష్ట్వైవకాలానలసన్నిభాని,
దిశో నజానే నలభే చ శర్మ ప్రసీద దేవేశ! జగన్నివాస 25

దేవదేవా భయంకరములగు కోరలతో నొప్పునవియును ప్రళ యాగ్ని సదృశములును అగు నీ వదనముల జూడ నాకు దిగ్భ్రమ కలుగుచున్నది. నాశాంతి తొలగినది. ప్రసన్నుడవగుము.

శ్లో॥ అమీచ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావని పాలసఙ్ఘైః,
భీష్మ ద్రోణ సూతపుత్ర స్తథాసౌ
సహాస్మదీయైరపి యోధముఖ్యైః 26

శ్లో॥ వక్త్రాణి తే త్వరమాణా విశన్తి దంష్ట్రాకరాళాని భయానకాని.
కేచిద్విలగ్నా దశనాన్తరేషు సందృశ్యన్తే చూర్ణితైరుత్తమాఙ్గైః

ధృతరాష్ట్రుని పుత్రులు రాజన్యవర్గముతో నీ ముఖవివరముల ప్రవేశించుచున్నారు. భీష్మద్రోణులు కర్ణుడును మన పక్షమునకు జెందిన దృష్టద్యుమ్నాది వీరులతో గూడ నీ యందు ప్రవేశించు చున్నారు.

వారందరును కరాళదంష్ట్రములును భీషణములును అగు నీముఖ గహ్వరముల తొందరపడుచు ప్రవేశించుచున్నారు. కొందరు పంటి సందులలో చిక్కుకొని పొడుముగా చేయబడిన సిరస్సులతో కనబడు చున్నారు.

శ్లో॥ యథా నదీనాం బహవో మ్బువేగా
స్సముద్ర మేవాభిముఖా ద్రవన్తి,
తథా తవా మీ నరలోకవీరా
విశంతి వక్త్రాణ్యభివిజ్వలన్తి. 28

పెక్కు నీటి ధారలు యేరీతిగా సముద్రము నెదుర్కొని ప్రవేశించుచున్నవో ఆ రీతిగా యీ మనుష్యయోధులు సర్వత్ర ప్రకాశమానమగు నీ నోళ్ళలో ప్రవేశించుచున్నారు.

శ్లో॥ యథా ప్రదీప్తం జ్వలనం పతఙ్గా
విశన్తి నాశాయ సమృద్ధవేగాః,

తథైవ నాశాయ విశన్తి లోకా
స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః. 29

మిడుతలు తొందరగా పరుగిడి మండు నిప్పుల బడుట చావు కొరకే యైన రీతిగా జనులందరును గూడా మృతినొంది అతివేగముగ నీ ముఖ వివరముల ప్రవేశించుచున్నారు.

లేలిహ్యసే గ్రసమాన స్సమన్తా
ల్లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః,
తేజోభి రాపూర్య జగత్సమగ్రం
భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో.

భగవంతుడా దివ్యమానములగు వదన సమూహములతో ఈ వీరుల నందరిని మ్రింగుచు అన్ని వైపులకు నాలుకలను జాపుచు అస్వాదన మొనర్చుచున్నాడవు తీవ్రములగు నీ ప్రభలు కాంతులతో జగత్తునంతటిని నింపి తపింపజేయుచున్నవి.

శ్లో॥ ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో నమోస్తు తే దేవ వర ప్రసీద
విజ్ఞాతుమిచ్ఛామి భవన్తమాద్యం నహి ప్రజానామి తవ ప్రవృత్తిమ్.

అతి క్రూరమగు అకారముగల నీవు యెవరో నాకు చెప్పుము నీకు నమస్కారము. దేవశ్రేష్ఠా ప్రసన్నుడవుకమ్ము ఆది పురుషుడవగు నిన్ను తెలిసికొన గోరెదను నీ వుద్దేశ్యము యేమియో తెలియకున్నది.

శ్రీ భగవా నువాచ :

శ్లో॥ కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః,
ఋతేఽపి త్వాం నభవిష్యన్తి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః. 32

శ్రీ భగవంతుడు పల్కెను. నేను లోక సంహారార్థము విజృంభించిన కాలుడను. ఇప్పుడు ప్రాణుల సంహరింప మొదలడితిని. నీవు యుద్ధ మొనర్పక పోయినను శత్రుపక్షమునందలి వీరులు జీవించరు.

శ్లో॥ తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వాశత్రూన్ భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధమ్,
మయైవై తే నిహతా, పూర్వ మేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ 33

కనుక నీవు లెమ్ము యుద్ధ మొనర్పుము. శత్రువుల నోడించి నిష్కంటకమగు రాజ్యము భోగించుము. నాచే వీరు మును పే చంపబడిరి. అర్జునా నీవు నిమిత్తమాత్రుడవుకమ్ము.

శ్లో॥ ద్రోణఞ్చ భీష్మఞ్చ జయద్రథఞ్చ
కర్ణం తథాఽన్యానపియోధవీరాన్,
మయా హతాం స్త్వం జహి మావ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్. 34

యెవరిని జంప నీవు శంకించుచుంటివో అభీష్మ ద్రోణకర్ణ జయద్రథాదులను తదితరులగు యోధులను నేనిదివరకే చంపియుంటిని మృతులైనవారినే నీవు వధింపుము. భయపడకుము. యుద్ధమున తప్పక గెలువగలవు. యుద్ధముచేయుము.

సంజయ ఉవాచ :

శ్లో॥ ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాఞ్జలిర్వేప
మానః కిరీటీ.
నమస్కృత్వాభూయ ఏవాహ కృష్ణంసగద్గదం భీతభీతః
ప్రణమ్య. 35

సంజయుడు పల్కెను శ్రీకృష్ణుని ఈ పల్కులు విని కిరీటి వణకుచు చేతులు జోడించి నమస్కరించెను. మిక్కిలి భయపడుచు మరల ప్రణమిల్లి గద్గదస్వరముతో ఇట్లు పల్కెను.

అర్జున ఉవాచ :

శ్లో॥ స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతేచ,
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి, సర్వేనమస్యన్తి చ సిద్ధసఙ్ఘాః 36

అర్జునుడు పల్కెను. హృషీకేశా నీ మహాత్మ్య కీర్తనమున జగత్తంతయు ఆనందించుచూ ప్రీతిని బొందుచున్నది. రాక్షసులు భీతులై నలుదిక్కుల పరుగిడుచున్నారు. తపోయోగమంత్ర సిద్ధులు నీకు నమస్కరించుచున్నారు. యిది యంతయును తగియున్నది.

శ్లో॥ కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే:
అనన్త! దేవేశ! జగన్నివాస!
త్వ మక్షరం సదసత్తత్పరం యత్. 37

మహాత్మా! అనంతా దేవేశా! జగదాశ్రయా బ్రహ్మకంటెను గొప్పవగు మూలకారణమగు నీకు దేవతలు యేల నమస్కరింపకుందురు? వ్యక్తమును అవ్యక్తమును రెంటికి అతీతమగు యే పరబ్రహ్మము కలదో అదియును నీవే.

శ్లో॥ త్వ మాదిదేవః పురుషః పురాణ
స్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్,
వేత్తాసి వేద్యఞ్చ ధామ
త్వయా తతం విశ్వ మనన్తరూప! 38

అనంతరూప నీవు దేవతలకు గూడ ఆది సనాతనుడవగు పురుషుడవు. నీవు యీ జగత్తునకు యేకమాత్రమగు ఆశ్రయమవు సర్వజ్ఞుడవు జ్ఞేయమవు. శ్రేష్ఠమగు పదము అగుచున్నావు నీచే జగత్తు వ్యాప్తమైయున్నది.

శ్లో॥ వాయుర్యమోఽగ్ని ర్వరుణశ్శశాఙ్కః
ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ
నమో నమ స్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చభూయోఽపి నమో నమస్తే 39

నీవు వాయుదేవుడవు యముడవు, అగ్నివి. వరుణుడవు. చంద్రుడవు ప్రజాపతి రూపమున లోకములకు తండ్రివి. బ్రహ్మకు జనకుడవగు ప్రపితామహుడవు కూడ నీవే నీకు సహస్ర నమస్కారములు మరల నీకు నమస్సులు తిరిగియును నీకు నమస్కరింతును.

శ్లో॥ నమః పురస్తా దథ పృష్ఠతస్తే నమోఽస్తు తే సర్వత ఏవసర్వ
అన న్తవీర్యామితవిక్రమస్త్వం సర్వంసమాప్నోషితతోఽసిసర్వః.

సర్వాత్మా నీకు యెదురుగను వెనుకగను అన్ని వైపులను నమస్కరించుచున్నాడను నీ బల పరాక్రమములకు అంతము లేదు. నీవు విశ్వము నంతటిని వ్యాపించియున్నాడవు.

శ్లో॥ సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే! కృష్ణ! యాదవ హే సఖేతి,
అజానతా మహిమానం తవేదం
మయాప్రమాదా త్ప్రణయేన వాపి. 41

శ్లో॥ యచ్చావహాసార్థ మసత్కృతోఽసి
విహారశయ్యాసనభోజనేషు,
ఏకో ధవాప్యచ్యుత! తత్సమక్షం
తత్ క్షామయే త్వా మహ మప్రమేయమ్ 42

విశ్వరూపధారణా సమర్థమైన నీ మహిమను గుర్తింపజాలక నిన్ను సఖుడవని యెంచి పొరబాటునగాని చనువుచేగాని కృష్ణా యాదవా సఖా అని వినయరహితముగ దేనిని వచించియుంటినో

మరియు అచ్యుతా! విహారశయన ఆసన కాలములగాని నీయెదుటగాన వెనుకగాని నీవు వొక్కడవేయుండునప్పుడుగాని లేక యితరులతో నుండునప్పుడుగాని పరిహాసార్థము నీ కొనర్చిన అమర్యాదకును అప్రమేయుడవగు నీ కడ క్షమా ప్రార్థన మొనర్చుచున్నాడను.

శ్లో॥ పితాసి లోకస్యచరాచరస్యత్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్
నత్వత్సమోఽస్త్యభ్యధికఃకుతోఽన్యో లోకత్రయేప్య ప్రతిమ
ప్రభావ. 43

నిరుపమ ప్రభావా స్థావరజంగమాత్మకమగు యీ జగత్తునకు నీవు సృష్టవు, పూజనీయుడవు, గురుడవు, పెద్దవు త్రిభువనముల నీకు సమానులగువారు లేరు నీ కంటే శ్రేష్టులగువారు వుండరు.

శ్లో॥ తస్మాత్ ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామహ మీశ మీడ్యమ్,
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ! సోఢుమ్. 44

కనుక దేవా నీకు సాష్టాంగ ప్రణామ మొనర్చుచున్నాడను. పూజనీయుడవును ఈశ్వరుడవునగు నిన్ను అనుగ్రహింపవేడుచున్నాడను తండ్రి కొడుకు యొక్కయు స్నేహితుడు స్నేహితునియొక్కయు ప్రియుడు ప్రేయసి యొక్కయు లోపముల సహించునట్లు నీవు నా అపరాధమును క్షమింపుము.

శ్లో॥ అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే
త దేవ మే దర్శయ దేవ! రూపం
ప్రసీద దేవేశ! జగన్నివాస. 45

దేవా నేనుగాని ఇతరులుగాని ఇంతకుమునుపు చూడని విశ్వరూపమునుచూచి ఆనందమునందితిని. నామనస్సు భయవ్యాకులితమగుచున్నది. దేవేశా, జగన్నివాసా అనీ పూర్వరూపమునే చూపుము. ప్రసన్నుడవుకమ్ము.

శ్లో॥ కిరీటినంగదినం చక్రహస్తమిచ్ఛామి త్వాంద్రష్టుమహాంతథైవ
తేనైవరూపేణచతుర్భుజేనసహాస్రబాహోభవవిశ్వమూర్తే.

సహాస్రహస్తా నేను నిన్ను పూర్వరీతిగా కిరీట, చక్ర, గంగాధరునిగ చూడగోరుచున్నాడను దుర్నిరీక్ష్యమగు నీ విశ్వరూపమునుపుపసంహరింపుము విశ్వమూర్తి! నీఅచతుర్భుజరూపమును ధరింపుము.

శ్రీ భగవా నువాచ :

శ్లో॥ మయా ప్రసన్నేన తవా ర్జునేదం
రూపం పరం దర్శితమాత్మయోగాత్,
తేజోమయం విశ్వ మనన్త మాద్యం
యన్మేత్వదన్యేన న దృష్టపూర్వమ్, 47

శ్రీ భగవంతుడు పల్కెను. అర్జునా! నేను నీకు ప్రసన్నుడనై నా యోగశక్తి ప్రభావమున తేజఃపూర్ణమును అనంతమును. ఆద్యమును అగు విశ్వరూపమును జూపితిని. నీవుగాక యితరులెవ్వరు పూర్వమీ రూపమును జూడలేదు.

శ్లో॥ నవేదయజ్ఞాధ్యయనైర్నచక్రియాభిర్నతపోభిరుగ్రైః,
ఏవంరూపశ్శక్య అహం నృలోకే ద్రష్టుంత్వదన్యేనకురుప్రవీర

కురుశ్రేష్ఠా వేదములను యజ్ఞవిద్యలను అధ్యాపన మొనర్చినవారు ఈ విశ్వరూపమును చూడలేదు. అగ్నిహోత్రాది శ్రౌతకర్మలను తులాపురుషాది దానములను చాంద్రాయనాదులగు కఠిన తపములను ఆచరించినవారికి గూడ ఈ దర్శనము లభింపలేదు. నీవొక్కడవే

నా యనుగ్రహమున దర్శించి ధన్యుడవైతివి.

శ్లో॥ మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోర మీదృఙ్మమేదమ్,
వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం
త దేవ మే రూప మిదం ప్రపశ్య 49

భయంకరమగు నా యీ విశ్వరూపమును గాంచి నీవు భయమును చిత్త వైకల్యమును పొందవలదు. భయమును వీడి ప్రసన్న చిత్తముతో నా చతుర్భుజరూపమును జూడుము.

సఞ్జయ ఉవాచ :

శ్లో॥ ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా
స్వకంరూపం దర్శయామాస భూయః,
ఆశ్వాసయామాస చ భీత మేనం
భూత్వాపున స్సౌమ్యవపు ర్మహాత్మా. 50

సంజయుడు పల్కెను. వాసుదేవుడు అర్జునునితో ఇట్లు పల్కి మరల తన పూర్వరూపమును జూపెను. విశ్వాత్ముడు ప్రసన్నరూపుడు అయి భీతినందిన అర్జునుని ఓదార్చెను.

అర్జున ఉవాచ :

శ్లో॥ దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన,
ఇదానీ మస్మి సంవృ త్త స్సచేతాః ప్రకృతిం గతః 51

అర్జునుడు పల్కెను. జనార్ధనా సౌమ్యమగు ఈ నీ మనుష్యరూపమును గాంచి నా చిత్తము ప్రసన్నతనందినది. స్వస్థుడనైతిని.

శ్రీ భగవా నువాచ :

శ్లో॥ సుదుర్దర్శమిదం రూపం దృష్టవా నసి యన్మమ,
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాఙ్క్షిణః 52

భగవానుడు పల్కెను నీవు చూచిన ఈవిశ్వరూపము అత్యంత దుర్లభము. దేవతలు గూడ నిత్యము ఈ రూపమును చూడగోరు చుందురు.

శ్లో॥ నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా,
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా. 53

నీవే రూపమున నన్ను చూచితివో ఆ రూపమున నేను వేద పఠనమునగాని తపస్సువలనగాని దానము నగాని యజ్ఞమువలనగాని చూడసాధ్యుడను కాను.

శ్లో॥ భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప. 54

అర్జునా! యదార్థముగ నన్ను గురించిన శాస్త్రజ్ఞానము, ప్రత్యక్షసాక్షాత్కారము, తాదాత్మ్యమగు మోక్షమును, కేవలము అనన్య భక్తి వలననే సంభవమగును. పరంతపా అనన్య భక్తియొక్క టియే విశ్వరూపమును దర్శింపజేయుగలదు.

శ్లో॥ మత్కర్మకృన్మత్పరమో మద్భక్తః సఙ్గవర్జితః,
నిర్వైరస్సర్వభూతేషు యస్సమామేతి పాణ్డవ!

అర్జునా! యెవడు నా కొరకు కర్మల నాచరించుచుండునో నన్నే పురుషార్థముగా తలచునో తన మిత్ర పుత్రాదులయందాసక్తి కలిగియుండడో నన్నే ఆశ్రయించియుండునో సర్వజీవుల యెడ శత్రు భావము లేకయుండునో అతడు నన్ను పొందును.

దేవతలకును తపోయజ్ఞాది కర్మలకును గూడ సాధ్యముకాని విశ్వరూపమును భక్తుడగు అర్జునునకు భగవంతుడు చూపెను.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగ శాస్త్రే శ్రీ కృష్ణార్జునసంవాదే విశ్వరూప సందర్శనయోగోనామ ఏకాదశోఽధ్యాయః.

ఏకాదశోఽధ్యాయః

# అస్పర్శయోగము అనే
# శ్రీ మద్భగవద్గీత
## రాజయోగీయము
### ద్వాదశాధ్యాయము
### భక్తి యోగము

అర్జున ఉవాచ :

శ్లో॥ ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే,
యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః. 1

అర్జునుడు పల్కెను. సర్వకర్మార్పణ మొనర్చుచు నిరంతర నిష్ఠులగుచు యే భక్తులు విశ్వరూపివియగు నిన్ను ధ్యానించుచున్నారో మరియు యెవరు నిర్గుణ నిర్విశేషమగు బ్రహ్మమును ధ్యానించు చున్నారో వీరిద్దరిలో శ్రేష్ఠుడగు యోగి యెవడు.

శ్రీ భగవానువాచ :

శ్లో॥ మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః. 2

శ్రీ కృష్ణుడు పల్కెను. యెవరు యేక నిష్ఠులై పరమ శ్రద్ధతో నా విశ్వరూపమున మనస్సు నిలిపి సర్వజ్ఞుడను అగు నన్ను భజించు చున్నారో వారు శ్రేష్ఠులగు యోగులని నా అభిప్రాయము.

శ్లో॥ యేత్వక్షరమనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాసతే,
సర్వత్రగమచిన్త్యఞ్చ కూటస్థమచలం ధ్రువమ్. 3
సన్నియమ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః,
తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూతహితే రతాః. 4



కాని యెవరు, సర్వకాలముల సమబుద్ధి జగత్తున హిత మొన ర్చుచు ఇంద్రియ సమూహమును నిగ్రహించి, అనిర్వచనీయమును అప్రమేయమును, ప్రమాణాతీతమును, మాయకు అధిష్ఠానమై వెలయు కూటస్థమును స్థిరమును నిత్యమును ఆకాశమువలె సర్వవ్యాపియునగు నిర్గుణ బ్రహ్మమును వుపాసించుచున్నారో, వారు నన్నే పొందు చున్నారు.

శ్లో॥ క్లేశోధికతర స్తేషా మవ్యక్తాసక్త చేతసామ్,
అవ్యక్తాహి గతిర్దుఃఖం దేహావద్భిరవాప్యతే. 5

నిర్గుణ బ్రహ్మ నిష్ఠులగు యోగులకు శ్రమ మిగుల యెక్కువ యేలయన దేహాభిమానులగు వారికి నిర్గుణ బ్రహ్మ నిష్ఠ లభించుట కష్టతరము.

శ్లో॥ యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యేనైవయోగేన మాం ధ్యాయన్త ఉపాసతే. 6
తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్. 7

పార్థా. యెవరు సమస్త కర్మములను నాకర్పించి, నా యందా సక్తి గొని, ఏకాంతికమగు భక్తియోగమున నన్ను ధ్యానించుచు వుపాసించుచున్నారో, మన్నిష్ట చిత్తులగు ఆ వ్యక్తులను శీఘ్రముగనే జనన మరణ రూపమగు సంసార సాగరమునుండి వుద్ధరించుచున్నాను.

శ్లో॥ మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ,
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం నసంశయః. 8

కనుక నీవు నా యందే చిత్తమును సుస్థిర మొనర్పుము. బుద్ధిని కూడా నా యందు యేకాగ్ర మొనర్చుము. యిట్లొనర్చిన యెడల శరీర త్యాగానంతరము నీవు నా యందే వసింపగలవు. ఈ విషయ మున సందేహములేదు.

శ్లో॥ అథ చిత్తం సమాధాతుం నశక్నోషి మయి స్థిరమ్,
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనఞ్జయ. 9

ధనంజయా నీవు నా యందు చిత్తమును స్థిరముగా నిల్పజాలనిచో అభ్యాసయోగమున నన్ను బొంద ప్రియత్నింపుము

శ్లో॥ అభ్యాసేఽప్య సమర్థోఽసి మత్కర్మ పరమో భవ,
మదర్థ మపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి. 10

ఇట్టి అభ్యాసము నొనర్చుటకు గూడ నీవు సమర్థుడవు కానిచో భగవత్ప్రీతికరములగు కర్మముల నాచరింపుము. ఇట్టి కర్మముల నాచరించుచుండిన నీవు సిద్ధిని పొందగలవు.

శ్లో॥ అథైత దప్యశక్తోఽసి కర్తుం మద్యోగ మాశ్రితః,
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్. 11

ఇట్లును ఆచరింప అసమర్థుడవైనచో నన్ను శరణుబొంది చిత్తమును నిగ్రహించి కర్మఫలముల త్యజింపుము.

శ్లో॥ శ్రేయోహిజ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే,
ధ్యానాత్కర్మఫలత్యాగ స్త్యాగాచ్ఛాన్తిరనన్తరమ్ 12

జ్ఞాన రహితమగు అభ్యాసముకంటె యుక్తసహితముగ నుపదేశింపబడు జ్ఞానము శ్రేష్ఠము. ఇట్టి తత్వనిశ్చయముకన్న ధ్యానము శ్రేష్ఠము ధ్యానముకన్నఆసక్తినివృత్తిని గలిగించు కర్మఫలత్యాగము మంచిది.కర్మఫలత్యాగమొనర్చిన వెంటనే సంసారోపరమ రూపమగు శాంతి లభించును.

శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ,
నిర్మమో నిరహఙ్కార స్సమదుఃఖసుఖః క్షమీ. 13

శ్లో॥ సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః,
మయ్యర్పితమనో బుద్ధిర్యోమద్భక్తస్స మే ప్రియః. 14

సకల ప్రాణులను ద్వేషింపనివాడును, మిత్రభావము కలవాడును

దయకలవాడును, మమకారము లేనివాడును, అహంకారము లేనివాడును, సుఖదుఃఖముల సమాన బుద్ధికలవాడును, క్షమాశీలుడును యెల్లప్పుడు సంతోషము కలవాడును. సమాహిత చిత్తుడును, సంయత స్వభావుడును, దృఢమగు సంకల్పముగలవాడును, నా యందు మనస్సును, బుద్ధిని, అర్పించినవాడును, నా భక్తుడగు వాడు యెవడో అతడు నాకు ఇష్టుడు.

శ్లో॥ యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతేచ యః,
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్సచ మే ప్రియః. 15

యెవడు యెవ్వరికిని వుద్వేగమును గలిగింపకుండునో యెవడు యెవ్వరినుండియు వుద్వేగమును పొందడో మరియు నెవ్వడు ఆనంద విషాద భయ సంక్షోభముల పొందకుండునో అతడు నాకు ప్రియుడు.

శ్లో॥ అనపేక్ష శ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః,
సర్వారమ్భపరిత్యాగీ యో మద్భక్తస్సమే ప్రియః. 16

నిస్పృహుడును బాహ్యాభ్యంతర శౌచసంపన్నుడును. దక్షుడును పక్షపాత శూన్యుడును సర్వసకామ కర్మత్యాగియును అగు భక్తుడు నాకు ఇష్టుడు.

శ్లో॥ యో నహృష్యతి నద్వేష్టి నశోచతి నకాఙ్క్షతి,
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్సమే ప్రియః. 17

శుభము చేకూరిన సంతోషపడడు. కీడు వాటిల్లినా ద్వేషమును బొందడు. ఇష్టవియోగమైన దుఃఖింపడు. తనకు లేని వస్తువునుగోరడు. పుణ్యపాపములనిచ్చు కర్మముల నాచరింపడు. ఇట్టి భక్తుని నేను ప్రేమింతును.

శ్లో॥ సమశ్శత్రౌచ మిత్రేచ తథా మానాపమానయోః,
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సఙ్గవివర్జితః. 18

శ్లో॥ తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్,
అనికేతః స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః. 19

శత్రుమిత్రులు పూజాపరాభవములు శీతోష్ణ సుఖదుఃఖములు నిందాస్తుతులు వీనియెడ సమదృష్టిని గల్గి లభించిన ఏ కొద్దితోనో పరితృప్తి నందుచు మౌనియై స్థిర నివాసములేక నిశ్చలచిత్తము ను భక్తియు గలిగియుండు వ్యక్తి నాకు ప్రియుడు.

శ్లో॥ యేతుధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే,
శ్రద్ధధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః.

కాని యెవరు శ్రద్ధావంతులును మత్పరాయణులును అగుచు ఈ అమృత తుల్యమగు ధర్మమును చెప్పబడిన రీతిగా అనుష్ఠించుచున్నారో, అట్టి భక్తులు నాకు అత్యంతము ప్రియులు. ఇందు భక్తునకుండవలసిన కళ్యాణ గుణములు వర్ణింపబడినవి. ఆయా గుణములతో నొప్పువాడు నాకు ప్రియుడు కాని ఈ గుణములన్నిటితో శోభిల్లువాడు నాకు అత్యంత ప్రియుడని భగవంతుని అభిప్రాయము.



# అస్పర్శయోగము అనే
# శ్రీ మద్భగవద్గీత
## రాజయోగీయము
### త్రయోదశాధ్యాయము
### క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము

అర్జున ఉవాచ :

శ్లో॥ ప్రకృతిం పురుషఞ్చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవచ,
ఏతద్వేదితుమిచ్ఛామి జ్ఞానంజ్ఞేయఞ్చ కేశవ! 1

అర్జునుడు పల్కెను కృష్ణా! ప్రకృతిని పురుషని క్షేత్రమును క్షేత్రజ్ఞుని, జ్ఞానమును జ్ఞేయమును, అను విషయములను తెలుసుకొనగోరెదను.

శ్రీ భగవా నువాచ :

శ్లో॥ ఇదం శరీరం కౌన్తేయ! క్షేత్రమిత్యభిధీయ తే,
ఏతద్యో వేత్తితం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః. 2

శ్రీ కృష్ణుడు పల్కెను కుంతీపుత్రా, ఈ భోగాయతనమగు దేహము క్షేత్రము అని చెప్పబడును. యెవడు దీనిని తెలుసుకొను చున్నాడో క్షేత్రక్షేత్రజ్ఞ వేత్తలు, దానిని క్షేత్రజ్ఞుడని అనుచున్నారు

శ్లో॥ క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత,
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తత్ జ్ఞానం మతం మమ. 3

భారత! అర్జునా! సర్వశరీరముల వెలయు నన్ను క్షేత్రజ్ఞునిగా తెలిసికొనుము. క్షేత్రక్షేత్రజ్ఞుల జ్ఞానము యేదియో అదియే యథార్థ మగు జ్ఞానమని నా అభిప్రాయము.

శ్లో॥ తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్,
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు. 4

ఆ క్షేత్రము యెయ్యదియో యెటువంటిదో యెట్టి వికారము లతో గూడినదో యెద్దాని నుండి యేరీతిగా వుత్పన్నమైనదో ఆ క్షేత్రజ్ఞుడు యెవడో అతని ప్రభావము యెటువంటిదో దానిని సంగ్రహము గనుడి వెదను వినుము.

శ్లో॥ ఋషిభి ర్బహుధా గీతం ఛన్దోభి ర్వివిధైః పృథక్,
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః 5

క్షేత్రక్షేత్రజ్ఞుల మహాత్యము ఋషులచే విభిన్నములగు వేదమంత్రములచే వేరుగ పెక్కు రీతుల నిరూపితములైనవి. సంశయ రహితములగు హేతువులతో గూడిన బ్రహ్మ సూచకములగు వుపనిషద్వాక్యముల వలన వర్ణింపబడినది.

శ్లో॥ మహాభూతా న్యహఙ్కారో బుద్ధి రవ్యక్తమేవచ,
ఇన్ద్రియాణి దశైకఞ్చ పఞ్చ చేన్ద్రియగోచరాః 6
ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సఙ్ఘాతశ్చేతనాధృతిః,
ఏతత్ క్షేత్రం సమాసేన సవికారముదాహృతమ్. 7

పంచ సూక్ష్మ భూతములు, మహాభూతములకు కారణమగు అహంకారము, దీనికి కారణమగు బుద్ధి, బుద్ధికి కారణమగు మూల ప్రకృతి మరియు దశేంద్రియములు మనస్సు యింద్రియ విషయములగు స్థూలభూతములును, ఇచ్ఛా ద్వేషము దుఃఖములును శరీరమును దానియందు దోచు చేతనమును, ధృతియును, గలసి క్షేత్రమనబడుచున్నది. మహదాది వికారములతో గూడిన క్షేత్ర తత్త్వము సంగ్రహముగ చెప్పబడినది.

శ్లో॥ అమానిత్వ మదమ్భిత్వ మహింసా క్షాన్తి రార్జవమ్,
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః. 8

అమానిత్వము, స్వధర్మమును ప్రకటింపకుండుట, పరులను పీడింపకుండుట, ఓను సరళమగు శుశ్రూష బాహ్యాభ్యంతర,శౌచము, మోక్ష మార్గమునయే కనిష్ట ఆత్మనిగ్రహము.

శ్లో॥ ఇన్ద్రియార్థేషు వైరాగ్య మనహఙ్కార ఏవచ,
జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషాను దర్శనమ్. 9

భోగ్యములగు యింద్రియ విషయముల విరక్తి అభిమాన రాహిత్యము జన్మ మృత్యు జరా వ్యాధులనెడి దుఃఖములనుండి దోషము ను మాటిమాటికి చూచుచుండుట

శ్లో॥ అసక్తిరనభిష్వఙ్గః పుత్రదార గృహాదిషు,
నిత్యఞ్చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు. 10

పుత్రదార గృహాదుల ఆసక్తి,మమత్వములు. లేకుండుట,శుభాశుభ ప్రాప్తుల మనస్సు లోనుకాకుండుట.

శ్లో॥ మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ,
వివిక్త దేశ సేవిత్వమరతి ర్జనసంసది. 11

నా యందు సర్వాత్మ దృష్టితో ఏకాంతిక భక్తిని గల్గియుండుట, చిత్త ప్రసాదకరములగు ప్రదేశముల నివసించుట, ప్రాకృత జనసంసర్గ త్యాగము.

శ్లో॥ అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్,
ఏతత్ జ్ఞానమితి ప్రోక్త మజ్ఞానంయదతోఽన్యథా. 12

ఆత్మ జ్ఞాననిష్ఠ మోక్షమున సర్వోత్కృష్ట బుద్ధి, ఇదంతయును జ్ఞానమని చెప్పబడుచున్నది దీనికి విపరీతములగు మానిత్వదంభాదులు అజ్ఞానము, జ్ఞాన ప్రతిబంధకమగుట వలన, సర్వథా త్యాజ్యములు.

శ్లో॥ జ్ఞేయంయత్తత్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వాఽమృత మశ్నుతే,
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నా సదుచ్యతే. 13

యేది తెలుసుకొనదగినదో, యెద్దానిని యెరిగిన అమరత్వము అను మోక్షమును పొందునో దానిని చెప్పెదను. అది ఆదిరహితము పరబ్రహ్మము, సత్ శబ్దగోచరముకాదు. అసత్ ప్రత్యయ గోచరమునుకాదు అని చెప్పబడుచున్నది.

శ్లో॥ సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్.
సర్వత శ్శ్రుతిమ ల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి. 14

సర్వత్ర హస్తపాదములుకలది. సర్వత్ర కన్నులు, తలలు, నోరు కలది, అది బ్రహ్మము ఇహలోకమున సమస్తమును వ్యాపించి వెలయుచున్నది.

శ్లో॥ సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియ వివర్జితమ్,
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణ భోక్తృచ. 15

అది ఇంద్రియ వ్యాపారములనన్నిటియందును ప్రకాశించుచున్నది. కాని యెట్టి ఇంద్రియమును లేనిది. సంగరహితము. అన్నిటికిని ఆధారము. త్రిగుణ రహితముగా వున్నను గుణముల పాలించును.

శ్లో॥ బహిరన్తశ్చ భూతానా మచరం చర మేవచ.
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికేచ తత్. 16

మరియు అది చరాచర భూతముల బయటను లోపలను గూడనున్నది. స్థావరము జంగమము కూడ అగుచున్నది సూక్ష్మముగుట వలన అది తెలియబడకున్నది. విషయ బుద్ధులకు దూరమున నున్నది మరియు శుద్ధ చిత్తులకు దగ్గరనేయున్నది.

శ్లో॥ అవిభక్తఞ్చ భూతేషు విభక్త మివ చ స్థితమ్,
భూతభర్తృచ తద్జ్ఞేయం గ్రసిష్ణుప్రభవిష్ణు చ. 17

ఆ బ్రహ్మము సర్వ భూతములలో కారణ స్వరూపమున అభిన్నమే యైనను, కార్య స్వరూపమున భిన్నమైన దానివలె వెలయుచున్నది. ఇదియే భూతముల నన్నిటిని స్థితికాలమున పోషించుచున్నది. ప్రళయకాలమున సంహరించుచున్నది. సృష్టికాలమున ప్రసరించుచున్నది.

శ్లో॥ జ్యోతిషా మపి తజ్జ్యోతిస్తమసః పర ముచ్యతే,
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య నిష్ఠితమ్. 18

ఇది ఆదిత్యాది జ్యోతిస్సమూహమును గూడ ప్రకాశింపజేయుచున్నది. అజ్ఞానాంధకారముచే తాకబడనిది అని చెప్పబడుచున్నది. ఇదియే బుద్ధి వృత్తుల అభివ్యక్తమగు జ్ఞానము. రూపాది ఆకారముల తెలియుపడు జ్ఞేయము అమానిత్వాది సాధనలచే తెలియబడునది. ఇది అందరి హృదయముల అంతర్యామిగ వెలయుచున్నది.

శ్లో॥ ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయంచోక్తం సమాసతః,
మద్భక్త ఏత ద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే. 19

ఇట్లు క్షేత్రము జ్ఞానము జ్ఞేయమును సంక్షేపముగ చెప్పబడినవి నా భక్తుడు యీ మూడు తత్వములను గ్రహించి నా స్వరూపమగు బ్రహ్మమును బొందు సమర్థుడగును.

శ్లో॥ ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి,
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సమ్భవాన్. 20

ప్రకృతి పురుషుల నిర్వురిని గూడ అనాదియని గ్రహింపుము శరీరేంద్రియ రూపములగు వికారములును సుఖదుఃఖమోహాదులగు గుణపరిణామములును ప్రకృతి నుండి గల్గినవి అని గ్రహింపుము.

శ్లో॥ కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే,
పురుషస్సుఖ దుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే. 21

ఈశ్వరుని త్రిగుణాత్మకమగు మాయాశక్తి దేహేంద్రియము లను సృష్టించుచున్నది. జీవుడు సుఖదుఃఖము లను భోగించుచున్నాడు అని చెప్పబడుచున్నది.

శ్లో॥ పురుషః ప్రకృతిస్థోహి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్,
కారణం గుణ సఙ్గోఽస్య స దసద్యోనిజన్మసు. 22

భోక్తయగు జీవుడు ప్రకృతియందు వెలయుచు సుఖదుఃఖ మోహాకారముల అభివ్యక్తములగు గుణ సమూహములను భోగించు చున్నాడు. ఈ గుణశక్తియే జీవుని దేవ మనుష్య పశుదన్మముల గ్రహింపజేయుచున్నది.

శ్లో॥ ఉపద్రష్టాఽనుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః,
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః 23

అతడు యీ శరీరమున పరమ పురుషుడు, స్వతంత్రుడు, సాక్షి అనుగ్రహకుడు, పాలకుడు, భోగించువాడు, పరమేశ్వరుడు, పరమాత్మ అని చెప్పబడును.

శ్లో॥ య ఏవం వేత్తి పురుషం ప్రకృతించ గుణైస్సహ,
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే. 24

యెవడు బ్రహ్మమును సాక్షాత్తుగ ఆత్మభావమున తెలిసికొను చున్నాడో, మరియు వికారయుక్తమగు ప్రకృతిని గ్రహించునో, అతడు సర్వభావముల సర్వావస్థల వెలయుచున్నను మరల జన్మింపడు.

శ్లో॥ ధ్యానే నాత్మని పశ్యన్తి కేచిదాత్మానమాత్మనా,
అన్యేసాఙ్ఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే. 25

కొందరు ధ్యానమువలన బుద్ధియందు, కొందరు శుద్ధాంతఃకర ణము ద్వారా చైతన్యమును దర్శించుచున్నారు. ఇతరులు జ్ఞానయో గమువలనను, తదితరుల కర్మయోగము వలనను దర్శన మొనర్చు చున్నారు.

శ్లో॥ అన్యే త్వేవ మజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే,
తేఽపిచాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః 26

కొందరీయాత్మ తత్వమును ఎరుంగజాలక గురూపదేశము నంది వుపాసించుచున్నారు. వీరు కూడా గురూపదేశమున నిష్ఠాత్ములై మృత్యుమయమగు సంసారమును అతిక్రమించుచున్నారు.

శ్లో॥ యావత్సంజాయతే కిఞ్చి త్సత్త్వం స్థావరజఙ్గమమ్,
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్తద్విద్ధి భరతర్షభ. 27

అర్జునా! స్థిరచరరూపమగు వస్తువు యేదైనను పుట్టుచున్నదో అది క్షేత్రక్షేత్రజ్ఞుల కూడికవలన అని గ్రహింపుము.

శ్లో॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్,
వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి. 28

సర్వభూతములలో సమానముగ వెలయుచున్నవాడును నశ్వరమగు వస్తువులతో నశింపక వెలయువాడును అగు పరమేశ్వరుని యెవడు చూచునో అతడు యదార్థదర్శి.

శ్లో॥ సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్,
న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాంగతిమ్. 29

యెల్లయెడల అంతటను సమానముగ వెలయుచున్న పరమాత్మను చూచుచున్న వ్యక్తి తన్ను తాను హింసించుకొనడు. కనుక మోక్షమును పొందును

శ్లో॥ ప్రకృత్యైవచ కర్మాణి క్రియమాణాని సర్వశః,
యః పశ్యతి తథాఽత్మాన మకర్తారం స పశ్యతి. 30

మనో వాక్కాయ కృతములగు కర్మముల నన్నిటిని దేహేంద్రియాకారముగ పరిణమించిన ప్రకృతియే సర్వ ప్రకారముల నొనర్చుచున్నదనియు, ఆత్మ సర్వోపాధివినిర్ముక్తుఁడనియు గ్రహించునతడు యదార్థ దర్శి.

శ్లో॥ యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి,
తత ఏవచ విస్తారం బ్రహ్మసమ్పద్యతే తదా. 31

యోగియెప్పుడు వివిధములగు భూతముల వునికిని ఆత్మయందు దర్శించునో, మరియు ఆ ఆత్మనుండియే భూతముల వుత్పత్తి యని గ్రహించునో, అప్పుడతడు బ్రహ్మస్వరూపుడగును

శ్లో॥ అనాదిత్వాన్నిర్గుణత్వాత్పరమాత్మాఽయమవ్యయః,
శరీరస్థోపి కౌన్తేయ న కరోతి న లిప్యతే. 32

లేక యోగి యెప్పుడు ఈ భేదదృష్టి అంతయు ప్రళయకాలమున యేకమై ఈశ్వర శక్తియగు ప్రకృతి యందు వెలయుచు మరల సృష్టి సమయమున వెలికివచ్చుచున్నది. ఇదంతయును దాని విస్తృతియే అని గ్రహించునో, అప్పుడు అభేద దర్శనముగ అతడు బ్రహ్మమేయగును.

శ్లో॥ యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే,
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే. 33

సర్వవ్యాపకమగు ఆకాశము సూక్ష్మముగుటవలన యేరీతిగ అంటబడదో అట్లే వివిధ శరీరముల వెలయుచున్నను ఆత్మనిర్లిప్తము.

శ్లో॥ యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః,
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత. 34

అర్జునా! ఒక్కడగు సూర్యుడు యీ సమస్తమగు జగతును యేరీతిగ ప్రకాశింపజేయుచున్నాడో అట్లే పరమాత్మ సమస్తమగు శరీరమును మహాభూతములను జగతును ప్రకాశింప జేయుచున్నాడు.

శ్లో॥ క్షేత్రక్షేత్రజ్ఞయోరేవమన్తరం జ్ఞానచక్షుషా,
భూతప్రకృతిమోక్షంచ యేవిదుర్యాన్తి తే పరమ్. 35

యెవరు యీ రీతిగ క్షేత్రక్షేత్రజ్ఞుల ప్రభేదమును, మరియు భూతసమూహమునకుచెందిన అవిద్యా లక్షణమగు ప్రకృతియొక్క మిథ్యాత్వమును జ్ఞాననేత్రమున యెరుగుదురో వారు పరబ్రహ్మమును పొందుచున్నారు.

క్షేత్రక్షేత్రజ్ఞయోగమను పదమూడవ అధ్యాయం సమాప్తం



# అస్పర్శయోగము అనే
# శ్రీ మద్భగవద్గీత
## రాజయోగీయము
### చతుర్దశాధ్యాయము
### *గుణత్రయవిభాగయోగము*

శ్రీ భగవానువాచ :

శ్లో॥ పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమమ్,
యద్ జ్ఞాత్వా మునయ స్సర్వే పరాం సిద్ధి మితో గతాః 1

కృష్ణుడు పల్కెను. జ్ఞానములన్నిటిలో శ్రేష్ఠమును పరమార్థ విషయమును అగు జ్ఞానమును దేనిని గ్రహించి మునులు అందరును యీ శరీరమునుండి విడబడి మోక్షరూపమను సిద్ధిని పొందిరో దానిని మరల చెప్పెదను,

శ్లో॥ ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః,
సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ. 2

యీ జ్ఞానమును అనుష్ఠించి నా స్వరూపమును పొందినవారు సృష్టికాలమున కూడ పుట్టరు. ప్రళయకాలమున దుఃఖమును పొందరు.

శ్లో॥ మమ యోని ర్మహ ద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధా మ్యహమ్,
సమ్భవ స్సర్వభూతానాం తతో భవతి భారత. 3

అర్జునా! త్రిగుణాత్మిక యగు ప్రకృతి నాకు గర్భస్థానము దాని యందు నేను సృష్టి బీజమును వుంచుచున్నాను. అందువలన సర్వ భూతముల వుత్పత్తి అగుచున్నది.

శ్లో॥ సర్వయోనిషు కౌన్తేయ! మూర్తయ స్సమ్భవన్తి యాః,
తాసాం బ్రహ్మ మహ ద్యోని రహం బీజప్రదః పితా. 4

అర్జునా! దేవ, పితృ, మనుష్య, పశు యోనులలో యే దేహములు కలుగుచున్నవో వానికి జనని త్రిగుణాత్మకయగు ప్రకృతి నేను బీజము నొసగెడి జనకుడను.

శ్లో॥ సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతిసమ్భవాః,
నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయమ్. 5

అర్జునా! సత్వము రజస్సు తమము అని ప్రకృతి జాతములగు త్రిగుణములు నిర్వికారమగు ఆత్మను శరీరమున బంధించుచున్నవి

శ్లో॥ తత్ర సత్త్వం నిర్మలత్వాత్ప్రకాశక మనామయమ్,
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చానఘ 6

అనఘా! సత్వగుణము నిర్మలమును శాంతమును ప్రకాశ స్వభావమును అయియున్నది. ఇది జ్ఞానశక్తిని సుఖాసక్తిని గలిగించి ఆత్మను బంధించు దానివలెనున్నది.

శ్లో॥ రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసఙ్గసముద్భవమ్,
త న్నిబధ్నాతి కౌన్తేయ! కర్మసఙ్గేన దేహినమ్. 7

అర్జునా! రజోగుణము ఆసక్తికి మూలమై తృష్ణను పెంపొంద చేయుచున్నది. ఇది జీవునకు వివిధములగు కర్మముల యందనురాగమును కలిగించి వివిధములను ఫలములను బొందవలెనను ఆశను పురిగొల్పి బంధించుదానివలెనున్నది.

శ్లో॥ తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్,
ప్రమాదాలస్య నిద్రాభిస్తన్నిబధ్నాతి భారత. 8

భారతా! తమోగుణము ఆవరణశక్తి ప్రధానమగు ప్రకృతి అంశమునుండి పుత్పన్నమై దేహధారులందరికిని మోహమును కలిగించుచున్నది. అని గ్రహింపుము. ఇది మరుపు, మత్తు, నిద్ర యను వానివలన ఆత్మను శరీరమున బంధించుదానివలెనున్నది.

శ్లో॥ సత్త్వం సుఖే సఞ్జయతి రజః కర్మణి భారత!
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సఞ్జయత్యుత. 9

అర్జునా! సత్త్వగుణము జీవుని సుఖముతో కలుపుచున్నది. రజోగుణము కర్మాచరణము చేయించుచున్నది. మరియు తమోగుణము జ్ఞానమును అణచి పొరపాటును కలిగించి బంధించుచున్నది.

శ్లో॥ రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత!
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా 10

భారతా! సత్త్వగుణము రజస్తమములను ఆక్రమించి ప్రబలమగుచున్నది. రజోగుణము సత్త్వతమములను తిరస్కరించి ప్రాధాన్యము నందుచున్నది. తమోగుణము సత్త్వరజములను పరాభవించి పైకి వచ్చుచున్నది.

శ్లో॥ సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే,
జ్ఞానం యదా తదా విద్యాద్వివృద్ధం సత్త్వమిత్యుత. 11

యెప్పుడు శరీరద్వారములగు శ్రోత్రాదులయందు శబ్దాదిజ్ఞానాత్మకమగు ప్రకాశము కలుగుచున్నదో లేక అశబ్దాదుల సుఖము పరిలక్షితమగుచున్నదో అప్పుడు సత్త్వగుణము వృద్ధినిజెందినది అని తెలిసికొనవలెను.

శ్లో॥ లోభః ప్రవృత్తిరారమ్భః కర్మణామశమః స్పృహా,
రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ. 12

అర్జునా! ధనము పెక్కు రీతుల లభించుచున్నను ఇంకను కావలయుననెడి అభిలాష (లోభము) యెల్లప్పుడును యేదో ఒక పని నొనర్చుచుండుట (ప్రవృత్తి) పెద్దవియగు మేడలను, మిద్దెలను కట్టుటను బోలు ప్రయత్నములు (కర్మముల నారంభించుట) యీ పని ముగించి ఆ పనిని ప్రారంభించుట, ఇట్టి సంకల్పవికల్పములు శాంతిం

పకుండుట (అశాంతి), ఏమి వస్తువునైనను చూచినతోడనే కోరుట (స్పృహా) అనునవి రజోగుణము వృద్ధిపొందిన కలుగుచున్నవి. ఈ చిహ్నములున్న యెడల రజోగుణము ప్రబలమైనది అని గ్రహింపుము.

శ్లో॥ అప్రకాశో ప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవచ,
తమ స్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన 13

అర్జునా అవివేకము ప్రయత్నశూన్యత కర్తవ్యము నెడల ఔదాసీన్యము మూఢత్వము అనునవి, తమోగుణము వృద్ధినందిన కలుగుచున్నవి. ఇవి తమోవృద్ధి సూచకములు అని గ్రహింపుము.

శ్లో॥ యదా సత్త్వే ప్రవృద్ధేతు ప్రళయం యాతి దేహభృత్,
తదోత్తమవిదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే. 14

సత్త్వవృద్ధి కాలమున దేహత్యాగ మొనర్చిన మనుష్యుడు హిరణ్యగర్భాది వుపాసకులకు లభించు ప్రకాశమయ లోకములను బొందుచున్నాడు.

శ్లో॥ రజసి ప్రళయం గత్వా కర్మసఙ్గిషు జాయతే,
తథా ప్రలీన స్తమసి మూఢ యోనిషు జాయతే. 15

రజోగుణము ప్రబలమైన స్థితిలో మరణించిన, కర్మాసక్తుడగు మనుష్యలోకమున జన్మించుచున్నాడు. అట్లే తమోగుణము వృద్ధి నందినప్పుడు చనిపోయిన యెడల పశ్వాది మూఢయోనుల పుట్టుచున్నాడు.

శ్లో॥ కర్మణస్సుకృతస్యాహు స్సాత్త్వికం నిర్మలంఫలమ్,
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్. 16

సాత్త్విక కర్మముల ఫలము నిర్మల సుఖమనియు రాజసిక కర్మల ఫలము దుఃఖమనియు, తామసిక కర్మముల ఫలము అజ్ఞానమనియూ శిష్టులు చెప్పుచున్నారు.

శ్లో॥ సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభఏవచ,
ప్రమాదమోహౌ తమసో భవతో౽జ్ఞానమేవచ. 17

సత్త్వగుణమునుండి జ్ఞానము కలుగుచున్నది. రజోగుణమునుండి లోభముకలుగుచున్నది. తమస్సునుండి అవివేకము, కర్తవ్య ఔదాసీన్యము, విమూఢత్వమును కలుగుచున్నవి.

శ్లో॥ ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః,
జఘన్యగుణవృత్తిస్థా అధోగచ్ఛన్తి తామసాః. 18

సాత్త్వికులు మనుష్య లోకమునుండి దేవలోకమునకు పోవుచున్నారు. రాజసికులు మనుష్య లోకమున వుందురు. నీచగుణయుక్తులగు తామసికులు నరకలోకమును పొందుదురు.

శ్లో॥ నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి,
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సో౽ధిగచ్ఛతి. 19

ద్రష్టయగు జీవుడెప్పుడు వివేకమును గణించి గుణములకంటె వేరగు కర్తను చూడడో, మరియు ఈ గుణ వ్యాపారములకు అతీతుడై సాక్షిగానున్న ఆత్మను దర్శించునో అప్పుడతడు నా భావమును బొందును.

శ్లో॥ గుణానేతా నతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్,
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తో౽మృతమశ్నుతే. 20

దేహోత్పత్తికి కారణములగు ఈ గుణత్రయమునతిక్రమించిన జీవుడు, జనన మరణ జరాదుఃఖములనుండి విడివడి అమృతత్వమును బొందుచున్నాడు.

అర్జున ఉవాచ :

శ్లో॥ కైర్లిఙ్గైస్త్రీన్ గుణానేతా నతీతో భవతి ప్రభో!
కిమాచారః కథంచైతాం స్త్రీన్ గుణా నతివర్తతే. 21

అర్జునుడు ప్రశ్నించెను. ప్రభూ! గుణాతీత పురుషుని లక్షణ మేమి. అతని ఆచరణ యెట్లుండును? ఈ గుణముల నతిక్రమించుట యెట్లు?

శ్రీ భగవానువాచ :

శ్లో॥ ప్రకాశంచ ప్రవృత్తించ మోహమేవచ పాణ్డవ,
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాఙ్క్షతి. 22

శ్రీకృష్ణుడుపల్కెను. అర్జునా! సత్వగుణ ధర్మమును, రజోగుణ ధర్మమును తమోగుణధర్మమును. ఆవిర్భవించిన యెవడు ద్వేషింపకుండునో, అవి తొలగిన కోరకుండునో, అతడు గుణాతీతుడని చెప్పబడును,

శ్లో॥ ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే.
గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే 23

యెవడు తటస్థునివలె నొప్పుచు గుణములవలన చలింపబడడో గుణములు స్వకార్యముల వర్తిల్లుచున్నవి, అని ఇట్లు గ్రహించి యెవడు వెలయుచుండునో, మరిచలింపడో, అతడు గుణాతీతుడు,

శ్లో॥ సమదుఃఖసుఖస్స్వస్థ స్సమలోష్టాశ్మకాఞ్చనః,
తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిన్దాత్మసంస్తుతిః, 24

శ్లో॥ మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః,
సర్వారమ్భ పరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే 25

సుఖదుఃఖముల సమబుద్ధియైనను. ఆత్మస్వరూపస్థితుడును శిలా మృత్పిండసువర్ణములల సమదృష్టియును, ప్రియాప్రియములల తుల్యజ్ఞాన మును. నిందా ప్రశంసల నొకే రీతిగ గ్రహించువాడును అగు ధీరుడు గుణాతీతుడు.

మానావమానముల యెడను శత్రుమిత్రుల యెడను. సమబుద్ధి నుంచువాడును. దృష్టాదృష్ట ఫలదాయకములగు కర్మలన్నిటిని త్యజిం చినవాడును, అగు పురుషుడు త్రిగుణాతీతుడని చెప్పబడును.

శ్లో॥ మాంచ యోఽవ్యభిచారేణ భక్తియోగేణ సేవతే,
సగుణాంత్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే. 26

యెవడు ఏకాంతికమగు భక్తితో సర్వభూత హృదయ స్థితుడ నగు నన్ను వుపాసించుచున్నాడో, అతడు గుణముల నతిక్రమించి బ్రహ్మ భావమునొందు సమర్థుడగుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మణోహి ప్రతిష్ఠాఽహ మమృతస్యావ్యయస్యచః,
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్యచ. 27

యేలయన నేను వికార రహితుడను వినాశరహితమును, నిత్యమును జ్ఞానయోగ ధర్మప్రాప్యమును అవ్యభిచారసుఖస్వరూపమును, అగు బ్రహ్మమునకు అశ్రయుడను కనుక నా భక్తులు బ్రహ్మ భావమును బొందెదరు.

చతుర్దశాధ్యాయము పూర్తి.



# అపూర్వయోగము అనే
# శ్రీ మద్భగవద్గీత
## రాజయోగీయము
### పంచదశాధ్యాయము
### పురుషోత్తమప్రాప్తి యోగము

శ్రీ భగవానువాచ :

శ్లో॥ ఊర్ధ్వమూలమధశ్శాఖమశ్వత్థం ప్రాహురవ్యయమ్,
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్. 1

శ్రీ కృష్ణుడు పల్కెను. ఈ సంసార వృక్షమునకు కారణము వూర్ధ్వముననున్నది. దీని శాఖలు క్రిందుగ నున్నవి. కర్మకాండరూపములగు వేదములు దీని పత్రములు. అనాదియును క్షణికమును అగు ఈ సంసారము వేదశాస్త్ర పురాణములలో మాయామయ వృక్షమని చెప్పబడియున్నది. యిట్టిసంసార వృక్షమును తెలిసికొనినవాడే వేదజ్ఞుడు.

శ్లో॥ అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయ ప్రవాళాః,
అధశ్చ మూలాన్యనుసన్తతాని
కర్మానుబన్ధీని మనుష్యలోకే. 2

యీ సంసార వృక్షముయొక్క శాఖా సమూహములగుజీవులు గుణత్రయమువలన పరిపుష్టినందుచు రూపరసాదులగు విషయ పల్లవములతోగూడి వూర్ధ్వాధో దేశముల వ్యాపించియున్నవి. కాని మనుష్య లోకముననే ధర్మాధర్మ జనకములగు దీని మూల సమూహములు క్రిందుగ పాదుకొనియున్నవి అనగా కర్మాచరణయందు కేవలము మనుష్యులకే అధికారముండుటచేతను, సుకృతులగు దేవయోనులయందును. మనుష్యులనుండి బ్రహ్మవరకుగల జీవులయందు జన్మించుట, మనుష్యులనుండి పశ్వాదియోనులయందు స్థావరపర్యంతముగల నిమ్న యోనుల జన్మించుట మనుష్యలోకముననేయని చెప్పబడినది. గనుక లింగదేహము వాసనల కాశ్రయము.

శ్లో॥ నరూప మస్యేహ త థోపలభ్యతే
నాన్తో నచాదిర్న చ సంప్రతిష్ఠా,
అశ్వత్థ మేనం సువిరూఢమూల
మసఙ్గశ స్త్రేణ దృఢేన ఛిత్త్వా. 3
తతః పదం త త్పరిమార్గితవ్యం
యస్మిన్ గతా న నివర్తన్తి భూయః,
త మేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ 4

ఇహలోకమున ప్రాణులు ఈ సంసార రూపమగు అశ్వత్థము యొక్క స్వరూపమును వెనుక చెప్పబడిన రీతిగా తెలిసికొనజాలకున్నారు. దీనికి ఆరంభము లేదు. అనాది దీనికి అంతము లేదు. దీని స్థితిని ఇది యెట్లున్నదీ, తెలియజాలము ఇది ప్రామాణ్యముకాదు. ప్రతీతి మాత్రము (తోచుట) ఈ సంసారాశ్వత్థమును తీవ్ర వైరాగ్యము దృఢశస్త్రముతో ఛేదించి.

పిదప దేనిని బడసిన మరల ఈ సంసారమునకు వచ్చుట యనునది లేదో ఆపరమును అన్వేషింపవలయును. యెవని నుండి అనాదియగు ఈ సంసార ప్రవాహము నిర్గతమైనదో నేను ఆ ఆదిపురుషుని శరణు జొచ్చుచున్నాడను.

శ్లో॥ నిర్మానమోహా జితసఙ్గదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః,
ద్వన్ద్వైర్విముక్తా స్సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛన్త్యమూఢాః పద మవ్యయ న్తత్. 5

అహంకారము అవివేకము లేనివారును, ఆసక్తియను దోషమును జయించిన వారును పరమాత్మ జ్ఞాననిష్ఠులును నిష్కాములును

సుఖదుఃఖములను ద్వంద్వములనుండి విడివడినవారును అగు స్వచ్ఛందులు అక్షయమగు ఆస్థానమును పొందుచున్నారు.

శ్లో॥ నతద్భాసయతే సూర్యో నశశాంకో న పావకః,
యద్గత్వా ననివర్తన్తే తద్ధామ పరమం మమ. 6

ఏ పదమును పొందిన తిరిగి రారో దానిని రవి ప్రకాశింప జేయజాలడు చంద్రుడుగాని అగ్నిగాని ప్రకాశింప జేయజాలరు. అది నా శ్రేష్ఠమగు పదము.

శ్లో॥ మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః,
మనష్షష్ఠా నీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి. 7

నా అంశమే లోకమున కర్తయును భోక్తయును అగు జీవుడుగా ప్రసిద్ధి. ఇతడే సుషుప్తి ప్రళయకాలముల ప్రకృతియందు లీనమైన ఇంద్రియ పంచకమును మనస్సును మరల సంసారోపభోగార్థము ఆకర్షించుచున్నాడు.

శ్లో॥ శరీరంయదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః.
గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధానివాశయాత్. 8

దేహాది సంఘాతమునకు స్వామి యనగా జీవుడు ఎప్పుడు దేహమును పొందుచున్నాడో మరియు ఎప్పుడు త్యజించునో అప్పుడు వాయువు సుగంధ దుర్గంధములను గ్రహించునట్లు ఈ ఇంద్రియములను గ్రహించి వెలువడుచున్నాడు.

శ్లో॥ శ్రోత్రంచక్షుః స్పర్శనంచ రసనం ఘ్రాణమేవచ,
అధిష్ఠాయ మన శ్చాయం విషయా నుపసేవతే. 9

ఈ దేహి కర్ణమును నేత్రమును త్వక్కును జిహ్వను నాసికను మనస్సును ఆశ్రయించి రూపరసాది విషయములను భోగించుచున్నాడు

శ్లో॥ ఉత్క్రామన్తంస్థితం వాపి భుఞ్జానం వా గుణాన్వితమ్,
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః. 10

దేహాంతరమున కరుగువాడును. శరీరమున వెలయువాడును. విషయముల భోగించువాడును. త్రిగుణ పరిణామములగు సుఖదుఃఖ మోహములతో కూడువాడును అగు జీవాత్మను మూఢులెఱుంగజాల కున్నారు. ఏలయన వారి మనస్సు విషయాకర్షణవలన బహిర్ముఖ ముగనున్నది. కాని అంతర్ముఖులగు వ్యక్తులు జ్ఞాన చక్షువుతో ఆ జీవాత్మను చూడగలరు.

శ్లో॥ యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్,
యతన్తో ప్యకృతాత్మానో నైనంపశ్య న్త్యచేతసః. 11

సమాహిత చిత్తులగు యోగులు ఈ ఆత్మను స్వీయమగు బుద్ధియందు సాక్షిరూపమున వెలయువానిని చూచుచున్నారు. ప్రయత్నించుచుండినను అశుద్ధ చిత్తులగు అవివేకులు ఈ ఆత్మను దర్శింప జాలరు.

శ్లో॥ యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్,
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్. 12

సూర్యునియందుండు యే తేజస్సు విశ్వమునంతటిని ప్రకాశింప జేయుచున్నదో మరియు చంద్రుని యందున్న కాంతి యేదియో అగ్నియందున్న ప్రభ యెయ్యదియో ఆ జ్యోతిస నాదిగా తెలిసి కొనుము.

శ్లో॥ గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా,
పుష్ణామి చౌషధీస్సర్వాః సోమో భూత్వా రసాత్మకః 13

నేను ఈశ్వరీయమగు శక్తివలన పృథివిని ప్రవేశించి చరాచర ములగు భూతములను ధరించుచున్నాడను. మరియు రసస్వరూపినగు

చంద్రుడనై వ్రీహియవాదులగు ఓషధులను (పంట నొసగి యెండి పోవునవి) పోషించుచున్నాడను.

శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః,
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ 14

నేను జఠరాగ్నినై జీవుల శరీరమును ఆశ్రయించి ప్రాణాపాన వాయువులతో గూడి భక్ష్య భోజ్య లేహ్య చోష్యములను నాల్గు విధముల ఖాద్యములను పరిపాక మొనర్చుచున్నాను.

శ్లో॥ సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తస్స్మృతి ర్జ్ఞానమపోహనం చ,
వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యో
వేదాన్తకృద్వేదవి దేవచాహమ్ 15

నేను ఆబ్రహ్మస్తంభ పర్యంతముగల ప్రాణులందరియొక్కయు బుద్ధియందు ప్రతిష్ఠుడను నా నుండి జ్ఞప్తి జ్ఞానము. యీ రెంటి యొక్క విస్మృతియును కలుగుచున్నవి. వేదములు నాల్గింటిచేతను నేనే తెలిసికొనదగినవాడును వేదాంత సంప్రదాయ ప్రవర్తకుడను వేదార్థవేత్తను కూడా నేనే.

శ్లో॥ ద్వావిమౌ పురుషౌలోకే క్షర శ్చాక్షర ఏవచ,
క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే. 16

క్షరుడు అక్షరుడును అను ఈ యిరువురు పురుషులే జగత్తున ప్రసిద్ధులు వినాశియగు క్షరపురుషుడు సమస్త వికారజాతమంతయును అక్షర పురుషుడు కూటరూపమున (ఆకాశాదికము) చెప్పబడుచున్నది అనగా క్షరమునకు బీజభూతమగు మాయాశక్తి.

శ్లో॥ ఉత్తమఃపురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః,
యోలోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః. 17

క్షరాక్షరుల కంటెను వేరగు పురుషోత్తముడు పరమాత్మ యని చెప్పబడును. అక్షయమగు పరమాత్మయే లోకత్రయమున ప్రవేశించి పాలించుచున్నాడు.

శ్లో॥ యస్మాత్క్షర మతీతోఽహ మక్షరాదపిచోత్తమః,
అతోఽస్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః. 18

ఎందువలన నేను క్షరము లేక అశ్వత్థ మనబడు సంసార మాయా వృక్షమునకు అతీతుడనో, అక్షరము లేక సంసార బీజభూత మగు శక్తి కంటెను గూడ శ్రేష్ఠుడనో అందువలన లోకమునను వేదమునను పురుషోత్తముడనని ప్రసిద్ధుడనైతిని. అస్పృశ్య పద్ధతి వల్ల పురుషోత్తముడని నిర్ణయము

శ్లో॥ **యోమామేవమసమ్మూఢో** జానాతి పురుషోత్తమమ్,
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత! 19

అర్జునా ఇట్లు యెవడు అభిమాన రహితుడై పురుషోత్తమునిగా నన్ను యెరుగునో అతడు సర్వాత్మనా నన్ను భజించును. పిదప సర్వజ్ఞుడు అగును.

శ్లో॥ ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయానఘ,
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యా త్కృతకృత్యశ్చ భారత. 20

పాప రహితా, ఇట్లు ఈ అత్యంతము రహస్యమగు శాస్త్రము నాచేతను చెప్పబడినది. అర్జునా దీనిని తెలిసికొనిన బుద్ధిమంతుడు కృతార్థుడగును.

పంచదశోఽధ్యాయః సంపూర్ణః



# అస్పర్శయోగము అనే

# శ్రీ మద్భగవద్గీత

## రాజయోగీయము

### షోడశాధ్యాయము

### దైవాసురసంపద్విభాగయోగము

శ్రీ భగవా నువాచ :

శ్లో॥ అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః,
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తపఆర్జవమ్. 1

శ్రీ కృష్ణుడు పల్కెను. భయము లేకుండుట, త్రికరణశుద్ధి జ్ఞాననిష్ఠ దానము బాహ్యేంద్రియ సంయమము యజ్ఞము, బ్రహ్మయజ్ఞము తపస్సు ఋజు ప్రవర్తనము.

శ్లో॥ అహింసాసత్య మక్రోధ స్త్యాగశ్శా న్తిరపైశునమ్,
దయాభూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలమ్. 2

ప్రాణులను పీడింపకుండుట, నిజమగు దానిని చెప్పుట, కోపము వణచుకొనుట త్యాగము శాంతిః యితరుల దోషములను వెల్లడిచేయకుండుట, దయకలిగియుండుట, విషయములు ఎదుటనున్నను చలింపకుండుట, మృదుత్వము, సిగ్గుజెందునటువంటి వ్యర్థ కార్యముల నొనర్పకుండుట.

శ్లో॥ తేజః క్షమాధృతిశ్శౌచమద్రోహోనాభిమానితా,
భవన్తి సమ్పదం దైవీ మభిజాతస్య భారత. 3

ప్రతిభ, పరాభవము కలిగినను కోపము రాకుండుట, దుఃఖముల నవసాదమును జెందక ధైర్యమును వహించుట. బాహ్యాభ్యంతర శుద్ధి వైరభావము లేకుండుట యెక్కువగ పూజింపదగినవాడనను భావము లేకుండుట అనునవి అర్జునా దేవతా యోగ్యమగు (సాత్వికమగు) స్థితిని అనుసరించి పుట్టినవానికి కలుగుచున్నవి.

శ్లో॥ దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్య మేవచ,
అజ్ఞానం చాభిజాతస్య పార్థ! సంపద మాసురీమ్. 4

అర్జునా! కపటమగు ధర్మాచరణము విద్యాధన సంపదగర్వము, అతి పూజ్యత్వాభిమానము, కోపము. నిష్ఠురత్వము, అజ్ఞానము రాక్షసమగు స్థితిని అనుసరించి పుట్టినవానికి కలుగుచున్నవి.

శ్లో॥ దైవీసంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా,
మాశుచ స్సంపదం దైవీ ముపజాతోఽసి పాండవ. 5

అర్జునా. దేవయోగమగు సాత్విక సంపద ముక్తి కొరకును అసుర సంపద బంధహేతువుగను, చెప్పబడినవి. శోకింపకుము. నీవు దైవీక సంపదకు యోగ్యుడవై జన్మించితివి.

శ్లో॥ ద్వౌ భూతసర్గౌ లోకేస్మిన్ దైవ ఆసుర ఏవ చ,
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థమే శృణు, 6

అర్జునా ఈ జగత్తున దైవ స్వభావము, అసుర స్వభావమును గల రెండు విధములుగ మనుష్యులు సృష్టింపబడియున్నారు దైవీ స్వభావ సంపన్నుల విషయము విశదముగనే చెప్పితిని. ఇక అసురస్వభావయుక్తులగు వారిని గురించి చెప్పెదను వినుము.

శ్లో॥ ప్రవృత్తించ నివృత్తించ జనా నవిదు రాసురాః,
నశౌచం నాపిచాచారో నసత్యం తేషు విద్యతే. 7

అసుర స్వభావముగలవారికి ధర్మమున ప్రవృత్తి కలుగదు. అధర్మమునుండి వారు నివృత్తులవరు వారికి శౌచసత్య సదాచారము లుండవు.

శ్లో॥ అసత్య మప్రతిష్ఠంతే జగ దాహు రనీశ్వరమ్.
అపరస్పరసంభూతం కిమన్య త్కామహైతుకమ్. 8

వారు యీజగత్తును అసత్యము ధర్మాధర్మవ్యవస్థాశూన్యము, కర్మమును ఫలదాతయును అగు యీశ్వరుడు లేనిది కామవశమున స్త్రీ పురుష సంయోగమును పురస్కరించుకొని పుత్పన్నమైనది అనియు మరియు దీనికి యితర కారణము లేవియును లేవనియు చెప్పెదరు

శ్లో॥ ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః,
ప్రభవం త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః. 9

ఇట్టి నాస్తికదృష్టి నవలంబించి పరలోక సాధన చ్యుతులును కౄరకర్మలును, అపకారులును. అల్పబుద్ధులును అగు వ్యక్తులు జగత్తుయొక్క క్షయము కొరకే పుట్టుచున్నారు.

శ్లో॥ కామ మాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః,
మోహాద్గృహీ త్వా సద్గ్రాహాన్ ప్రవర్తంతేఽశుచివ్రతాః. 10

అపరిమితమగు కామము నాశ్రయించి అవివేకముతో అశుభ నిశ్చయములు గలవారై అపవిత్రములగు వ్రతముల నొనర్చుచున్నారు.

శ్లో॥ చింతా మపరిమేయాం చ ప్రళయాంతా ముపాశ్రితాః,
కామోపభోగపరమా ఏతావ దితి నిశ్చితాః 11

వారు మృతినందు వరకు మొనలేని చింతను బొందుచు కామ భోగమే పరమ పురుషార్థముఅనియు దానికి మించినదేమియు లేదనియు నమ్మెదరు.

శ్లో॥ ఆశాపాశశతై ర్బద్ధాః కామక్రోధ పరాయణాః
ఈహంతే కామ భోగార్థ మన్యాయేనార్థసంచయాన్. 12

వారు అసంఖ్యములగు ఆశాపాశముల బద్ధులై కామక్రోధము లకు లోబడి విషయ భోగముల ననుభవింప అసదుపాయముల నవలంబించి ధనమును కూడబెట్ట యత్నింతురు.

శ్లో॥ ఇదమద్య మయాలబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్,
ఇద మస్తీద మపిమే భవిష్యతి పునర్ధనమ్. 13

నేడు నాకిది లభించినది. యీ మనోరథము ముందు చేకూరగలదు ఈ ధనము నాకున్నది ఇంతె ధనము రాగలదు.

శ్లో॥ అసౌ మయా హతశ్శత్రు ర్హనిష్యే చాపరానపి.
ఈశ్వరోహ మహంభోగీ సిద్ధోహం బలవాన్ సుఖీ. 14

ఈ శత్రువును చంపితిని, మిగిలిన వారిని గూడా చంపుదును. నేను ప్రభుడను, భోగిని; పురుషార్థ సంపన్నుడను, బలవంతుడను, సుఖవంతుడను.

శ్లో॥ ఆఢ్యోభిజనవా నస్మి కోన్యోస్తి సదృశో మయా,
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞాన విమోహితాః. 15

నేను ధనవంతుడను, సత్కుల జాతుడను నాకు సమ డెవ్వడు. యజ్ఞము నొనర్తును. దాన మిచ్చెదను ఆనందింతును అని అవివేక మోహితులై.

శ్లో॥ అనేక చిత్త విభ్రాంతా మోహజాల సమావృతాః.
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ. 16

పెక్కు సంకల్పములతో చిత్తము విక్షిప్తమునంద మోహజాలముల తగుల్కొని విషయ భోగముల యందాసక్తులై అపవిత్రములగు నరకముల బడుచున్నారు,

శ్లో॥ ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః,
యజంతే నామ యజ్ఞైస్తే దంభేనా విధిపూర్వకమ్. 17

వారు ఆత్మశ్లాఘులై తమ గొప్పతనము తామే చెప్పుకొనుచు ఐశ్వర్య మద గర్వమునందుచు డంబముతో శాస్త్రవిధి నుల్లంఘించుచు. పేరునకు మాత్రమే యగు యజ్ఞముల నొనర్చుచున్నారు.

శ్లో॥ అహంకారం బలందర్పం కామంక్రోధం చసంశ్రితాః,
మామాత్మ పరదేహేషు ప్రద్విషంతోభ్యసూయకాః. 18

వారు సర్వానర్థములకును సర్వదోషములకును మూలమగు అహంకారమును, పరపీడాకారమగు బలమును, ధర్మోల్లంఘనకారణమగు దర్పమును, స్త్రీ విషయమగు కామమును ఆశ్రయించి తమ యొక్కయు ఇతరుల యొక్కయు, శరీరముల బుద్ధికిని, కర్మలకును సాక్షినై వెలయుచున్న నన్ను (ఆత్మను) ద్వేషించుచున్నారు. నా శాసనము నతిక్రమించుచున్నారు, మరియు సన్మార్గ వర్తనులగు వారి గుణముల నిందించుచున్నారు.

శ్లో॥ తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్,
క్షిపామ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు 19

విద్వేషులును, క్రూరులును, కుకర్ములును అగువారికి మరల మరల అసుర జన్మలనే కలుగజేయుచున్నాడను.

శ్లో॥ ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని,
మా మప్రాప్యైవ్య కౌంతేయ తతో యాంత్యధ మాంగతిమ్.

అర్జునా! ఇట్టి మూఢులు ప్రతి జన్మమున అసుర శరీరమునే పొందుచు నన్ను పొందక సన్మార్గ విముఖులై క్రమముగా అధోగతిని, క్రిమి కీటాది జన్మములను బొందుచున్నారు.

శ్లో॥ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః,
కామః క్రోధ స్తథా లోభ స్తస్మాదేతత్త్రియంత్యజేత్.

కామ క్రోధ లోభములు మూడును నరక ద్వారములు. ఇవి ఆత్మను అధోగతి నందజేయుచున్నవి ఆత్మ వినాశకరములగు ఈ ద్వారముల ప్రవేశించిన మనుష్యుడు పురుషార్థమున కయోగ్యుడగును. కనుక ఈ మూడింటిని త్యజించుట వుచితము.

శ్లో॥ ఏతై ర్విముక్తః కౌంతేయ తమోద్వారై స్త్రిభిర్నరః
ఆచరత్యాత్మనశ్శ్రేయస్తతో యాతిపరాంగతిమ్. 22

కౌంతేయా. యీ ద్వారములనుండి వెలువడిన మనుజుడు. స్వీయ కల్యాణ సాధనములను ఆచరించి తత్ఫలముగ మోక్షమును బడయుచున్నాడు.

శ్లో॥ యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
నస సిద్ధి మవాప్నోతి నసుఖం నపరాం గతిమ్ 23

యెవడు వేద విహిత ధర్మముగు విధి నిషేధములను పాలింపక యథేచ్ఛగ ప్రవర్తిల్లునో అతడు తత్వజ్ఞానమునుగాని, శాంతిని గాని మోక్షమునుగాని బొందడు.

శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ,
జ్ఞాత్వాశాస్త్ర విధానోక్తం కర్మ కర్తు మిహార్హసి, 24

కనుక కర్తవ్యా కర్తవ్య విషయ నిర్ధారణ మొనర్ప నీకు శాస్త్ర మొక్కటియే వుపదేష్ట. స్వకల్పనలు కావు అందువలన శాస్త్రీయముగు విధి నిషేధముల స్వరూపమును నీ అంతఃకరణము నందు నిర్ణయించి కర్మాధికారివి యగు నీవు యథాధికారము కర్మము నొనర్ప దగుదువు. అనగా కర్మము నొనర్ప యోగ్యుడవగుదువు.

సంపూర్ణము.

# అస్పర్శయోగము అనే
# శ్రీ మద్భగవద్గీత
## రాజయోగీయము
### సప్తదశాధ్యాయము
### శ్రద్ధాత్రయ విభాగయోగము

అర్జున ఉవాచ :

శ్లో॥ యేశాస్త్రవిధిముత్సృజ్యయజంతే శ్రద్ధయాన్వితాః,
తేషాంనిష్ఠాతుకాకృష్ణ సత్త్వమాహోరజస్తమః 1

అర్జునుడు ప్రశ్నించెను. కృష్ణా ఆత్మ వినా అర్చించదగినది యేదియు లేదని శృతి స్మృతులయందు నిర్ణయించియుండగ అవిధానమును పరిత్యజించి శ్రద్ధాయుక్తులై దేవతలనుఅర్చించుచున్నారో వారి నిష్ఠ యెట్టిది. సాత్వికమా, రాజసికమా, తామసికమా.

శ్లో॥ త్రివిధాభవతి శ్రద్ధా దేహినాం సాస్వభావజా,
సాత్త్వికీ రాజసీచైవ తామసీ చేతితాం శృణు. 2

శ్రీ కృష్ణుడు పల్కెను మనుష్యులకు సత్వగుణ ప్రధానము రజోగుణ ప్రధానము, తమోగుణ ప్రధానమును అని మూడు విధములుగ శ్రద్ధ కలుగుచున్నది. ఆ శ్రద్ధ పూర్వ జన్మమునందలి ధర్మ సంస్కారము ననుసరించి ఉత్పన్నమగును. దానిని గురించి వినుము.

శ్లో॥ సత్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత,
శ్రద్ధామయోయం పురుషోయోయచ్ఛ్రద్ధస్సఏవసః 3

అర్జునా మనుష్యులందరికిని వారివారి అంతఃకరణ సంస్కారమునను సరించియే శ్రద్ధ కలుగుచున్నది. మనుష్యుడు శ్రద్ధామయుడు పూర్వ జన్మమున యెవనికెట్టి శ్రద్ధయుండెనో అతడు వర్తమాన జన్మమున అట్టి స్వభావమునే పరిగ్రహించుచున్నాడు.

శ్లో॥ యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః,
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజంతే తామసా జనాః. 4

సాత్త్వికులు దేవతలను పూజించుచున్నారు. రాజసికులు యక్షులను రాక్షసులను పూజించుచున్నారు. తామసికులు ప్రేతములను భూతములను పూజించుచున్నారు.

శ్లో॥ అశాస్త్ర విహితం ఘోరం తప్యంతే యే తపో జనాః,
దంభాహంకారసంయుక్తాః కామరాగ బలాన్వితాః 5

శ్లో॥ కర్శయంతశ్శరీరస్థం భూతగ్రామమచేతసః,
మాంచైవాంతశ్శరీరస్థం తాన్ విద్ధ్యాసుర నిశ్చయాన్. 6

దంభాహంకార యుక్తులును కామరాగ బలాన్వితులును అవివేకులగు జనులు శరీరమునందలి యింద్రియ సమూహమును, బుద్ధికి సాక్షియగు నన్ను కష్టపెట్టుచు, శాస్త్ర విరుద్ధమగు తపస్సును, తమకును ఇతరులకును గూడ పీడాకరముల కర్మపద్ధతులు వుపవాసాదులు మొనర్చుచున్నారు. వారిని అసుర స్వభావులని తెలిసికొనుము.

శ్లో॥ ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః
యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేదమిమం శృణు. 7

యీ త్రివిధ జనులకు ఆహారము కూడ సత్త్వాది గుణభేదము ననుసరించి మూడు విధములగునది ప్రియమగుచున్నది. అట్లే యజ్ఞ దాన తపములు గూడ మూడు విధములగుచున్నవి. వాని ప్రభేదమును వినుము.

శ్లో॥ ఆయుస్సత్త్వబలారోగ్య సుఖ ప్రీతివివర్ధనాః,
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః. 8

ఆయువును, వుత్సాహమును, శక్తిని, ఆరోగ్యమును, చిత్త ప్రసాదమును, సంతోషమును, విశేషముగ వృద్ధినందించునవియును

రసవంతములును, స్నేహయుక్తములును, పుష్టికరములును, మనోహరములును, అగు భక్ష్యభోజ్యములు సాత్త్వికులకు ఇష్టములు.

శ్లో॥ కట్వమ్లలవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహినః,
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః. 9

మిక్కిలి చేదు, పులుపు, ఉప్పు, వేడి, కారములుగ నుండునవియును, నోరు మంటబెట్టునవియును అగు ఆహారములు రాజసులకు ప్రియములుగా నున్నవి. యివి రోగ, శోక, దుఃఖముల నొసగుచున్నవి.

శ్లో॥ యాతయామం గతరసం పూతిపర్యుషితంచయత్,
ఉచ్ఛిష్ట మపిచామేధ్యం భోజనం తామసప్రియమ్. 10

యే ఆహారము. మందపక్వము, శుష్కమును, దుర్గంధమయమును, చద్దియును, యితరులు తినగా మిగిలినదియును. నిషిద్ధమునగు ఆహారము తామసులకు ప్రియము.

శ్లో॥ అఫలాకాంక్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే,
యష్టవ్య మేవేతిమన స్సమాధాయ స సాత్త్వికః. 11

ఫలాపేక్ష రహితులగు పురుషులు యజ్ఞానుష్ఠానమే కర్తవ్యము అని నిశ్చయించుకొని వారాచరించు శాస్త్రవిధి సమ్మతమగుయజ్ఞమే సాత్త్వికము అనబడుచున్నది.

శ్లో॥ అభిసంధాయ తు ఫలం దంభార్థమపిచైవయత్,
ఇజ్యతే భరతశ్రేష్ఠ తంయజ్ఞం విద్ధి రాజసమ్. 12

అర్జునా! ఫలాకాంక్షతోడను. తన మహత్త్వమును ప్రకటించుకొనుటకు ఒనర్చబడు యజ్ఞము. రాజసమని గ్రహింపుము.

శ్లో॥ విధిహీన మసృష్టాన్నం మంత్రహీనమదక్షిణమ్,
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే. 13

శాస్త్రవిధి, అన్నదానము, మంత్రము, దక్షిణశ్రద్ధ ఇవి లేని

యజ్ఞమును తామస యజ్ఞమని చెప్పుచున్నారు.

శ్లో॥ దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచ మార్జవమ్
బ్రహ్మచర్య మహింసా చ శరీరం తప ఉచ్యతే 14

దేవతలను, బ్రాహ్మణులను, గురువులను తత్త్వవేత్తలను పూజించుట మరియు శుచిత్వము సత్ప్రవర్తనము బ్రహ్మచర్యము అహింస అనునవి శరీరముతో నొనర్పబడు తపస్సులు అని చెప్పెదరు.

శ్లో॥ అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితంచ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే 15

ఏ వాక్యము ప్రాణులకు దుఃఖమును కలిగింపనిదియో యథార్థమో, ప్రియకరమో అదియును మరియు శాస్త్రాభ్యాసమును వాచికముగు తపస్సని చెప్పబడును.

శ్లో॥ మనఃప్రసాదః సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః,
భావసంశుద్ధిరిత్యేత త్తపో మానస ముచ్యతే. 16

ప్రశాంతి, సౌమ్యభావము, మనఃసంయమము, మనోనిరోధము అంతఃకరణశుద్ధి అనునవి మనస్సుతో నిర్వర్తింపదగిన తపస్సని యందురు.

శ్లో॥ శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః
అఫలాకాంక్షిభిర్యుక్తైస్సాత్త్వికం పరిచక్షతే 17

ఫలాకాంక్షా రహితులును ఏకాగ్రచిత్తులును అగు వారు విశేషమగు శ్రద్ధను బూని పూర్వోక్తమగు వాఙ్మనఃకాయ సంబంధమగు తపస్సును ఆచరించిన అది సాత్త్వికమనబడుచున్నది.

శ్లో॥ సత్కారమానపూజార్థం తపోదంభేనచైవయత్
క్రియతేతదిహప్రోక్తం రాజసం చల మధ్రువమ్ 18

ఇతరులచే ఇతడు తపస్వి సాధువు అని ప్రశంసింపబడుటకును

నమస్కారాదులను బొందుటకును ధనాధికమును బడయుటకుగాను దంభముతో ననుష్ఠింపబడు తపస్సును రాజసికమందురు. ఇది అనిత్యము క్షణికము.

శ్లో॥ మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః
పరస్యోత్సాదనార్థంవా తత్తామస ముదాహృతమ్ 19

మూర్ఖమగు పట్టుదలతో తనకు పీడను కలిగించుకొనుటచేతనో లేక ఇతరుల వినాశమునకో యే తపస్సు యొనర్పబడుచున్నదో అది తామసికమని చెప్పుదురు.

శ్లో॥ దాతవ్య మితి యద్దానం దీయతేఽనుపకారిణే
దేశే కాలేచ పాత్రేచ తద్దానం సాత్త్వికం స్మృతం॥ 20

దాన మొనర్చుట కర్తవ్యము అను భావముతో ప్రత్యుపకారమునాశింపక విద్యా తపస్సంపన్నులగు వారికి అర్పింపబడు దానమును సాత్త్వికమందురు.

శ్లో॥ యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్యవా పునః
దీయతేచ పరిక్లిష్టం తద్దానంరాజసంస్మృతమ్ 21

ప్రత్యుపకారమునాశించియో అముష్మికఫలమునభిలషించియో లేక అనిచ్ఛాపూర్వకముగనో ఇయ్యబడు దానము రాజసికమందురు.

శ్లో॥ అదేశకాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే,
అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్ 22

అపవిత్రస్థానముల అశౌచాది స్థితులలో అయోగ్యులగు విటనటాదులకు పాదప్రక్షాళన ప్రియవచనాది సత్కారముల నొనర్పక తిరస్కార భావముతో నొనర్పబడు దానమును తామసికమందురు.

శ్లో॥ ఓంతత్సదితినిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః
బ్రాహ్మణాస్తేన వేదాశ్చయజ్ఞావిహితాః పురా. 23

ఓం తత్ సత్ అని బ్రహ్మమునకు మూడు విధములగు నామములు చెప్పబడినవి దీనివలన బ్రాహ్మణులును, వేదములును, యజ్ఞములును ప్రాచీనకాలమున నిర్మింపబడినవి.

శ్లో॥ తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః,
ప్రవర్తంతే విధానోక్తాస్సతతం బ్రహ్మవాదినామ్ 24

అందువలన ఓం అని వుచ్చరించి వేదవాదుల శాస్త్ర విహితములగు యజ్ఞ, దాన, తపః క్రియలు యెల్లప్పుడును అనుష్టింపబడుచున్నవి.

శ్లో॥ తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపఃక్రియాః,
దానక్రియాశ్చవివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః 25

తత్ అను బ్రహ్మవాచకము నుచ్చరించి ముముక్షువులు నిష్కాములై, యజ్ఞ, దాన, తపః క్రియల నొనర్చుచున్నారు.

శ్లో॥ సద్భావేసాధుభావేచసదిత్యేతత్ప్రయుజ్యతే,
ప్రశస్తే కర్మణితథా సచ్ఛబ్దః పార్థయుజ్యతే. 26

అర్జునా! సత్తు అను అర్థమునను మంచిది అను అర్థమునను సత్ అనునది ప్రయోగింపబడుచున్నది మరియు శుభమగు కర్మమున కూడ సత్ అను శబ్దము వాడబడుచున్నది.

శ్లో॥ యజ్ఞేతపసి దానే చ స్థితి స్సదతి చోచ్యతే.
కర్మ చైవ తదర్థీయం స దిత్యేవాభిధీయతే. 27

యజ్ఞము, తపము, దానము, యీ మూడింటికిని సంబంధించిన నిష్ఠకూడ సత్‌శబ్దము తోడనే చెప్పబడుచున్నది భగవత్ప్రీతి నిమిత్తమగు కర్మము కూడ సత్‌శబ్దము తోనే చెప్పబడుచున్నది.

శ్లో॥ అశ్రద్ధయాహుతందత్తం తపస్తప్తంకృతంచయత్.
అసదిత్యుచ్యతే పార్థ నచ తత్ప్రేత్యనో ఇహ. 28

బ్రహ్మము యొక్క నిర్ణయ పద్ధతి తెలియక. అశ్రద్ధతో అనుష్ఠితమైన యజ్ఞము యొసగబడిన దానముచేయబడిన తపస్సు, మరియూ ఇంక నెయ్యది వొనర్పబడినదో, అది అంతయూను. అసత్తు అని చెప్పబడుచున్నది, అర్జునా! అవి వైగుణ్యముగుటవలన పరలోకమున గాని అయుస్కరిములగుటవలన ఇహలోకముననూ గూడ నిష్ఫలము లగుచున్నవి.

17 వ అధ్యాయము, సమాప్తము



# అస్పర్శయోగము అనే
# శ్రీ మద్భగవద్గీత
# రాజయోగీయము
## అష్టాదశాధ్యాయము
## మోక్ష సన్న్యాస యోగము

అర్జున ఉవాచ :

శ్లో॥ సన్న్యాసస్య మహాబాహో తత్త్వ మిచ్ఛామి వేదితుం,
త్యాగస్య చ హృషీకేశ పృథక్కేశినిషూదన. 1

అర్జునుడు పల్కెను. శ్రీ కృష్ణా, హృషీకేశా, కేశివినాశకా, సన్న్యాసము యొక్కయు, త్యాగము యొక్కయు తత్త్వమును వేరు వేరుగా తెలిసికొన గోరుచున్నాను.

శ్రీ భగవా నువాచ :

శ్లో॥ కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయోవిదుః
సర్వకర్మఫలత్యాగం ప్రాహుః స్త్యాగం విచక్షణాః 2

శ్రీ భగవానుడు పల్కెను. స్వర్గాది ఫలముల కొరకు కామ్య కర్మముల పరిత్యాగమును పండితులు సన్న్యాసమందురు. అనుష్ఠేయములగు నిత్యనైమిత్తికములగు సమస్త కర్మముల ఫలత్యాగమును జ్ఞానులు త్యాగమందురు.

శ్లో॥ త్యాజ్యం దోషవదిత్యేకే కర్మప్రాహుర్మనీషిణః,
యజ్ఞ దానతపఃకర్మ నత్యాజ్య మితి చాపరే. 3

కొందరు పండితులగు సాంఖ్యవాదులు కర్మము బంధకారణము కనుక త్యజింపదగినది అందురు. మరికొందరు మీమాంసకులు యజ్ఞ దాన తపో రూపములగు కర్మములు త్యజింపకూడదు అందురు.

శ్లో॥ నిశ్చయంశృణుమేతత్ర త్యాగేభరతసత్తమ,
త్యాగోహిపురుషవ్యాఘ్ర త్రివిధస్సంప్రకీర్తితః 4

భరతశ్రేష్ఠా యీ త్యాగ విషయమున నా సిద్ధాంతమును వినుము పురుషప్రవరా త్యాగమే సత్త్వాది గుణభేదముచే మూడు విధములని చెప్పబడినది.

శ్లో॥ యజ్ఞదానతపఃకర్మ నత్యాజ్యంకార్యమేవతత్,
యజ్ఞోదానంతపశ్చైవ పావనాని మనీషిణామ్ 5

యజ్ఞ, దాన తపోరూపమగు కర్మమును త్యజింపగూడదు. దాని నొనర్చుటయే కర్తవ్యము. యజ్ఞము, దానము తపస్సునుగూడ ఫలాభిసక్తిలేని బుద్ధిమంతులకు అంతఃకరణ శుద్ధికరములు.

శ్లో॥ ఏతాన్యపితుకర్మాణి సంగంత్యక్త్వాఫలానిచ,
కర్తవ్యానీతిమేపార్థనిశ్చితంమతముత్తమమ్ 6

అర్జునా! కాని ఈ కర్మములే కర్తృత్వరహితముగ ఫలములను త్యజించి చేయదగినవి అని నా స్థిర మొనర్పబడిన శ్రేష్ఠమగు అభిప్రాయము.

శ్లో॥ నియతస్యతుసన్న్యాసః కర్మణోనోపపద్యతే,
మోహాత్తస్య పరిత్యాగ స్తామసఃపరికీర్తితః 7

కాని నిత్య కర్మముల త్యాగము యుక్తియుక్తముకాదు అవివేకము వలన యీకర్మలను త్యజించుట తామసము అనబడుచున్నది

శ్లో॥ దుఃఖమిత్యేవయత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్,
సకృత్వారాజసంత్యాగంనైవత్యాగఫలంలభేత్ 8

యెవడు కర్మమును కష్టప్రదమని తలచి శరీరము నొచ్చుననే భీతితో త్యజించునో, అతడు రాజసమగు త్యాగమును చేసి మోక్షమును పొందనేపొందడు.

శ్లో॥ కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున!
సఙ్గం త్యక్త్వా ఫలం చైవస త్యాగస్సాత్త్వికో మతః. 9

అర్జునా! కర్తృత్వమును ఫలమును గూడ త్యజించి కర్తవ్యము అని యే నిత్యకర్మము అనుష్ఠింపబడుచున్నదో ఆ కర్తృత్వ ఫలముల త్యాగమే సాత్త్వికమని నిశ్చయము.

శ్లో॥ న ద్వేష్ట్యకుశలం కర్మకుశలే నానుషజ్జతే,
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః. 10

కర్తృత్వమును ఫలమును త్యజించి నిష్కామ కర్మానుష్ఠాన మొనర్చు వ్యక్తి, ఆత్మ జ్ఞానియును సత్వగుణయుక్తుడై అవిద్యా కృత ములగు సంశయములన్నిటినుండియు ముక్తుడైనప్పుడు కామ్య కర్మము లను సంసారకారణమని ద్వేషింపడు. మోక్షకారణములని నిత్యకర్మ ముల ప్రీతిగొనడు పూర్ణనిష్టయందుండును. ఇదియే పూర్వోక్తమగు కర్తృత్వరహిత కర్మయోగఫలము అనగా తామరాకు మీదినీటిబిందువు వలె వుండును. అర్జునా! కర్తృత్వ రహితకర్మ త్యాగము వలన కలుగు జ్ఞాననిష్ఠయు ఫలమును తెలిసికున్నావా.

శ్లో॥ న హి దేహభృతా శక్యంత్యక్తుం కర్మాణ్యశేషతః,
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే 11

గుర్తెరిగే దేహాభిమానులకు సంపూర్ణముగ కర్మములను త్యజింప సాధ్యముకాదు. కనుక కర్తృత్వరహిత కర్మఫల త్యాగియో. అతడు త్యాగి యని చెప్పబడును.

శ్లో॥ అనిష్ట మిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్,
భవత్యత్యాగినాం ప్రేత్యన తు సన్న్యాసినాం క్వచిత్. 12

ధర్మాధర్మ రూపములగు కర్మములకు ఫలముగ మరణానంతర మున పశ్వాదియోనుల జన్మము. దేవాదియోనుల జన్మము. మనుష్య

